

కీ. శే. పేరాల భరతశర్మగారు

విశాఖ పట్టణం

# చైతన్యకవిత

"*Fear is poetry; hope is poetry; love is poetry; hatred is poetry. Contempt, jealousy, remorse, admiration, wonder, pity, despair or madness - are all poetry. Poetry is that fine particle within us that expands, rarefies, refines and raises our whole being. Without it man's life is poor as beast's. Man is a poetical animal.*"

*-William Hazlitt*


సంపాదకుడు

**తంగిరాల సుబ్బారావు**

సహాయకులు

రాజేశ్వరీ దివాకర్ల

అంబికా అనంత్

వాసు

# వాళ్ళు లేని ఇల్లు

-వై. ముకుంద రామారావు

ఒరే బాబూ
రేపో మాపోలా ఉందిరా మీ అమ్మ
నేనూ అంతే
వీలైతే మళ్లీ రారా
అమెరికా అంత దూరంనుండి మాట్లాడినా
నాన్న ఆవేదన అదే

★ ★ ★

అమ్మకి
నాన్న మీద ఎన్ని ఫిర్యాదులున్నా
ఆయన్ని కనిపెట్టుకు కూర్చునే యంత్రం
చూస్తూ చేస్తూనే మంచమయింది
ఎముకల గూడు
దానిమీద చర్మం
అందులో కొట్టుమిట్టాడుతున్న ప్రాణం

★ ★ ★

నాన్న
వాకిట్లో వాలు కుర్చీగా మారినా
అమ్మ సేవలతోనే అన్నీ గడిచినా

అంతలోనే ఎంత మార్పు
తనకోసం తాను మరచిపోయి
అమ్మని కాపాడు కోవాలనే ఆత్రం

★ ★ ★

బహుశా
ముసలితనం
వాయిదాల మరణం
ఎవరేమిటో
లోతుగా తెలుసుకునే సమయం

అమ్మా నాన్నా
ఒకరి తరువాత ఒకరు
హఠాత్తుగా ఖాళీ చేసేసే ఇళ్లు
విత్తనాలన్నింటినీ విదిల్చి పోయే చెట్లు

ఎన్నెన్ని జ్ఞాపకాల గోడల్లా పిల్లలున్నా
ఇల్లంతా ఎంత శూన్యం!

(91 ఏళ్ల నాన్న, 86 ఏళ్ల అమ్మ, 80 ఏళ్ల వారి సహజీవనం-
వారం రోజుల వ్యవధిలో ఇద్దర్నీ కోల్పోయాక)

నాన్న: కీ.శే. యల్లపు ఎల్లయ్య నాయుడు (1912-2003)

# BE AWARE... BUT STILL

1. Your kindness may be treated as your weakness..., still be kind.

2. Your help to others may go unheeded and unnoticed..., still be helpful.

3. If you are successful, you will win false friends and true enemies..., still succeed.

4. Honesty and frankness make you vulnerable ..., still be frank and honest.

5. The good you do today will be forgotten tomorrow..., still do good.

6. Your forthrightness may be treated as high-handedness..., still be forthright.

7. Virtues and values of life may mean little for people..., still be virtuous.

8. Your faith in God and love for humanity may be taken as orthodoxy and foolishness..., still have faith in God.

*Braving challenges of modern therapeutics*

# చైతన్య కవిత

## 38 & 39

స్వభాను శరత్తు - తారణ వసంతం
October 2003 & April 2004

సంపాదకుడు

ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

సహాయకులు

డా॥ దివాకర్ల రాజేశ్వరి - అంబికా అనంత్
వాసు - వై. ముకుందరామారావు
ఇంద్రకంటి పినాకపాణి
గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డి
దాసరి అమరేంద్ర -నండూరి భాస్కర్


చైతన్య కవితా వేదిక
40/12-7 ''సౌరభ'' (మేడపైన)
22వ క్రాస్, గోవిందరాజనగర్, విజయనగర్
బెంగుళూరు - 560 040

**CHAITANYA KAVITA,** an anthology devoted to Modern Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, October, 2003 and April, 2004.

Pp. 168

ముఖచిత్రం : మహాకవి ఉత్పల సత్యనారాయణాచార్య గారు
అలకాపురి, హైదరాబాద్ - 500035 ఫోన్: 040-24033511

అట్టవెనుక : విద్వత్కవి శేఖరుడు శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు గారు
ధర్మపత్ని శ్రీమతి నవరత్నమాంబగారితో
నల్లూరు, (వయా) రేపల్లె, గుంటూరు జిల్లా

అక్షరాలంకరణ: ఆచార్య పి.సి. నరసింహారెడ్డి
కళాప్రపూర్ణ శ్రీ 'బాపు'

| వెల | | | |
|---|---|---|---|
| : | విడిప్రతి | : | రూ. 40-00 |
| | జీవిత సభ్యత్వం | : | రూ. 500-00 |
| | పోషక సభ్యత్వం | : | రూ. 1,000-00 |
| | విదేశాలలో | : | $ 100 |

**For Copies** : **Prof. T.V. Subba Rao** M.A., Ph.D. (Retd.)
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040
Ph.: 080-2330 59 02

**M/s. Visalaandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches.

**DTP and Printed By** : **Sree Laxmi Screenographics**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Ph: 2330 00 93

# అంకితం - 1

(శరత్పంచిక)

**17-10-2003** నాటికి **80** శరత్తులు నిండిన

ప్రసిద్ధ అభ్యుదయ రచయిత, అనువాదకుడు,

బెంగుళూరు 'అరసం' శాఖ అధ్యక్షులు అయిన

శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు గారికి ...

ఆయురారోగ్య సంపత్ పరంపరాభివృద్ధిని

ఆకాంక్షిస్తూ ...

-తంగిరాల-రాజేశ్వరి-అంబిక

# అంకితం - 2

(వసంత సంచిక)

నా

'రేనాటి' సీమ వీరగాథల పరిశోధనాకాశంలో

సూర్యచంద్రుల్ని ఉదయింపజేసిన

కోవెలకుంట్ల 'పచ్చిపూలరంగడు'

**శ్రీ ముక్కమళ్ళ నారాయణ రెడ్డిగారికీ ...**

నెల్లూరు 'సాలగ్రామ వామనుడు'

**శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డికీ ...**

ఆయురారోగ్య సంపత్ పరంపరాభివృద్ధిని ఆకాంక్షిస్తూ ...

- తంగిరాల



శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు : శ్రీమతి నిడమర్తి శ్యామలాదేవి
బెంగుళూరు 'అరసం' శాఖ అధ్యక్షులు ('నా ఎల్లి చౌక్యా మిత్రుడు')



కీ.శే. యల్లపు ఎల్లయ్యనాయుడు: కీ. శే. యల్లపు ఎఱుకలమ్మ
ఖరగ్ పూర్ ('వాళ్ళు లేని ఇల్లు')



శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డి
నెల్లూరు



శ్రీముక్కమళ్ళ నారాయణరెడ్డి
కోవెల కుంట్ల, కర్నూలు జిల్లా



కీ. శే. జవాద్ హుస్సేన్
తిరుపతి



కీ.శే. మేకా రంగయ్యప్పారావు
నూజివీడు, కృష్ణా జిల్లా



కీ.శే. మిరియాల రామకృష్ణ
హైదరాబాద్



శ్రీ నందూరి భాస్కర్‌తో
కీ. శే. నందూరి రామకృష్ణమాచార్య



కీ. శే. పాల్చూరి వెంకట కృష్ణారెడ్డి
ఎల్లాయ పాలెం, నెల్లూరు జిల్లా



కీ. శే. భళ్ళమూడి కృష్ణమూర్తి - శ్రీ తంగిరాల సుబ్బావధానులు

(మేనమామ) (మేనల్లుడు)



డా॥ అద్దేపల్లి రామమోహనరావుగారికి తిలక్ అవార్డు (2003)

నన్నయ భట్టారక పీఠం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా



ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

శ్రీరస 'నెలనెలా వెన్నెల' లో 'వెన్నెల నవ్వు'



డా॥ మైలవరపు శ్రీనివాసరావు గారికి

శ్రీరస సాహిత్య వసంతోత్సవాలలో సన్మానం ( అంబిక, తంగిరాల, చంద్రశేఖర రెడ్డి)



సన్మానితులు శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి దంపతులు
(గామాలపాడు, గుంటూరు జిల్లా), శ్రీరస దశమ వార్షికోత్సవ సభలు




శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు రచించిన 'మాఘ మేఘములు'
కావ్యాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు




శ్రీరసలో 'మాఘ మేఘములు' కావ్యాన్ని గురించి ప్రసంగిస్తున్న
ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు



శ్రీరస సాహిత్య సంక్రాంతి సభలో పోతన భాగవతాన్ని
గురించి ప్రసంగిస్తున్న శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు

# శరత్తారలు - వసంత కోకిలలు

# నా ఎఱ్ఱచొక్కా మిత్రుడు

-తంగిరాల

మీది ఉత్తరధ్రువం
నాది దక్షిణధ్రువం
అయినా సరే -
రెండు చోట్లా
గడ్డకట్టిన
గాఢమైన
చెలిమి మంచు
సరిసమానం ...

మీ ఉత్తర ధ్రువం ప్రక్కనే
అరిగిపోయి
విరిగిపోయి
త్రుప్పు పట్టిన
కత్తి సుత్తుల ఇనుప ముక్కలు ...
చిరిగిపోయి, వన్నె
తరిగిపోయిన
ఎఱ్ఱ జెండా పీలికలు పేలికలు ...

నా దక్షిణ ధ్రువం నిండా
కాషాయ పతాకాలు రెపరెపలాడుతున్నాయనీ
వాటి మధ్యలో నేను పిలకజుట్టు పెట్టుకొని
పద్మాసనం వేసికొని,
త్రిపుండ్రాలు ధరించి
యజ్ఞోపవీతాన్ని సవరించుకుంటూ
త్రికాల సంధ్యావందనం చేస్తున్నానని
మీ అనుమానం!

నిజానికి
మీరు చూస్తున్నది -
ధ్రువాకాశంలోని
ఉదయ ప్రదోష సంధ్యారుణిమలే తప్ప
కావి జెండాల కాంతులు కానే కావు!
నేను
సూటూ బూటూ వేసికొని
బారులో కూర్చుని బీరుతాగుతున్నానే తప్ప
సంధ్యావందనం కలలో కూడా చేయటం లేదు!
సర్వభ్రష్టుడు 'నిగమశర్మ' మా కజిన్ బ్రదరండీ!
అన్నట్టు - ఇంకో అనుమానం కూడా మిమ్మల్ని పట్టి పీడిస్తోంది -
'బాల థాకరే' మా మేనమామ కొడుకనీ
'ప్రవీణ్ తొగాడియా' సాక్షాత్తూ మా మేనత్త కొడుకనీ
బాబ్రీ మసీదు విధ్వంసక సాధుపుంగవులందరూ
మా దగ్గరి బంధువర్గమనీ మీ అనుమానం!

ఓ ఆర్యోత్తమా!
నా అనుంగు మిత్రసత్తమా!
నాకూ కొన్ని అనుమానాలున్నాయి ...
మీరు ఎల్లప్పుడూ రష్యన్‌మేడ్ ఎఱ్ఱకళ్ళద్దాలే పెట్టుకుంటారనీ
దాంతో మీరు వేటాడే సాహిత్యపు తెల్లకుందేళ్ళు కూడా ఎఱ్ఱగా కనబడతాయనీ
'మీరు పట్టిన కుందేటికి మూడేకాళ్ళు' అంటారనీ
ఎఱ్ఱచొక్కా తొడుక్కున్నవాళ్ళని తప్ప ఇంకెవ్వరనీ నమ్మరనీ
నా అనుమానం ...
మీ అనుమానం మీది
నా అనుమానం నాది
ఈ అనుమానాల పెనుభూతాల మీదనే
మన మైత్రికి గట్టి పునాది!

మీదీ మాదీ
ఇద్దరిదీ గోదావరీ పశ్చిమతీరమే

ఇద్దరివీ కుగ్రామాలే
మీది 'గూడెం' దగ్గర 'నిడమర్రు'
మాది 'తణుకు' దగ్గర 'ఇల్లిందలపర్రు'
కానీ –
మీది కోరమీసాల గిరజాల జులపాల పౌరుష నామధేయాల
గ్రామ రాజకీయ మూలాల కరణాల దర్జా వర్గం!
ఆరు వేల అధికారముద్ర రాజయోగుల రహస్య దుర్గం!
మాది వేదఘోషల హోమాగ్నుల పంచశిఖల
శుభవివాహాల అశుభ శ్రాద్ధకర్మల మెత్తని పురోహిత వర్గం!

నా యెదుట వామనమూర్తి!
మీ యెదుట త్రివిక్రమ స్ఫూర్తి!
ఇద్దరూ ఒకే అవతారం ఆద్యంతాలు!
మీది అరుణ పతాకం!
నాది కరుణ పతాకం!
ఆకలి శత్రువుపై ఇద్దరిదీ సంయుక్త దండయాత్ర!
పదండి ముందుకు
పడండి త్రోసుకు
పోదాం పోదాం 'పై పైకి'!
అవును
పండుటాకులమైన మనం
పోవాలి 'పైపైకి'
అయినా ఏమిటీ తాపత్రయం?
'అరసం' గోష్ఠి వినోదాలు
'శ్రీరసం' నెలనెలా వెన్నెలలు
సాహిత్య సభలు, సమావేశాలు
వయసు మళ్ళిన మనకు ఏమిటీ హడావిడి?
అందరిదీ 'ఈషణత్రయం'!
దారేషణ- ధనేషణ- పుత్రేషణ
మనిద్దరిదీ మాత్రం 'సాహిత్య గవేషణ'!

మన 'విచిత్ర మైత్రికి' పునాది ఇదే!
అయినా ఇందులో చిత్ర విచిత్రమేముంది?
మీ కామ్రేడ్ 'విశాలాంధ్ర రాఘవాచారి'
మా క్లాస్‌మేట్ 'రామాయణం ఉషశ్రీ'
ఇద్దరూ కలిసి
చెట్టాపట్టాలేసుకొని,
ఒకే రిక్షాలో విహరించేవారు బెజవాడ నడివీథుల్లో
ఇద్దరిదీ ఒకే బ్రాండు సిగరెట్టు!
ఇద్దరిదీ ఒకే బ్రాండు బ్రాందీ విస్కీ పట్టు!!
అవును అది భిన్నధ్రువాల ఆకర్షణ మైత్రికి నెలకట్టు!!

పెళ్ళిళ్ళకీ పేరంటాలకీ ఆడవాళ్ళకి
కంచిపట్టుచీరల గరగరలు కలకలలు!
సాహిత్య సభలకీ సమావేశాలకీ మీకు
ఎఱ్ఱచొక్కా తళతళలు
రెడ్‌ఆర్మీ కవాతు ధగధగలు!!
తండ్రి దశరథుడు స్థాపించిన గ్రామ గ్రంథాలయం,
బమ్మెర పోతన పేరుతో
పుస్తక భాండాగారం!
రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు
నిడమఱ్ఱులో లంకంత కొంప
250 ఎకరాల మాగాణి
మార్క్సిజం కొల్లేటి ముంపులో
అంతా కృష్ణార్పణం!

అన్న అశ్వనీకుమార దత్త ఉత్తమ మార్గదర్శకత్వంలో
సమసమాజ స్థాపనోద్యమ మహాప్రస్థానంలో
ధర్మజుని అనుసరించిన అనుంగు తమ్ముడు
విశాలాంధ్ర సాహిత్యానుబంధ రథసారథి
మాస్కో మహానగరంలో
పదిహేనేళ్ళు కొనసాగిన

ప్రగతిశీల ప్రచురణల సత్రయాగంలో
అతి ముఖ్య అధ్వర్యుడు!
ఆనాటి కాళోజీనుండి
ఈనాటి ఛోటా కవీజీల వరకూ
వందలాది సాహిత్య గోష్ఠుల
అందమైన నందనవనాల తోటమాలి!

పల్లెలో
నాలుగు దిక్కులకూ పరచుకున్న
మండువా లోగిలిపోయి
పట్టణంలో
సిమెంటు కీకారణ్యంలో
ఇరుకు పావురాళ్ళ గూళ్ళలో
చిట్టచివరి అరలో
ఒదిగిన వృద్ధ కపోత దంపతులు ...
శనికి భయపడి
మట్టిచెట్టు తొఱ్ఱలో దాక్కున్న
పార్వతీ పరమేశ్వరులు!

ఓ నా ఎఱ్ఱచొక్కా మిత్రుడా!
యాభైయారేళ్ళ స్వాతంత్ర్యంలో
ఏమీ మారని ఈ మన భారతావనిలో
ఆకలి ఎండలు మండుతున్నంత కాలమూ
అవినీతి తుఫానులు వీస్తున్నంత కాలమూ
నిరుద్యోగపు మంచు కురుస్తున్నంత కాలమూ
ధనవంతుల ప్రభుత్వాలు
శ్రమజీవన సౌందర్యాన్ని
దోపిడీ చేస్తున్నంత కాలమూ
బవిరిగెడ్డాల గూండా రాజకీయవేత్తలు
వేలకోట్ల రూపాయల శ్కాముల స్వాములుగా మారుతున్నంత కాలమూ

నిరుపేదలు ఇంకా ఇంకా అధఃపాతాళానికి అణగద్రొక్కబడుతున్నంత కాలమూ
మహిళలపై అత్యాచారాలు Acid Attacks గొంతుకోతలు జరుగుతు
న్నంతకాలమూ, దళితులపై దౌర్జన్యాల అస్పృశ్యతా ఘోరాల నగ్న ప్రదర్శనలు
ఆడుతున్నంత కాలమూ
నిన్నూ నీ మార్క్సిజాన్నీ అధిక్షేపించే హక్కు
నాకే కాదు, నన్ను పుట్టించిన ఆ జేజెమ్మకు కూడా లేదు!
అన్నట్టు మరిచి పోయాను
మీరు అమ్మనూ జేజెమ్మనూ నమ్మరు కదా!

చిన్నప్పుడు -
తణుకు బజార్లో గారడీవాడి మోళీవిద్య
డోలక్ గజ్జెల మోత, డమరుకం డమడమ కూత
పామూ-ముంగిస పోట్లాట
మెస్మరిజంతో మూర్ఛపోయిన అమ్మాయిని
తాయెత్తు మహిమతో తాడిప్రమాణం లేపుతానన్న
ఐంద్రజాలికుని భీష్మ ప్రతిజ్ఞ
నమ్మిన నా లేతకళ్ళలో ఆనందం ఆశ్చర్యం!
గారడీ అయిపోయింది
అమ్మాయి మామూలుగా లేచి వెళ్ళిపోయింది ...
ఇప్పుడు -
వర్గకలహం పామూ-ముంగిస జగడం
దరిద్రంతో మూర్ఛపోయిన మాతృభూమి
ప్రజాస్వామ్యపు తాయెత్తు మహిమతో
తల్లినేల తాడిప్రమాణం లేస్తుందనే ఆశతో
మసక మసక కళ్ళతో నా
ముసలి చూపులు!
రాజకీయ పక్షాల ఇంద్రజాల మహేంద్రజాలాలు కొనసాగుతూనే ఉన్నాయి ...

ఉత్తమ నిడమర్తివంశ క్షీరసాగర సంభూత పూర్ణశశాంకుడా!
'శ్యామలా' ఉమాసహిత 'రాజరాజేశ్వరు'డా!

ఎనభై శరత్తులు నిండిన మిమ్మల్ని
ఏడుకొండలసామి రక్షిస్తాడు!
త్వరలో
సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సం చేయిస్తాడు!
అప్పుడు -
మా 'శ్రీరస' మళ్ళీ మీకు
పూర్ణకుంభ స్వాగతం ఇస్తుంది!
ఎంత వద్దనుకున్నా మళ్ళీ మీకు వేదఘోష వినిపిస్తుంది!
మీ దంపతులు
నిండు నూరేళ్ళు బ్రతకాలని మనసారా ఆశిస్తుంది!
భవతు! శుభం భూయాత్!
శివాస్తే పంథానస్సంతు!
శతమానం భవతి శతాయుః పురుషః
శతేంద్రియ ఆయుష్యేవింద్రియే ప్రతితిష్ఠతి!

# To the Grand Octogenarian

**- Ambika Ananth**

His love entwined itself to my heart,
throbbing along with it.
It runs in my blood and bonds in my bones.
When he feels sad,
my cheeks become wet with tears.
His words of courage act like sunlight
clearing my dark fears.
He teaches me to ponder and prepare
to face life's vagaries without despair ....
He is the grand octogenarian - Shri N.U.R. Rao
He is always progressive in action and thought,
His soul mate Shyamala Devi follows him with
Love and commitment ..
Un deterred, unshaken and unafraid,

He fights life's rocky edges,
with his strong character of Himalayan heights ....
He is a translator - par excellence
He is a pioneer and path maker
For many souls he is a mentor
For my family and me he is a Godfather.

## 'పచ్చిపూల రంగడు'

- తంగిరాల

రేనాటి సీమ నట్ట నడుమ
దట్టమైన నల్లరేగడి గట్టుల మధ్య
తెల్లని నురుగులతో
ఉరుకులతో పరుగులతో
కుందునది!
మానవజాతి చరిత్రను భారంగా మోస్తూ
మంచినీ చెడునూ నెమరు వేసుకుంటూ
అనంత కాల రహస్యాలను తన గర్భంలో దాచుకుంటూ
కుముద్వతీ తరంగిణి!
ఆ కాల ప్రవాహంలో 20వ శతాబ్ది ఉత్తరార్ధంలో
వీరగాథల పరిశోధనా సమయంలో నేనూ-నా 'పచ్చిపూల రంగడూ'!

ఆ కుందుగడ్డ రెడ్డి బిడ్డ చెలిమి
నాకు వేయి ఏనుగుల బలిమి
మహానందిలో స్వయంభూ పాతాళ గంగా జలాల స్వచ్ఛత
ఆణిముత్యాలవంటి జొన్నల రాసులు ఊసులు
పండిన ప్రత్తిచేల పువ్వులు నవ్వులు!

ఉరికొయ్యకు వ్రేలాడిన 'ఉయ్యాలవాడ నారసింహా' వీరుని శిరస్సును
మీ పట్టుదల 'నారాయణ' మంత్రంతో బ్రతికించారు

స్వాతంత్ర్య సంగ్రామ శరీరానికి అతికించారు
కుడిమీసం కొనగోట దిద్దించారు
దేశభక్తి మత్తగజం మీద ఊరేగించారు.
డొక్కల కరవులో బక్కజనుల ప్రాణదీపాలు ఆరిపోకుండా
అన్నపానాల ఆవునేతుల ఘుమఘుమధారలు కురిపించిన
రాయలసీమ దానకర్ణుడు బుడ్డా వేంగళరెడ్డి కీర్తి చంద్రికలకు
శరదృతువును సృష్టించినవారు మీరు!

ఒక ప్రసిద్ధ యుద్ధవీర ప్రచండ మార్తాండుని దుర్నిరీక్ష్య ప్రతాపంతో
నూటికీ కోటికీ కాని కానరాని ఒక దానవీర శీతమయూఖుని చల్లని వెన్నెలతో
'కోవెలకుంట్ల' సూర్యసోమవీథుల్ని పులకింపజేశారు
సంస్మరణ సభల నిత్యకల్యాణం చేయించారు
నాటక ప్రదర్శనల పచ్చతోరణం కట్టించారు
ఒకటా? రెండా?
ఏడు సంవత్సరాలు ఏకధాటిగా ఈ వీరమహోత్సవం!

ఓ 'ముక్కమళ్ళ' వంశ పాలకడలి శయనా!
సౌజన్య 'నారాయణా'!
సాహిత్య వేద పారాయణా!
మెడలో వాడని దండతో రంగడు వెలసిన నేలమీద -
తెలుగుజాతి చరిత్ర ముఖపత్రం మీద మొట్టమొదట
వెలుగు శాసనాలు లిఖించిన నేలమీద -
ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుని కవోష్ణరక్తంతో తడిసి పునీతమైన నేలమీద
దాన రాధేయుని దయావర్షం కురిసి ఆర్ద్రమైన నేలమీద -
మన మైత్రి
జీవన కర్పూర తాంబూలంలో
జాజికాయ జాపత్రి!
'రేనాటి సీమ' రోదసిలో
అహోరాత్రాలను వెలిగించే
'సూర్యచంద్రుల' సాక్షిగా -

రైతుల పాలిటి రసధునిగా
నిరంతరం ప్రవహించే
కుందునది సాక్షిగా -
మీ స్నేహం
నా జన్మకు తీరిన దాహం!
భావితరాలకు ఇది ముదావహం!!

(కర్నూలు జిల్లా కోవెలకుంట్లలోని శ్రీపాండురంగ విఠలేశ్వరస్వామివారికి 'పచ్చిపూల రంగడు' అని పేరు. ఆయనకు అలంకరించిన పూలదండ వాడిపోదు)

# సాలగ్రామ వామనుడు

- తంగిరాల

నా బ్రతుకు పయనంలో
తిరుపతి మజిలీ గున్నమావి తోపులో
సాహిత్య వసంతం విరిసినప్పుడు
చెలిమి చిట్టిపాటలు పాడిన పొట్టికోకిల
పిట్ట కొంచెం కూత ఘనం!

సంగాతగాళ్ళతో కలసి అల్లరిచేస్తూ
నా వెనకాల వెటకారపు తాటాకులు కట్టిన దిట్ట.
తిల తండుల న్యాయంగా
తల నెరసిన ఎం.ఏ. విద్యార్థిని నన్ను
యౌవనదశలోనే 'తాతయ్య'ను చేసిన స్రష్ట.

మా 'బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి' అచ్చమైన చెలికాడు
స్వచ్ఛమైన స్నేహాన్ని గాలిగా పీలుస్తాడు నీరుగా సేవిస్తాడు
కూడుగా స్వీకరిస్తాడు గుడ్డగా ధరిస్తాడు
పవిత్ర నిత్యాగ్నిహోత్రంగా జ్వలింపజేస్తాడు
అంతులేని తన అంతరంగపుటాకాశాన్నుండి
వాత్సల్యజ్యోత్స్నలు విరివిగా కురిపిస్తాడు

సౌహృదగంధపు చంపకమాలలు కూర్చి
మిత్రకోటిని సత్కరిస్తాడు.
చదివింది గణాంకశాస్త్రమైనా
సాహిత్యమంటే పడిచస్తాడు!
భౌతికరూపంలో వామనుడే కావచ్చు
సౌహార్దంలో మాత్రం
సఖుల మనోలోకాలను
సంపూర్ణంగా ఆక్రమించిన
త్రివిక్రముడు!

రంగులో నెల్లూరు రంగనాథస్వామి నల్లశిలకన్నా మిన్న
ఎత్తులో టోపీలేని లాల్‌బహదూర్ శాస్త్రి కూడా చిత్తు
సిగరెట్లు గుప్పడంలో పాతకాలపు బొగ్గు రైలు ఇంజను పోలిక
బ్రహ్మచర్యవ్రతంలో సి. ఆర్. రెడ్డిగారి చాలిక
ఇంటిలోంచి బయటకు వస్తే
సూర్యుణ్ణి బ్లాక్‌అవుట్ చేయడం ఇతనికి చాలా తేలిక!

'నల్లనివాడు చిన్నినయనంబులవాడు'
మంచి పనులు చేయడంలో
'ముక్కుమళ్ళ' కు చేదోడు వాదోడు
నలభైఏళ్ళుగా నాకు సైదోడు!
ఈ 'బసిరెడ్డి' వంశ 'దే(హ)శూరుడు'
ఉన్నట్టుండి 'కొండవీటి రెడ్డిరాజును నేనే' అంటాడు
'కావలిస్తే చరిత్ర పుటలు తిరగేసుకో' మంటాడు
ఏ కోణం నుండి చూచినా ఈ మా చిట్టిపొట్టి రెడ్డి
ఘనాఘన సముడు
అఘటన ఘటనా సమర్థుడు
మిత్రుల గుండెల దేవతార్చన పెట్టెల్లో
నిత్యాభిషేకాలు స్వీకరించే
సాలగ్రామ వామనుడు!

## సంపాదకీయం:

# దారుణ ఉగాది

-తంగిరాల

ఇది 'ఉగాది' కాదు, 'యుగాది'
కలియుగానికి ఆది
'శాలివాహన', 'విక్రమ', 'యుధిష్ఠిర' శకాలు
చుట్టుకున్న శ్రీకారం ఇది
అసలు బ్రహ్మదేవుని సృష్టికే ఇది పునాది.

ధర్మక్షేత్రం కురుక్షేత్రంలో
ద్వైపాయనహ్రదం దగ్గర అధర్మంగా
శ్రీకృష్ణుడు 'ఎన్‌కౌంటర్' చేయిస్తే
తొడలు విరిగి పడిన దుర్యోధనుడు
అశ్వత్థామకు పట్టంకట్టి
'ఎ.కె. 47 రైఫిల్' చేతికిచ్చి
అర్ధరాత్రి పంపాడు పాండవ బలం మీదికి.
పద్దెనిమిది దినాలు యుద్ధం చేసి
అలసి సొలసి ఆదమరచి నిద్రపోతున్న ఆ సైనికుల్లో
మనమంతా మమేకమై నిశ్చింతగా పడుకున్నాం
భగవంతుణ్ణే నమ్ముకున్నాం
పాండవుల్ని కాపాడిన పరమాత్మ
పాపాత్ములమైన మనల్ని శిక్షించాడు
తెల్లవారేసరికి -
ఖండఖండాలుగా నరకబడ్డాం
కాకులకు గ్రద్దలకు వేయబడ్డాం.
ఆనాడు ఆరంభమయిన కలియుగాదే
ఈనాడు మన ముంగిట వ్రాలిన 'తారణ ఉగాది'!

ఇది ఎన్నికల చైత్రమాసం
పెద్ద ఎత్తున దండెత్తి వచ్చిన హింసా వసంతం!
అధికార పీఠంకోసం గుంటనక్కల కోలాహలం
దశదిశలకూ నాల్కలు చాస్తున్న హాలాహలం
రకరకాల పార్టీ పతాకాల్ని చిగురించాయి చెట్ల కొమ్మలు
రంగురంగుల వాగ్దానాల కాగితపు పూలు పూచాయి రెమ్మలు
గున్నమావి గుబురుల్లో కూర్చొని
కుహూనాదాలు చేస్తున్న కోకిలల్ని ప్రక్కకు తప్పించి
మేనిఫెస్టోల మైకుల్లో గోలగోల చేస్తున్న కాకులు
తీయని పూలతేనెలు త్రాగకుండా
నాటుసారాలో పూటుగా మునిగి తేలుతూ తుమ్మెదలు.

ఒకప్పుడు ఒకేపార్టీకి చెందిన మన్మథుడు వసంతుడు
ఇప్పుడు పెట్టుకున్నారు వేరువేరు కుంపట్లు
అయితే జెండామీది 'చేప' గుర్తు నాదంటే నాదంటూ
పట్టుకున్నారు సిగపట్ల గోత్రాలు
భాగవత కథలో గజకచ్ఛపాలు
వీళ్ళ పోరు పడలేక 'చాప' ఒకడికీ 'వేప' ఒకడికీ కేటాయించి
చేతులు దులుపుకున్నాడు ముఖ్య ఎన్నికల అధికారి ఇంద్రుడు.
కంతుని పార్టీకే చెందిన జయంతునికి టిక్కెట్టు హుళక్కి
అతని అనుచరులు అసురులై దండెత్తి వస్తే పార్టీ ఆఫీసు ధ్వంసం
నిన్నటి వరకూ నెత్తిని పెట్టుకొని మోసిన జెండాలకు అగ్గి
నాయకుల కటౌట్లు బుగ్గి
వసంతుడు ఆహ్వానించగానే అటు దూకేశాడు జయంతుడు!

కంతుడు వసంతుడు ఎన్నికల కత్తులు దూసుకున్నారు
పరస్పరం పచ్చిబూతులు తిట్టుకున్నారు
జోరుగా హుషారుగా ప్రచారం మొదలుపెట్టారు
నైతిక విలువల్ని ప్రక్కకు నెట్టారు
పుట్టుపూర్వోత్తరాలెత్తుకున్నారు, బురద చల్లుకున్నారు

చిలుకలరథం మీద ఒకడూ
పూలతేరు మీద మరొకడూ జైత్రయాత్రలు!
ఊరూ వాడా తిరుగుతూ ఓట్లకోసం ముష్టి!
అయినా ధైర్యం చాలలేదు
గెలుస్తామన్న ధీమా లేదు
అందుకే స్టార్ వాల్యూ ఉన్న రంభా ఊర్వశీ తిలోత్తమల కాళ్ళమీద పడ్డారు
కరుణించమని బ్రతిమాలారు
రహస్యంగా మూటల సంచులు ముట్టజెప్పారు.

''ఇది వసంతం!
నావల్లే చెట్లు చిగిర్చాయి, పూవులు పూచాయి!
Feel good! Feel good!"- వసంతుని ఘోష!

''ఏడిశావ్! ఇది శిశిరం!
ఆకులు రాలిపోయాయి, పూవులు వాడిపోయాయి,
చెట్లు మాడిపోయాయి నీవల్లే
Feel bad! Feel bad!"- మన్మథుని కంఠశోష!!

"I.T. Revolution, I.T. Revolution
Hi-tech City, Hi-tech Government
Computers, Computers
Globalisation, Free Market
నేడు ప్రపంచమంతా నా గుప్పిట్లో ఒక కుగ్రామం''
- వసంతుని ఘోష!

''నీ శ్రాద్ధం! నీ పిండాకూడు!
కంప్యూటర్ని కొరుక్కుతింటామా?
ప్రకృతిని రక్షించు, వర్షాలు కురిపించు
పంటలు పండించు, ఆకల్ని హతమార్చు
అక్షరాస్యతను పెంచు, నిరుద్యోగాన్ని నిర్మూలించు
జనాభాని నియంత్రించు, అప్పుడే జనత సుఖించు''
-మన్మథుని కంఠశోష!

ఉన్నట్టుండి గుట్టు రట్టయింది
మన్మథుడు 'మామిడి తోపు' సీటు కోసం
వసంతుడు 'పూలతోట' సీటు కోసం
పార్టీ అధినేతలకిచ్చారు పదేసి లక్షలు లంచం!
బడుగు చెట్ల పూలఓట్లు కొనడం కోసం
కేటాయించారు మూడేసి కోట్ల మూలధనం!
అసలు వీళ్ళిద్దరూ హత్యానేరాల్లో పేరుమోసిన రౌడీషీటర్లు!!
చెట్టు తిరుగబడింది, గట్టు తిరుగబడింది
పుట్ట తిరుగబడింది, పిట్ట తిరుగబడింది
నింగి తిరుగబడింది
నేల తిరుగబడింది
గాలి తిరుగబడింది, నీరు తిరుగబడింది
'ఇది ప్రజాస్వామ్యమా? ధనస్వామ్యమా? హంతకస్వామ్యమా?'
గులాబీలు గోలచేశాయి
మోదుగుచెట్లు నెత్తుటికత్తులెత్తాయి
అశోకాలు చంపకాలు గట్టిగా అరుస్తున్నాయి
మల్లెలు మొల్లలు మందారాలుగా మారిపోయాయి
సమశీతలంగా ఉండవలసిన వసంత వాతావరణం
ఎన్నికల వేడితో 40 డిగ్రీలు దాటిపోయింది!

అడవిలో దాక్కున్న మొగలి పొదల దళం
అర్ధరాత్రి రహస్యంగా గ్రామంలోకి చొచ్చుకొని వచ్చి
సర్పంచి మన్మథుణ్ణి చుట్టుముట్టి
ముళ్ళపూలబాకులతో పొడిచి చంపాయి.
'ఇది వసంతుడి కుట్రే' గుండెలు బాదుకుంటూ
గోడుగోడున దుఃఖపోతోంది రతీదేవి!

ఇది 'తారణ ఉగాది' కాదు,
ఎన్నికల హింసల 'దారుణ ఉగాది'!
ఇక్కడ పూలు వికసించడం లేదు
సింహం జూలు విదిలిస్తోంది

ఇక్కడ తుమ్మెదల ఝుంకారం లేదు
ఈగలు ముసురుతున్న నోరు తెరచి
పెద్దపులి ఆవులిస్తోంది.
ఇక్కడ కోకిలల మధురగానం వినరాదు
క్రౌర్య పర్జన్యం గర్జిస్తోంది.
కపట రాజకీయ దౌర్జన్యం గాండ్రిస్తోంది.

ఈ నదిలో నీలితరంగాల నీళ్ళు లేవు
ఇసుక తిన్నెలు లేవు, రాజహంసలు లేవు.
ఆత్మహత్యలు చేసుకున్న రైతుల శవాలు
ఎక్స్‌గ్రేషియా కోసం కుటుంబాల ఏడుపులు
ఆకలి, నిరుద్యోగం, కరవు, మార్క్సిజం-లెనినిజం, తుపాకులు, మందుపాతర్లు
రౌరవ హింసలు, నిత్యహత్యలు - మురికి నీరు ఉరవళ్ళు పరవళ్ళు
ముక్కుపుటాలు బ్రద్దలు కొడుతూ మూసీనది కుళ్ళు!

అప్పుడు -
సుగ్రీవుడు విభీషణుడు సొంత అన్నల్ని ఎందుకు చంపించారు?
కౌరవులు అన్యాయంగా అభిమన్యుని ఎందుకు చంపారు?
భీముడు దుశ్శాసనుడి గుండెలు చీల్చి రక్తం ఎందుకు త్రాగాడు?
దుర్యోధనుడి తొడలు ఎందుకు విరగ్గొట్టాడు?
అర్జునుడు (అన్న) కర్ణుని తల ఎందుకు తెగనరికాడు?
అలెగ్జాండర్, తైమూర్, జంఘిజ్‌ఖాన్, తామర్లేన్, ఘజనీ,
ఘోరీ, బాబర్, పర్షా, నాదిర్షాలు
కాలానికి కత్తుల వంతెన ఎందుకు కట్టారు?
ఔరంగజేబు అన్నదమ్ముల్ని ఎందుకు చంపాడు?

ఇప్పుడు-
వివిధదేశాల రాజకీయవేత్తలు హత్యలకు గురి అవుతున్నారెందుకు?
తీవ్రవాదుల రక్తతర్పణం ఎందుకు?

టిక్కెట్టురాని నాయకులు
సొంతపార్టీ ఆఫీసుల్నే బుగ్గిపాలు చేస్తున్నారెందుకు?
భిన్నపక్షాల రాళ్ళవానలు బాంబులదాడులు ఎందుకు?

ఎందుకంటే -
గద్దె -
అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కూడా
నెత్తుటి మడుగు మధ్యలో విచ్చిన ఎఱ్ఱకలువ!
కల్హార కిరీటం కావాలనుకున్నవాడు
హింసా కల్లోలినిలో ఈదులాడక తప్పదు!

ప్రజాస్వామ్యంలో ప్రజాసేవకులు
తండోపతండాలు -
ఏమిటి మేటర్?
అధికారం -
ఓటర్ల మాంసం రుచి మరిగిన
మ్యాన్ ఈటర్!!
ఎన్నికల పంజా విసురుతోంది
ఎటెన్షన్ ప్లీజ్!
ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా
ఇక మన పని క్లోజ్!!

[ఈ ఉగాది కవిత ప్రియమిత్రులు శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారికి అంకితం]

"There is no scandal like rags, nor any crime so shameful as poverty"
-George Farguhar

# ప్రగాఢ సంతాపం

ఈ క్రింది మహానుభావుల మరణానికి 'చైతన్య కవిత' మరియు 'శ్రీరస' తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాయి:-

1. విద్యావేత్త, రాజకీయవేత్త, రచయిత, కవి, సాహిత్యపోషకుడు, నూజివీడు మాజీ జమీందారు అయిన శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు, నూజివీడు, 31-1-2003

2. ప్రియమిత్రుడు, సాహిత్యప్రియుడు, తిరుపతిలో తెలుగు ఎం.ఏ.లో (1961-63) తంగిరాలవారి సహాధ్యాయి, మోతుబరి రైతు అయిన శ్రీ పాల్చూరి వెంకట కృష్ణారెడ్డి, ఎల్లాయపాలెం, కోవూరు మండలం, నెల్లూరు జిల్లా, 27-5-2003.

3. మహాపండితుడు, ప్రసిద్ధ పౌరాణికుడు, 40 ఏళ్ళుగా రామాయణ ప్రవచనం చేస్తూ, తిరుప్పావైకి భాష్యం చెపుతూ ఉన్న శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు, విశాఖపట్టణం, 7-6-2003.

4. కవి, పండితుడు, ఉత్తమ దేశికుడు, ఆంధ్ర పద్య కవితా సదస్సు అధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం మాజీ అధ్యక్షుడు, 1952-55 మధ్య భీమవరం కళాశాలలో తంగిరాలవారికి తెలుగు పాఠాలు చెప్పిన గురువు అయిన డా॥ నండూరి వేంకట రామకృష్ణమాచార్య, సికింద్రాబాద్, 6-7-2003.

5. విద్యావేత్త, ఆంధ్రప్రదేశ్ మాజీ ప్రధాన న్యాయమూర్తి, సాహిత్య ప్రియుడు, ఆంధ్ర ప్రదేశ్‌కు మొట్టమొదటి లోకాయుక్త అయిన జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు, హైదరాబాద్, 27-7-2003.

6. ప్రముఖ కన్నడ సాహిత్యవేత్త, విమర్శకుడు అయిన ప్రొ॥ కీర్తినాథ కుర్తుకోటి, ఆయన ధర్మపత్ని శ్రీమతి సరస్వతి, ధార్వాడ, 31-7-2003.

7. ప్రసిద్ధకవి, విమర్శకుడు, పరిశోధకుడు, కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యుడు అయిన శ్రీ పోచిరాజు శేషగిరిరావు, హైదరాబాద్, జూలై, 2003.

8. ప్రసిద్ధ పండితుడు, కవి, వాస్తునిపుణుడు, 'ఉయ్యాలవాడ నారసింహారెడ్డి' (స్వాతంత్ర్య వీరుడు) పద్య కావ్య నిర్మాత అయిన శ్రీ పాణ్యం

నరసరామయ్యగారు, ఉయ్యాలవాడ, కర్నూలు జిల్లా, 18-8-2003 (86 సంవత్సరాలు).

9. ప్రముఖ ఆంగ్ల సాహిత్యవేత్త, ప్రసిద్ధ విమర్శకుడు, కర్ణాట సాహితీ మేరునగ ధీరుడు శ్రీ ఎ.ఎన్.మూర్తిరావు, బెంగుళూరు, 24-8-2003, (గత జూన్ నెలలో వీరికి 103 సంవత్సరాలు నిండాయి).

10. ప్రముఖ ఆధునిక కవి, హైకూల నిర్మాత, 'చెట్టుకవి' మహమ్మద్ ఇస్మాయిల్, కాకినాడ, 25-11-2003 (76 సంవత్సరాలు).

11. 'మైసూరు మల్లిగె' కావ్యనిర్మాత, 'కన్నడకీట్స్'గా ప్రసిద్ధకెక్కిన మిక్కిలి జనప్రియుడైన కన్నడకవి శ్రీ కె.ఎస్. నరసింహస్వామి, బెంగుళూరు, 28-12-2003. (89 సంవత్సరాలు)

12. ప్రముఖ నాటక రచయిత, పరిశోధకుడు, నటుడు, దర్శకుడు డా॥ పి.వి. రమణ, 28-1-2004, హైదరాబాదు. (62 సంవత్సరాలు).

13. ప్రసిద్ధ కవి, విమర్శకుడు, పరిశోధకుడు డా॥ మిరియాల రామకృష్ణ, హైదరాబాదు, 29-1-2004. (69 సంవత్సరాలు).

14. అభ్యుదయకవి, సీనియర్ పాత్రికేయుడు శ్రీ కాగితాల రాజేశ్వరరావు (కేరా), 20-2-2004.

15. ప్రముఖ చలనచిత్ర నిర్మాత, విజయా-వాహినీ స్టూడియో అధినేత శ్రీ బి. నాగిరెడ్డిగారు, చెన్నై, 25-2-2004 (92 సంవత్సరాలు).

16. ప్రసిద్ధ తెలంగాణా కవి శ్రీ టి. కృష్ణమూర్తి యాదవ్, హైదరాబాద్, 25-2-2004. ('తొక్కుడుబండ', 'శబ్నం', 'పిల్లల ఆకాశం' వీరి ముద్రిత కావ్యాలు).

17. మహానటుడు, సాహిత్యవేత్త, 'కళావాచస్పతి', పద్మభూషణ్, డా॥ కొంగర జగ్గయ్య, చెన్నై, 5-3-2004.

18. భళ్ళమూడి కృష్ణ మూర్తి, (తంగిరాలవారి మేనబావ), పోలీసు శాఖ, ఖమ్మం, 11-4-2004. (72 సంవత్సరాలు)

19. ప్రసిద్ధ చలన చిత్రనటి శ్రీమతి సౌందర్య, బెంగుళూరు, 17-4-2004.

20. ప్రముఖ చలన చిత్ర నటుడు 'శంకరాభరణం శంకర శాస్త్రి', శ్రీ జె. వి. సోమయాజులు, హైదరాబాదు, 27-4-2004.

# మనవి

చైతన్యకవిత 1986లో అక్షయ ఉగాదినాడు ప్రారంభమయింది. అప్పుడు దీని ముద్రణ ఖర్చు మూడువేల రూపాయలు ఉండేది. అందువల్ల జీవిత సభ్యత్వం 200రూ. లుగా నిర్ణయించాం. క్రమక్రమంగా పత్రిక ముద్రణ ఖర్చు విపరీతంగా పెరిగిపోయింది. దానికి అనుగుణంగా పోస్టేజి ఖర్చు కూడా పెరిగిపోయింది. ఇప్పుడు కేవలం పోస్టేజి ఖర్చే మూడు వేల రూపాయలకు చేరుకుంది. పత్రిక ముద్రణ ఖర్చు 30వేల రూపాయలు దాటిపోతోంది. అందువల్ల పత్రిక జీవిత సభ్యత్వాన్ని 200రూపాయల నుండి 500 రూపాయలకు పెంచవలసివచ్చింది. ఇదివరలో 200రూపాయలు కట్టినవారు ఇప్పుడు మరో 300రూపాయలు పంపవలసిందిగా ఎన్నోసార్లు మనవి చేసుకున్నాం. కాని వారిలో కేవలం 10% మంది మాత్రమే మా మనవిని అర్థంచేసికొని మరో 300రూపాయలు పంపించారు. మిగిలిన 90% మంది ఏమీ స్పందించకుండా అలా ఉండిపోయారు. అయినా వారందరికీ 37వ సంచిక వరకూ చైతన్యకవిత పంపుతూనే వచ్చాం. ఇక అలా పంపడం సాధ్యం కాదు. ఈ సంచిక నుండి పోషక సభ్యత్వం 1000 రూపాయలు, జీవిత సభ్యత్వం 500 రూపాయలు కట్టిన వారికి మాత్రమే చైతన్యకవిత పంపగలమని మనవి చేసుకుంటున్నాం. మిగిలినవారు మరో 300 రూపాయలు ఎప్పుడు పంపితే అప్పటి నుండి పత్రిక పంపగలం.

\- సంపాదకుడు

## అతిథి సంపాదకీయం:-

# కవుల రచయితల వ్యక్తిత్వాలు

**కవులు, రచయితలు, కళాకారులు, మేధావులు అంటే-**

సామాన్యజనం కంటే భిన్నమైనవారనీ, ఆదర్శాలూ -ఆశయాలూ వారి రచనలలోనే కాకుండా, వారి జీవిత విధానంలో కూడా ఉంటాయనీ చాలామంది నమ్మకం. కాని అది నిజం కాదు. వారు కూడా మనుషులే. అందరి మనుషుల మాదిరిగానే వాళ్ళకూ కొన్ని బలహీనతలు ఉంటాయి. పేరుప్రఖ్యాతుల చాటున ఆ బలహీనతలను క్యాష్ చేసుకునే ప్రబుద్ధులు ఎందరో వున్నారు. ఒక రచనను చదివి, ఆ రచన ఆధారంగా రచయితను అంచనావేయలేం. వ్రాసేది వేరు, జీవితం వేరు. దోపిడి స్వభావం గలవ్యక్తి తన రచనల నిండా విప్లవాన్ని గుమ్మరించగలడు. గ్లోబలైజేషన్ గురించి వ్రాసే వ్యక్తి బహుళజాతి కంపెనీలో ఉద్యోగం కోసమో, ఎన్‌జిఓ లో ఫండ్‌ల కోసమో ఆరాట పడగలడు. రాజ్యవ్యవస్థను విమర్శించే కవి ప్రభుత్వ అవార్డుల కోసం వెంపర్లాడతాడు. సినిమాల మీద దుమ్మెత్తిపోసే రచయిత సినీరంగంలో తన అదృష్టాన్ని పరీక్షించాలనుకుంటాడు. ఇలా ఎక్కడి కక్కడ అవకాశ వాదం, కెరీరిజం పెరిగిపోతుంటే రచయితలు వాటికి దూరంగా విలువల కోసం, తాము నమ్మిన ఆశయాల కోసం కట్టుబడి వుంటారనుకోవడం భ్రమ. ఎక్కడో ఒకరిద్దరు మహానుభావులు తప్పించి అంతా అంతే. కొన్ని సందర్భాలలో కనీస సంస్కారం, వ్యక్తిత్వం లేనివాళ్ళు వ్రాసేవారు- రచయితలలో కనిపిస్తే ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. అసలే తెలుగువాళ్ళకు ఆరాధనాభావం ఎక్కువ. పేరుపొందిన పాపులర్ రచయితను ఆరాధించినందుకు ఫలితం -ఒక అమ్మాయి ఉరిపోసుకోవాల్సివచ్చింది. త్రాగుబోతు తిరుగుబోతుగా కనిపించే కవి లేదా రచయిత మనం అభిమానించే కవి లేదా రచయిత అని తెలుసుకుంటే అది మనకు షాకింగ్ న్యూస్! రచనలోని గొప్పతనాన్ని రచనకే పరిమితం చేయాలితప్ప, ఆ గొప్పతనాన్ని రచయితకు అంటకడితే మనం నిరాశపడక తప్పదు. అందుకే ''ఐ.హెచ్. కారి'' లాంటి చరిత్రకారుడు రచనతోపాటు రచయితల వ్యక్తిత్వాన్ని అంచనా వేసినప్పుడే ఆ రచన యొక్క గొప్పతనాన్ని నిర్ధారించగలమంటాడు.

**-కె. పి. అశోక్ కుమార్ (ప్రజాసాహితి, మే 2004, పుట 53.)**

# ఉత్పల

-దుగ్గిరాల రామారావు

సత్పురుషుల్ జనించిన ప్రశస్తకులమ్మునఁ బుట్టి సాహితీ
తత్పర బుద్ధివై సుకవితా వనవాటికలోన వాణి క
ర్ణోత్పల విస్ఫురత్పరిమళోజ్జ్వలతల్ వికసింపజేయు ఓ
యుత్పల సత్కవీశ! హృదయోత్సవముల్ భవదీయ కావ్యముల్. 1

అతులిత భక్తి సౌరభ సమంచిత ''ముత్పలమాల'' వేంకట
క్షితిధరనాథు పాదముల చెంత సమర్పణ చేసి యాశ్రియః
పతి కరుణా విశేషమున వర్ధిలు నీ కవితా కళా సర
స్వతి కొనరింతునయ్యా! అభివందన, ముత్పలవంశవర్ధనా! 2

నన్నయ్యయూరి పున్నయ
పన్నుగఁ జనుదేర ''పాత బస్తి విలాసా''
లెన్నెన్నో చూపిన విధ
మన్నా! రమణీయ కావ్యమై విలసిల్లెన్. 3

''శతరూప''మ్ములు తావకీన కవితా సౌందర్యముల్ భావనా
మృత మాధుర్య గుణోత్తరమ్ములు రసశ్రీధుర్యముల్ పాండితీ
ప్రతిభా భాసురముల్ జగద్విదిత విద్వద్వర్య సందోహ స
న్నుతికిన్ బాత్రములోయి! ఉత్పల మహోర్ణోరాశి రాకాశశీ! 4

ఏ కావ్యమ్మును సంతరించినను నీ వే పద్యమున్ గట్టినన్
వాకల్ వాకలుగా సుధారసము జాల్వారున్, జగన్మోహన
శ్రీకృష్ణామలతత్త్వబోధకము నీ ''శ్రీకృష్ణ చంద్రోదయా''
ఖ్యాకంబౌ కృతి నిల్చు భాగవతమై ఆచంద్రతారార్కమున్. 5

''ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు''
క్రీడాభిరామమ్ముఁ గ్రిందు చేయు
''రాసపూర్ణిమ'' కావ్యరాజమ్ము పరమ భా
గవతాంఘ్రియుగ సమక్షమున నిలుచు
విమలాశుధారాకవిత్వ సంరంభంబు
''జెట్'' విమానమ్ముతోఁ జెలిమి చేయు
వర భక్తి భావ బంధురము వ్యాసమ్మాంధ్ర
భూమి కంతకు వ్యాస భూమియగును
సంస్కృతాంధ్రాంగ్ల భాషా విశారదత్వ
మాకృతిన్గొన్న సత్యనారాయణకవి!
వైష్ణవోత్తమ! ఆచార్యవర్య! నేటి
సద్యకవులందు శ్రీనాథభట్టు వీవు!

# చెంగల్వ పూదండ

**-ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**

ఇప్పటిదా ఉత్పలవారితో పరిచయం! నాలుగుదశాబ్దాలు దాటిన ఒక అనుబంధం. విద్యార్థిగా వారి 'శరణాగతి' లోని పద్యాలను మక్కువతో చదువు కొనేవాణ్ణి. కాదు, పాడుకొనేవాణ్ణి. వారికి లాగానే వారి పద్యానికి ఒక చురుకుదనం ఉంది; ఒక ఒడుపుదనం ఉంది; జీవితం మీద ఆశ ఉంది; జీవిస్తున్న ఒక మగ్నత ఉంది. పద్యం చదువుకొంటూంటే కవి కళ్ళయెదుట రూపుకట్టే కవిత్వం కొద్దిమందే వ్రాయగలరు. అలాంటివారిలో ఉత్పలవారొకరని నలభైయేళ్ళ నా అనుభవం:

సాహితీ మిత్రుల్లో సామాన్యంగా నాలుగురకాలు కనపడుతుంటారు. ఒకరు సాహిత్యంలో జీవించేవారు. మరొకరు సాహిత్యం కోసం జీవించేవారు. ఇంకొకరు జీవితంకోసమే సాహిత్యమని భావించేవారు. మరింకొకరు జీవితాన్నీ సాహిత్యాన్నీ రెండుకోశాలుగా తలంచి ధనంతోనూ, కీర్తితోనూ వాటిని నింపుకొనేవారు. ఈ నలుగురూ సాహితీజగత్తును నాలుగువైపుల నుంచి ముట్టడిచేస్తూనే ఉంటారు. దండోరాలు వినపడుతూనే ఉంటాయి. అయితే సాహిత్యంలో జీవించేవారు చిరంజీవులౌతారు. సాహిత్యంకోసం జీవించేవారు చిరకీర్తులౌతారు. మిగిలినవారు

మఖలో వెలిగిపోతారు; పుబ్బలో మాయమౌతారు! నా జీవితంలో తారసిల్లిన మొదటిరకం సాహితీమిత్రులలో ఉత్పల వారొకరు!

ఉత్పలవారిని చూచినప్పుడెల్లా ఒక తరం మన కందించిన వరంలా నాకు అనిపిస్తారు. వారు ధరించే చలువ ఖద్దరుపంచె లాల్చీ కండువాలు నాటికీ నేటికీ మారలేదు - గాంధీయుగపు దవళకేతనాల్లాగా; నవ్యసంప్రదాయయుగ కావ్య సిద్ధాంతాల్లాగా; పాత గొంతుకకున్న వింత బింకంలాగా; తెలుగు పద్యానికి వేసిన మరొక చలువపందిరిలాగా!

నవ్య సంప్రదాయ యుగంలో కవులొకవిధమైన సవ్యసాచులు. పద్యరచనలో నవ్యశైలితోపాటు పద్యపఠనంలో కూడ ఒక భవ్యశైలి ఉండటం ఆ తరం మహాకవుల లక్షణం. ఉత్పలవారి పద్యం కవిసమ్రాట్ ప్రశంసలనందుకొన్న ఫణితిలో ప్రసన్నమౌతుంది. ఉత్పలవారి పద్యగానం మరొకరు అనుకరించలేని వారిదైన ఒక ప్రత్యేక ధోరణిని ప్రదర్శిస్తుంది. అందువలన ఉత్పలవారు పాల్గొంటున్న కవిసమ్మేళనం పరిమళభరితంగా ఉంటుంది.

ఉత్పలవారి శైలిలో పద్యం పాతపడకపోగా క్రొత్తపోకడలు వెలార్చింది. నవ్యజీవితాన్ని సాగిస్తోంది. ఆధునిక జాతి వార్తా చమత్కార ధోరణికి ఉత్పల వారొక ఉన్నత శిఖరం.

ఉత్పలవారు మనసున్న మిత్రులు. కల్లాకపటాలులేని సూటిదనం వారి కన్నుల్లో కనపడుతుంది. మెత్తని మనుసు మెత్తని మాటల్లో ధ్వనిస్తూ ఉంటుంది. ఎంతటి లౌకిక సన్నివేశాన్నయినా 'చందమామ'కు వ్రాసి పంపే గేయకావ్యంలా కవితామయంచేసి పాడుతున్నట్లు మాట్లాడే నేర్పు వారికుంది. స్నేహంతోకూడిన మాటలకు కూడా తియ్యని రాగాలేవో ఉంటాయని ఉత్పలవారి సంభాషణలు ఉవ్విళ్ళూరిస్తూ ఉంటాయి. సుఖదుఃఖాలను సాహిత్యంతో మిళితంచేసే రసికత్వం వారిది. అలవోకగా ఆశువుగా పద్యాలు సంభాషణలలో ఆకృతి తాలుస్తూ ఉంటాయి. సమయాని కుచితంగా సంస్కృతాంధ్ర మహాకవుల సూక్తిమౌక్తికాలు మాటలసందుల్లో మందహాస రోచిస్సులను వెదచల్లుతూ ఉంటాయి. ఉత్పల వారికి ఊకదంపుడు తెలియదు; కాని, ఉక్తిచమత్కారం బాగా తెలుసు. చప్పిడి సంగతిని సైతం చమత్కార స్వాదువుగా మార్చగలిగిన మాటల పొందిక వారికి సహజంగా అబ్బిన సాహితీకళ. ఉత్పలవారితో కాసేపు మాట్లాడితే కవిత్వపు మనసుతో కాసేపు కలిసి స్పందించిన అనుభవం మనకు మిగులుతుంది. అందుకే ఆయన మిత్రుడేకాదు, నాకు కవిమిత్రుడు.

స్రష్ట అయినవాడు తప్పగ ద్రష్ట అయి ఉండాలని సాహిత్యశాస్త్రం చెపుతుంది; మన అనుభవం కూడా సూచిస్తుంది. కాని, లోకంలో కవులమని చెప్పుకొనే వారందరూ స్రష్ట లౌతారో కారో కా ని, ద్రష్టలు మాత్రం ఏకొద్దిమంది మాత్రమో ఉంటారని మన అనుభవం నిరూపిస్తుంది. స్రష్ట అంటే ఏదో ఒక రకంగా కవిత్వమో, మరేదైనా సాహితీ ప్రక్రియయో రచించి ప్రచురించేవాడు మాత్రం కాదు. అతనికి అతనిదైన ఒక సాహితీ దృక్పథం ఉండాలి, అతనిదైన ఒక శైలి ఉండాలి, ఒక మార్గం ఉండాలి. ఉత్పలవారికి ఈ మూడూ ఉన్నాయి. అందువల్లనే కవిత్వం వ్రాయగలరు, కవిత్వాన్ని గురించి సిద్ధాంతీకరించగలరు.

నవ్యసంప్రదాయయుగ మహాకవులకుండే ఒక విశిష్టలక్షణ మేమంటే, వారు సాహిత్య సిద్ధాంతపరంగా ద్రష్టలు; నవ్యకావ్యశైలీపరంగా స్రష్టలు. ఈ రెంటిని గురించి విమర్శించవలసివస్తే వివేచింపగలిగిన లక్ష్య లక్షణ వివేక నిపుణులు. అందువల్లనే ఆ యుగంలో కవులే విమర్శకులుగా కూడ వెలుగొందగలిగారు. ఆ తరంలోని ఆ ఉభయ శక్తులను ఉజ్జ్వలంగా తమలో వెలిగించుకొన్నవారు ఉత్పలవారు.

ఉత్పలవారి జీవితచరిత్ర వ్రాస్తే సగానికిపైగా వారి పుస్తకాల వేటను గురించి, బహుగ్రంథ విషయ సమన్వయ సమాలోచనం గురించి మెచ్చించవలసి వస్తుంది. చేసింది ఉపాధ్యాయవృత్తిలో సామాన్యమైన ఉద్యోగం. ఆదాయం పరిమితం. అయినా నాలుగురాళ్ళు జేబులో మోగితేచాలు పుస్తకాల షాపుకు కాళ్ళు నడిచేవి; కావ్యలక్షణ గ్రంథాలకొరకు చేతులు మనియార్డర్లు పంపేవి; లాక్షణిక గ్రంథాలను అహోరాత్రాలు చదవటానికి రెండుకళ్ళూ జాగరణలు చేసేవి. పండక్కి ఇంట్లోవాళ్ళకు క్రొత్తబట్టలు ఎన్ని వచ్చేవో తెలియదుకాని, తన వాటాకు ఒక క్రొత్తపుస్తకం సంచీలో తొంగిచూచేది. కొన్న పుస్తకం ఇంట్లోకి వచ్చిందంటే ఆయనగారి ఒంట్లోకి చేరిదన్న మాటే. గ్రంథంలోని ఏ చమత్కార మైనాసరే ఉత్పల వారి నాల్క మీద నివాసం చేసేది; మిత్రుల సాహిత్యగోష్ఠులలో లాస్యం చేసేది. గ్రంథంలోని ఏ సిద్ధాంతమైనా వారి మెదడులో ఇల్లుకట్టుకుండేది. దాన్ని కూలంకషంగా చర్చించి మననం చేసికొనేంతవరకు వారికి నిద్రపట్టేదికాదు. ఉత్పలవారి మధ్యతరగతి జీవిత సౌకర్యాలలో ఉత్తమతరగతి సౌఖ్యాన్ని ఒడిచి పట్టుకోగలిగింది సాహిత్యశాస్త్రం; ఉత్తమతరగతి సేవాభాగ్యాన్ని అందుకోగలిగింది కవితాకళ.

ఉత్పలవారు ఆధునిక కాలంలో జీవిస్తున్న సంప్రదాయం. కావ్యమీమాంసలో కనిపించే కవిశిక్షకు ఆయన ఒజ్జబంతి. అపార వ్యుత్పత్తిని అహోరాత్రాలు కృషిచేసి

సంపాదించుకొన్నారు. మా అన్నగారు బిదురు వేంకటశేషయ్యగారు అలంకారశాస్త్ర సారాన్ని ఆపోశనం పట్టిన అపర అగస్త్యులు. వారితో ఉత్పలవారు కలిసి చర్చలు చేస్తున్నప్పుడు విద్యార్థిగా నేను ఆసక్తిగా వినేవాణ్ణి. సాహిత్య ప్రస్థానాలకు సంబంధించిన సంస్కృత లక్షణశాస్త్ర విశేషాలు ఉత్పలవారికి ధారణలో నిలిచి చర్చలలో తోరణ పంక్తుల్లా పల్లవించి శ్రోతకు ఆశ్చర్యం కలిగించేవి. లక్షణంతో ఆగలేదు వారి జ్ఞానతృష్ణ. లక్ష్యాలు జిహ్వాగ్రంలో లాస్యం చేసేవి. పూర్వం తిరుపతి వేంకటకవులు తాము ప్రయోగించిన ప్రతి లక్ష్యానికి ప్రయోగాన్ని చూపించే పద్యాన్ని తడవుకోకుండా చెప్పేవారట. వారి శిష్యులకు ఆ విద్య అలవాటయిందట. ఉత్పలవారు తమ కవిత్వంలో తాము ప్రయోగించే విశిష్ట ప్రయోగాల కన్నింటికీ ప్రాచీనకవుల కావ్యాలలో నుండి లక్ష్యాలను చూపగలరు. దివాకర్ల వేంకటావధానిగారితో కలిసి సాహితీ సభలకుపోతూ జరిపే చర్చల్లో ఉత్పలవారి అటువంటి ఉపజ్ఞ ఉజ్జ్వలంగా ప్రకటితమయ్యేది. దానికి కూడా నేను సాక్ష్యం. అంతేకాదు. సాహిత్య ప్రయోగాలకు సాహిత్య లక్షణశాస్త్ర లక్షణాలను అలవోకగా, ధారణలోనుండి వెలికి తీసి పుంఖానుపుంఖంగా ఉదాహరించేవారు ఉత్పలవారు. మా అన్నగారు, ఆచార్య అవధానిగారు అబ్బురపడేవారు. వింటున్న మేము విస్తుపోయేవారం. వారిధిలాంటి యీ పాండిత్యం వచన రూపంగా వెలువడితే బాగుంటుందని భావిస్తుండేవారం.

సాహిత్యశాస్త్ర సంబంధులైన కథలు గాథలు ఉత్పలవారు చెపుతుంటే వినాలి. చవులూరించేటట్లు చెప్పటం వారి కథాకథనశిల్పం. ఒక్కొక్క ఆలంకారికుని జీవిత విశేషాలేకాకుండా అతని కవిత్వం వెనుక దోబూచులాడే మర్మాలు విడమరచి చెపుతుంటే పొడుపుకథలు విన్నప్పటి పులకరింతలు కలిగేవి. సంస్కృతాంధ్ర హిందీ భాషలలో అనర్గళమైన పాండిత్యం వారి పాటల్లో ముప్పేటగా ముప్పిరిగొంటుంది.

'ఆంధ్రభూమి' ఉత్పలవారి ప్రతిభా పాండిత్యాలకు ఆధునిక వాహికను అమర్చి ఆంధ్రుల అభిమానానికి పాత్రమయింది. వారం వారం దారావాహికగా వెలువడిన 'ఆలోచనామృతం' కాలమ్ వ్యాసాలు ఒక క్రొత్త బాణీని పత్రికా రచనలో ప్రవేశపెట్టాయి. ప్రజారంజనంతో పాటు కావ్య కళా రసికత్వాన్ని రంగరించి ఆంధ్రావళి మోదంపొందేటట్లు సంవత్సరాల తరబడి ఆ అమృత ప్రవాహం సాగింది. కావ్యకర్తగా, గేయకర్తగా, వక్తగా, నవలాకర్తగా, ఉపాధ్యాయుడుగా పేరొందిన ఉత్పలవారికి వ్యాసకర్తగా, విమర్శకునిగా, పత్రికా రచయితగా మరొక విశిష్టమైన గుర్తింపును 'ఆలోచనామృతం' అందించింది.

# తెలుగు పద్యానికే ఇది గౌరవం

-ఉత్పల సత్యనారాయణాచార్య

హైదరాబాద్ డిసెంబరు 24 (న్యూస్‌టుడే): కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు లభించడం పట్ల ప్రముఖ కవి, రచయిత ఉత్పల సత్యనారాయణాచార్య హర్షం వెలిబుచ్చారు. 20 ఏళ్ల తర్వాత మళ్ళీ పద్య కవిత్వానికి అకాడెమీ అవార్డు లభించడం ఎంతో సంతోషంగా ఉందన్నారు. తను రచించిన 'శ్రీకృష్ణ చంద్రోదయం' పుస్తకానికి బుధవారం కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు ప్రకటించిన సందర్భంగా ఆయన 'న్యూస్‌టుడే' తో తన ఆనందాన్ని పంచుకున్నారు. ఈ అవార్డును తెలుగు పద్యానికి లభించిన గౌరవంగా భావిస్తున్నట్టు తెలిపారు. ఈ అవార్డు తన కంటే పద్య రచనలో కృషిచేసిన వారికి, పద్యాన్ని అభిమానించే వారికి ఎక్కువ సంతృప్తినిస్తుందన్నారు. వారిలో కొత్త ఉత్సాహం కలిగిస్తుందని తెలిపారు. ''తెలుగు పద్యానికి రెండు వేలఏళ్ల చరిత్ర ఉంది. పద్యం నిత్య జీవితంలో ఉంది. అలాంటి పద్యానికి ఈ అవార్డు పునఃప్రతిష్ఠ కలిగిస్తుంది. అందుకు అకాడెమీకి ధన్యవాదాలు'' అని ఆయన పేర్కొన్నారు. ఉత్పల సత్యనారాయణాచార్య 1927లో ఖమ్మంజిల్లా 'చింతకాని'లో జన్మించారు. తిరుపతిలోని ఓరియంటల్ కాలేజీలో విద్వాన్ డిగ్రీ, ఉస్మానియా యూనివర్సిటీ నుంచి తెలుగులో ఎం. ఏ. పూర్తి చేశారు. ఆయన మొదట్లో 'మాతృభూమి' తదితర పత్రికల్లో పాత్రికేయుడిగా పనిచేశారు. అప్పట్లో తెనాలి నుంచి వెలువడిన 'జైహింద్' వార పత్రికకు రెండేళ్లపాటు సంపాదకుడిగాను వ్యవహరించారు. ఆ తర్వాత ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి మహబూబ్‌నగర్‌లో కొన్నాళ్లు పనిచేశారు. సికింద్రాబాద్‌లోని ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో 18 ఏళ్లపాటు ఉపాధ్యాయుడిగా సేవలందించారు. సికింద్రాబాద్‌లోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో తెలుగు ఉపన్యాసకుడిగా పనిచేశారు. మధ్యలో కొన్నాళ్లు తెలుగు అకాడెమీలో పనిచేసిన ఆయన 1983లో పదవీ విరమణ చేశారు. ఆయన దాదాపు 70 పుస్తకాలు రచించారు. ఆయన రచనల్లో సింహభాగం పద్య కవిత్వమే. 'ఈ జంట నగరాలు- హేమంత శిశిరాలు' అనే పద్య కావ్యం ఆయనకు ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టింది. ఈ కావ్యానికి 1970లో ఆంధ్రప్రదేశ్‌సాహిత్య అకామీఅవార్డు కూడా లభించింది. ఆయనకు కేంద్ర సాహిత్య ఆకాడెమీ అవార్డు తెచ్చి పెట్టిన 'శ్రీ కృష్ణ చంద్రోదయం' పుస్తకాన్ని 2000 సంవత్సరంలో ప్రచురించారు. రెండేళ్లలోనే 2003లో మళ్లీ ఈ పుస్తకం పునర్ముద్రణకు నోచుకుంది. ఇంత వరకు ఎవరూ స్పృశించని భాగవత విశేషాల్ని ఆయన ఈ పుస్తకంలో హృద్యంగా వివరించారు.

(-ఈనాడు, గురువారం, డిసెంబరు 25, 2003).

# ఒక కవిని నిలిపే రెండు కావ్యాలు

-చీకోలు సుందరయ్య

ఈ రోజు తెలుగు సాహితీ ప్రియుల నోట వినిపిస్తోన్న పుస్తకం పేరు ''శ్రీకృష్ణ చంద్రోదయము''. నిజానికి ఈ కావ్యం 2001లో తొలిసారి అచ్చయింది. ఆ తర్వాత 2003లో పునర్ముద్రణకు నోచుకొంది. 2001 నుంచీ దాన్ని అంతగా పట్టించుకోనివారు ఈనాడు దాన్ని గురించి ఎందుకంతగా చర్చించుకుటున్నారు!. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించిందనా? కొంతవరకు అది నిజం కావచ్చు. కొన్ని దశాబ్దాలుగా, పద్యకావ్యాలు విడుదలైనప్పుడు వాటికి సంబంధించిన సమీక్షలు, పరిచయాలు కూడా పత్రికల్లో ఎక్కువగా రావడంలేదు. అంతేకాదు పద్యం ఈవేళ గత వైభవ చిహ్నంగా మారి కొందరికి దాహోర్తిగా మిగిలింది. పుస్తకాలు కొంటోన్నవారి సంఖ్య తక్కువ. నవలలు, కథా సంపుటాలు.... ప్రసిద్ధుల కవితా సంపుటాలు... ఇలా వీటికి కూడా ఆదరణ తగ్గుతున్న రోజుల్లో పద్య కావ్యాలు చదవడం అంటే.... అభిరుచి ఉన్నవారు తప్ప పద్యకావ్యాలు కొనేవారు లేరనే చెప్పాలి. ఇన్నిటినీ అధిగమించి రెండో ముద్రణ పూర్తిచేసుకోవడం నిజంగానే అభినందనీయం.

ఇక్కడ ఉన్న రెండు పుస్తకాలు సాహిత్య ప్రపంచంలో చరిత్ర సృష్టించిన పుస్తకాలనడం అతిశయోక్తికాదు. ఒకటి 'ఈ జంటనగరాలు హేమంత శిశిరాలు', రెండోది ''శ్రీకృష్ణ చంద్రోదయము''. మొదటిది 1971లో అచ్చయిన కావ్యం. రెండోది 2001లో అచ్చయినది. అంటే రెండింటి మధ్య మూడు దశాబ్దాల కాలం దొర్లిపోయిందన్నమాట. ఈ రెండూ ఉత్పల సత్యనారాయణచార్య భావ ప్రపంచం నుంచి రూపుదిద్దుకున్న కావ్యాలు. మొదటిది ఆయనకి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు తెచ్చింది. లెండోది ఏకంగా ప్రతిష్ఠాత్మకమైన కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు తెచ్చింది.

1927లో జన్మించిన ఉత్పల సత్యనారాయణాచార్య తన నలభైలలో ''ఈ జంటనగరాలు....'' కావ్యం రాశారు. 'శ్రీకృష్ణ చంద్రోదయము'ను తన డెబ్భైలలో రాశారు. ఉత్పల ''సంప్రదాయ కవితా రసికుడు, నవీన భావనాదరణ పరాయణుడు''. పత్రికల్లో రాసిన వ్యాసాలు మినహా ఇతరత్ర ఆయన రాసిన డెబ్భై కావ్యాల్లో అన్నీ పద్యకావ్యాలే. పద్యమే ఆయన చిరునామా. నిజానికి పద్యకవిత్వానికి పెద్ద దిక్కు కూడా ఆయనే. అవధానాల జోరులో పద్యాన్ని సర్కస్ ఫీట్‌లా, అదేదో వింత వస్తువుగా మార్చి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొంటున్న అష్టావధానులు, శతావధానులు, సహస్రావధానులు, ద్విసహస్రావధానులు, బృహత్ సహస్రావధానులు ప్రజలు చదివి ఆనందించేలా ఒక కమ్మని పద్యకావ్యం రాశారా? లేదన్నది

సమాధానం. ఈ అంశాన్ని రచయిత్రి, విమర్శకురాలు వాడ్రేవు వీరలక్ష్మి దేవి కూడా ఓ చోట ప్రస్తావించారు. ఈ నేపథ్యంలో కాలికి బలపం కట్టుకొని తిరిగినట్లు, ఎక్కడ కవిత చదవమనో, కావ్యగానం చేయమనో ఎవరు అహ్వానించినా ఉత్పల, పద్యాల డజనుతోనో, ఉత్పల మాలలతోనో హాజరై శ్రోతలను పులకింపజేశారు. ఈ వ్యాసకర్త ఏర్పాటు చేసిన అనేక కార్యక్రమాల్లో కూడా ఉత్పల కమ్మని పద్యాలతో విందొనర్చారు. అప్పట్లో ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావు హుస్సేన్‌సాగరంమీద ఆవిష్కరించిన తెలుగు వెలుగులపై ఉత్పల కురిపించిన వ్యంగ్యం, హాస్యం 'సూపర్‌హిట్' అనే చెప్పాలి. ''ఈ జంటనగరాలు....'' కావ్యానికొస్తే వ్యంగ్య ప్రధానమైన కావ్యం! ఇందులో మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్లయినా (అప్పటికి) పైరవీ లేకుండా ఏ పనీ జరగని వైనాన్నీ, వివిధ వ్యవస్థల పనితీరును, మధ్యతరగతి బడుగు జీవనాన్ని, పుస్తకాలు కొనలేని అశక్తతని, చాలీచాలని జీతాలనీ ఇలా అనేక అంశాల్ని తనదైన వ్యంగ్యంతో ఆవిష్కరించారు. జంటనగరాలలోని వివిధ ప్రాంతాలు, వాటి ప్రాముఖ్యం, తెలంగాణా ప్రముఖుల గురించి కూడా సంక్షిప్త పరిచయం చేశారు. నేటి వ్యవస్థలో నిరుపేద కెన్ని సమస్యలో కదా....... ఉన్నట్టుండి కాలి చెప్పుతెగితే..... పరిస్థితి ఎలా ఉంటుందో చెబుతూ-

''చెప్పు చేతబట్టి చేరుదమన్న నా
కెదురు పడినవాడు బెదురునేమొ!
ప్రాత చెప్పులనుచు పాఱవేయుదమన్న
ప్రాణమొప్పలేదు వాని విడువ''

ఇంతకీ ఆ చెప్పు ఎందుకు తెగింది?

''బస్సులోన బోవు ప్రౌఢ కామినివంక
ఛీఛి యేల నేను చూచినానొ
బొంతరాయి తగిలి పుటుకుమన్నది చెప్పు
నడిబజారులోన నవ్వుబాటు''

''వెంటనే రెండు జేబులు వెదకినాడ
జిత్తు కాగితములు ప్రాత యుత్తరములు
దక్క నొండొక్క పైసయు దగులకున్న
జేబుగుడ్డతో మేని ముచ్చెమట దుడిచి....''

''తెగిని చెప్పుతో నతికష్టముగను గదలి
అడుగునేల నామడయట్లు నడచుసరికి

దెబ్బతిని విలవిలలాడి త్రెళ్లు పక్షి
పగిది పూర్తిగా తెగినది పాదరక్ష....''

ఈ పద్యాల్లో అర్థంకాని మాట ఒక్కటి లేదు. దాదాపు కావ్యమంతా ఇదే సరళితో, వేగంతో నడుస్తుంది. కొన్ని వర్ణనలు, అలంకారాలు ప్రాచీన కవిత్వం పై ఆయనకున్న పట్టు తెలుపుతాయి. ఈరోజు మనం అనుకొంటోన్న 'సామాజిక స్పృహ' పుష్కలంగా ఉన్న కావ్యమిది. ఆరు ఆశ్వాసాల కావ్యంలోని ప్రతి పద్యం రసోదయం కలిగిస్తుంది. నగరంలోని ప్రతి విశేషాన్ని, తెలంగాణా ప్రముఖుల్ని ఎంతో ఆర్ద్రంతో చిత్రించారు. రామదాసు బందీయైన గోలకొండకోట, చార్మినారు, నౌబత్ పహాడ్, హుస్సేన్ సాగర్ శీతల జలాలు (అప్పుడు!), సాలార్జంగ్ మ్యూజియం, మహబూబ్ కీ మెహిందీ, గండిపేట చెరువు, ఫలక్ నుమా ఇవన్నీ అందంగా ఆవిష్కరిస్తారు. కవి సమ్మేళనాలు, ముషాయిరాలు, గానాబజానాలు, సారస్వతోపన్యాసాలు, సాంస్కృతికోత్సవాలు... ఇలా జంటనగరాలు ఆనాడు ఎలా ఉండేవో వర్ణచిత్రం గీశారు. ఈ కావ్యం చదివే కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ''ఈయన యొక మహాకవి. చాల గొప్పకవి. గొప్ప భావుకుడు. తెలుగు పద్య నిర్మాణములో నొక విధముగా నిష్ణాతుడని చెప్పవలయును'' అన్నారు.

ఇకనేటి కావ్యం ''శ్రీకృష్ణ చంద్రోదయము''నకొస్తే వేదాలు, పురాణేతిహాసాలలల్లో ప్రతిపాదించిన శ్రీకృష్ణ పరబ్రహ్మ తత్వాన్ని ఉత్పల కవితాత్మకంగా, కళాత్మకంగా చెప్పారు. రాధాకృష్ణుల ఉభయుల గాథలను మేళవించి అభేద రసాద్వైతంతో, తాత్త్విక దృష్టితో ఆవిష్కరించారు. పోతన భాగవతంలోనూ, సంస్కృత భాగవతంలోనూ లేని కృష్ణావతారానికి సంబంధించిన కొన్ని రహస్యాల్ని ఇందులో చేర్చారు. కృషుడు దేవకీ గర్భ సంభూతుడు మాత్రమే అని కాక యశోదా గర్భ సంభవుడన్నది కూడా ఇందులో కనిపిస్తుంది. యశోదా పుత్రుడు సచ్చిదానంద శ్రీకృష్ణుడైతే, దేవకీ నందనుడు ఈశ్వర స్వరూపుడైన శ్రీకృష్ణుడు. చతుర్భుజుడైన దేవకీనందనుడు, ద్విభుజరూపుడైన యశోదా తనయుడిలో లీనమయ్యాడనే విషయం ధ్వనిస్తుంది. ఇలా అనేక విశేషాలతో ఉన్న ఈ పుస్తకంలో వసుదేవుడు బాలకృష్ణుడిని రేపల్లెకు తీసుకెళ్లే సన్నివేశంలో ఒక పద్యం ఎలా సాగుతోందో చూస్తే ఉత్పల గొప్పదనం, భావుకత, ఆయన కావ్యజ్ఞానం అర్థం చేసుకోవచ్చు. వసుదేవుడు నీళ్లలోకి దిగగానే కొంతసేపు మోకాళ్లదాకా ప్రవహించిన యమున, ఆ తర్వాత ఆగలేక నడుముదాకా వచ్చింది! ఎందుకని? ఆ వటపత్రశాయిని దర్శిద్దామన్న ఉత్సుకతతో! అలా నడుము దాకా వచ్చినది కాస్తా కంఠం దాకా వచ్చేసింది, తన కెరటాలతో ఆ వటపత్రశాయి పాదాలను తాకాలని ఉబలాటపడింది. కానీ బాలకృష్ణయ్యకి గొడుగుపట్టిన ఫణిరాజు ఊరుకుంటాడా? ఒక్కసారిగా అతను బుసకొట్టేసరికి అంత ప్రవాహం కాస్తా అణగిపోక తప్పలేదు. అలాంటివాడిని మోస్తున్న వ్యక్తి

సాక్షాత్తూ శంకరుడే అయి ఉంటాడనుకొన్న యమున వసుదేవుడి పాదాల దాకా తగ్గి, పాదాలు కడుగుతూ అక్కడే ఆగిపోయింది. ఎంత చక్కని భావన!

**ఒక్కెడ జాను దఘ్న యయి, యొక్కయెడన్ కటిదఘ్న యౌచు, నిం**
**కొక్కెడ కంఠ దఘ్నయయి, ఊర్మికలన్ ప్రభుపాదపద్మముల్**
**మక్కువ తాక నెంచిన తరంగిణి యెల్ల, ఫణీంద్రు ఫూత్కృతిన్**
**గ్రక్కున దూలి, దిక్కుల గకావికలయ్యెఁ బ్రవాహమయ్యెడన్.**

ఈ కావ్యంలో ఉత్పల మధుర భక్తికి పీఠం వేశారు. కారాగారంలో దేవకీ వసుదేవుల ముందు కృష్ణుడు శంఖ, చక్ర, గదా, ఖడ్గ ధారియై ప్రత్యక్షమై మరునిముషంలో శిశువుగా మారతాడు. కాని వారిద్దరు 'శ్రీ' వారిని చూసి ఆశ్చర్యంలో శిశువుపట్ల వాత్సల్యం చూపించడం మరచి చేతులు జోడించి ప్రార్థించడం ప్రారంభిస్తారంటారు. ఐశ్వర్య జ్ఞానం ముందు ప్రేమ నిలవదంటారు. శ్రీకృష్ణుడంటే - రాధాకృష్ణుడని ఉత్పల వివరిస్తారు. శ్రీకృష్ణుని నవ్వే ఈ కావ్య శోభ అంటారు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం. ''శ్రీకృష్ణ కావ్యకర్తలలో ఉత్పలవారు కవి శిఖామణి'' అయితే ఉత్పల ''శ్రీకృష్ణ కావ్యాలలో ఇది ఉజ్జ్వలనీలమణి''. రూపగోస్వామి నవవిధ భక్తులలో పేర్కొన్న మధుర భక్తి సిద్ధాంతాన్ని ఉత్పల తన కావ్యంలో నిరూపించారు. శ్రీకృష్ణుడిని మధుర రసమూర్తిగా చిత్రించారు. ఆ విధంగా ఆయన కథ పాతదే అయినా కదనం నవ్యాతి నవ్యంగా ప్రేమ చంద్రోదయంగా మలచి తన కృష్ణ భక్తిని చాటుకొన్నారు. కృష్ణుడిని ప్రేమించేవారు ఈ కావ్యాన్ని కలకాలం తప్పక ప్రేమిస్తారు.

**(ఈనాడు, శుక్రవారం, 30, జనవరి, 2004)**

# రసోజ్జ్వలం... రమణీయం ... పేరాల. భరతశర్మ కవితా వైభవం

-వెల్చేటి

ఆయనది ఓ అసాధారణ ప్రతిభ. అవధానంలో ఆశువుగా చెప్పినా, ప్రశాంతంగా తీరుబాటు వేళ ఆలోచించి నిదానంగా పలికినా పద్యంలో భావ రామణీయకత, శబ్ద సౌందర్యం చెట్టపట్టాల్ వేసుకుని సాగిపోతాయి. అది ఆయన నోటి నుంచి వెలువడితే ఈ రెంటికీ తోడుగా నాదమాధుర్యాన్ని సంతరించుకుని సాహితీప్రియులను మంత్రముగ్ధులను చేస్తుంది. అవధానమైనా, గ్రంథరచన అయినా భావబంధురంగా, రాగరంజితంగా చెప్పగల దిట్ట గనుకనే 'అవధాన సరస్వతి'గా 'కవి పంచాన'నునిగా పేరాల భరతశర్మ సమస్కంధులపై కూడా ఎప్పుడూ ఓ జానెడు ఎత్తుగానే నిలిచాడు.

భావబంధుర హృదయమ్ము పరగు కతన
రాగరంజిత గాత్రమ్ము గ్రాలు కతన
తత లయానుగత పదవిధాన గరిమ
భరతశర్మాభిధానమ్ము పరగువాడ

అని ఆయన డైరీలో రాసుకున్న పద్యం ఆయన రచనకు అక్షర సత్యం. ఈ భావబంధురం, రాగరంజితం లక్షణాలు పురాకృతమని ఆయన అభిప్రాయం. ఆయన గురువర్యులు కవసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి అభిప్రాయం కూడా అదే. 1968 డిసెంబర్‌లో విజయవాడ ఎస్. ఆర్. ఆర్. & సి. వి. ఆర్., ప్రభుత్వ కళాశాలలో అవధాన వేదికపై ఆయన అదే మాట దీవెనగా పలికారు.

శూరాధ్వానుగునిన్ నిరంతరిత శుశ్రూషా సమాత్తోజ్జ్వల
ద్దీరోచిష్ణుని సాధుశీల రచనా తృప్తున్ ప్రియోహక్రియున్
పేరాలాన్వయ బాలచంద్రముని మత్ప్రేయః పఠీనున్ పురా
ప్రారూఢ ప్రతిభామతిన్ భరతశర్మన్ నేను దీవించెదన్

అవధాన చరిత్రలో భరతశర్మగారిది కచ్చితంగా ఓ అధ్యాయం. తిరుపతి వేంకటకవుల ప్రశిష్యుడైన ఆయన అవధాన ప్రక్రియను విద్యగా సాధన చేసినా కళగా ప్రదర్శించారు. అందుకే ఆయన అవధాన పద్యాలు కూడా రసమయంగా, శిల్పబంధురంగా పదికాలాల పాటు నిలిచిపోతాయి. శర్మగారి అవధానం అంటే ఎప్పుడూ ఉద్దండులైన పృచ్ఛకులే తారసిల్లేవారు. ప్రతి అవధానం ఓ సవాల్‌గా స్వీకరించి ఆయన విజేతగా నిలిచారు. ఓ అవధానం తరువాత అద్దేపల్లి లక్ష్మణస్వామి చెప్పినట్టు-

ఎనిమిదిమంది కుట్ర యిది, యిందరు నిన్నిటు పట్టి యీవిధిన్
బనివడి చిత్రహింస సలుపన్ సహియించితి వీవు, వీరిలో
న నొక్కఁడనైతినే యని మనంబునఁ గుందెద నైన సాన వె
ట్టిన కద వజ్రకాంతి ప్రకటీకృతమౌట ధరిత్రి సోదరా!

ఔను. సుదీర్ఘ సాహితీయానంలో ప్రతి అవధానం ఆయన ప్రతిభా వజ్రాన్ని సానపట్టింది. ఆయన అవధానాల్లో సమస్యా పూరణం హృద్యంగా సాగేది. 1969లో చీరాలలో ఏర్పాటుచేసిన అవధానంలో 'క్రుంకెన్ భానుడు ప్రాగ్దిశాముఖమునన్ గోరంత కొండంతయై' అన్న సమస్యను ఆయన ఎంత చక్కగా పూరించారో చూడండి:

ఇంకేమేమి సుఖంబులొప్పు నిపుడో హేమాంబుజాక్షీ! సుప
ర్యంకంబందున జంటగా మెలగుప్రారబ్ధంబు లేదింక నా

**వంకం జూడుమ పశ్చిమంబునను హృద్భంగమ్ముగా చంద్రుడున్**
**గ్రుంకెన్; భానుడు ప్రాగ్దిశాముఖమునన్ గోరంత కొండంతయై**

ఎంతటి క్లిష్ట సమస్యనైనా రసరమ్యంగా పూరించడం శర్మగారి సొత్తు. ఆయన అవధానంలో వర్ణనలు కూడా అంత సొగసుగానే సాగేవి.

అవధాన సరస్వతిగా ఆయన ఆ ప్రక్రియను ఎంత రసోజ్జ్వలంగా నిర్వహించారో రచనా వ్యాసంగాన్ని కూడా అంతటి ప్రతిభా సంపన్నంగానే సాగించారు. ఆయన 'కాదంబరి రసజ్ఞత' సంప్రదాయ వైమర్శిక గ్రంథాలలో అగ్రశ్రేణికి చెందినది. సాహిత్య విమర్శ అంటే రంధ్రాన్వేషణం కాక రచనలో లోతులను కూడా చూపడమని ఆయన అభిప్రాయం. ఆయన రచనలో 'శారదానందలహరి' ప్రౌఢమైనది. శ్రీవిద్య తత్త్వం, దాని అనేకానేక మంత్ర రహస్యాలు ఆయన ఈ రచనలో నిక్షిప్తం చేశారు. ఆదిశంకరుల సౌందర్యలహరి శైలిలో సాగిన ఈ రచన శర్మగారి ప్రౌఢ పటిమకు నిదర్శనం.



**ఓంకార శ్రుతి పంజరాంతరశుకీ! యోగీంద్రరాణ్మానసీ**
**హ్రీంకార స్ఫుట నాదబిందు కలహంసీ! ఆగమారామజ**
**శ్రీంకారోజ్జ్వల పింఛ లాంఛిత మయూరీ! భావనానంత ధీ**
**పంకేజాత సహస్ర సంచరదళీ! భద్రమ్ము లీయంగదే!**

అంత ప్రౌఢంగా సాగిన ఈ పద్యంలో తొలి మూడు పాదాల ప్రథమాక్షరాలను పరికిస్తే ఓం, హ్రీం, శ్రీం బీజాక్షరాలు కనిపిస్తాయి. అంతేకాదు, పంకేజాత సహస్ర సంచరదళీ! భద్రమ్ము లీయంగదే! అంటూ నాలుగో పాదంలో సహస్ర దళీగా శివునితో కూడి కుండలనీ రూపిణియగు పరదేవత తత్త్వాన్ని ఆయన రమ్యంగా ఆవిష్కరించారు.

**శ్రీనాథాది కవీంద్రసాంద్ర సువచః స్ఫీతాత్మ చక్రాంతర**
**శ్రీనాదమ్మో! రసార్ద్రయోగి హృదయశ్రీ పద్మినీ భ్రామరీ**
**ధ్యానమ్మో! రమణీయ రాగరస సంధానమ్ము గావించు వి**
**జ్ఞానమ్మో! వినదింపుమమ్మ యెదలోనన్ వాణి వీణాధ్వనీ!**

అంటూ శ్రీనాథుని శైలిలోనే పలికిన శర్మగారు చాలా రచనల్లో తిక్కన శిల్పాన్ని కూడా సొగసుగా ఇముడ్చుకున్నారు. 'మానస హిమాంశు'గా ఆయన వెన్నెలపై రాసిన కావ్యం ఆయన భావ సౌకుమార్యానికి, ఆధ్యాత్మిక చింతనకు తలమానికం. కవిగా, అవధానిగా అనేకానేక వర్ణనలు, రచనలు ఆయన చేసినప్పటికీ ఆయన జీవుని వేదన తాత్త్విక చింతన అనిపిస్తుంది. ఆనందమయ అంశాలలో కూడా ఆధ్యాత్మికతను వెతుక్కున్న ఆయన ధోరణి 'మానస హిమాంశు'లో ఆద్యంతం ద్యోతకమవుతుంది.

పిండార బోసినట్లుల
పండిన వెన్నెల జగముల పండించు శర
త్కాండ కళా ఖండములన్
కుండలినీ కలిత లలిత కులకుండములన్!

ఇలా వెన్నెలను రకరకాలుగా ఆధ్యాత్మికతను జోడించి ఆయన రసగంగాధరంగా పండించారు. 'నేను పలుకుతున్నానని ఎప్పుడూ అనుకోలేదు. లోపల పలికే తల్లి పలికితే ఆ తీరు వేరు - ఆ నడకలు, ఆ పొంకములు, ఆ కనుల అంచులలో నవ్వులతో ఒలికే పలుకులు, ఆ కల్పనలు అవి వేరు' అంటూ తాను వేలార్చిన ప్రతి పలుకు ఆ చదువుల తల్లి దయగా ఆయన తలపోశారు.

వేణువునూది నా హృదయ వీథులలో ప్రణవమ్ము నాటు వి
న్నాణము నీదిరా ప్రభువ! నాదము బుద్ధిగుహా ప్రతిధ్వని
ప్రాణముగాగ నా యయిదు ప్రాణములిచ్చిన నేమిరా? పరి
త్రాణము సేయరారా! కనరా! వినరా! మొఱ వేంకటేశ్వరా!

అంటూ తన ఇష్టదైవం శ్రీవేంకటేశ్వరుని స్తుతించిన శర్మగారు మనకు కనరాని, వినలేని తీరాలకు తన కవితా చంద్రికలు వెదచల్లడానికి వెళ్ళిపోయారు. ఆయన అర్ధాంతర నిష్క్రమణతో కవిసమ్రాట్ విశ్వనాథ కల్పవృక్షం పై ఆయన రాస్తున్న సాధికారిక విశ్లేషణ అసంపూర్ణంగా మిగిలిపోయింది. ఆంధ్రసాహిత్యానికి అది తీరని లోటు.

# కీ. శే. పేరాల భరతశర్మగారి పద్యాలు

## 1. భారత భారతి

కలమున్ కాగితమే యెఱుంగని పురాకల్పమ్ములన్ గాలిలో
నిలచెన్ శబ్దమయ ప్రపంచములు వాంగ్నిక్షేపముల్, మానవా
వళి మేధానికషమ్ము లాత్మహిత సంపద్భావనా బంధుర
మ్ములు విశ్వమ్మఖిలమ్ము విస్మయమునన్ ముంచెత్తుచీనాటికిన్. 1

మరునా డెందుకుగాని యట్టి రచనల్ మావాంధ్రు గావించి సం
స్కరణం బోర్వరు స్వీయమౌరచనలన్; కల్పాంతర స్థాయులై
పరలం జాలిన గ్రంథజాలముల సంభావింతు రేమేమొ సం
స్కరణంబుల్ కరణాలు లెక్కలను మార్చన్ జూచు చందమ్మునన్. 2

భగవంతుండు కిరీటిచేత సమయింపన్‌జేసె తన్నంచు బల్
పగతో నప్పటి నుండి సైంధవుడు - విధ్వంసమ్ము గావింపగా
భగవద్భావమునే జగమ్ముల - నహో ప్రజ్ఞా పరావర్తన
ప్రగతిన్ వర్తిలు దివ్యవాణి సొలయింపన్ గాలిదయ్యంబుగా. 3

భగవద్గీత పఠింపుచున్ విడచె తా ప్రాణాలు, గంగామహో
పగ దివ్యంబగు సంస్కృతి స్ఫురణ సంభావించి కన్మూసె తాన్;
నిగమార్థోపనిషన్మతిన్ జవహరున్; ధీమంతులీ నాటికిన్
తెగడం జూడరు భారతార్షమతి, లేదే దిక్కు దయ్యానికిన్! 4

ఒక పాశ్చాత్యుడు మోక్షముల్లరగు; వేతోక్కండు శ్రీ చక్రపున్
సకలార్థంబులు కోణముల్ కొలుచు; విశ్వాసమ్ము రేకెత్తగా
నొక జర్మన్ బుధు డార్ష వాఙ్మయము నచ్చొత్తించు హృత్పీఠిపై
అకలంకాత్ములు వారిపై బడగ సాధ్యంబౌనె దయ్యానికిన్! 5

అనిబిసెంటు తాత్త్విక మహోవధి భారత భూమియంచు వి
జ్ఞాన మహోబ్ధులందు నవగాహమొనర్చెను మొన్న మొన్న; వి
శ్వానికి మార్గదర్శకము భారత సంస్కృత వాణి యంచు వై
జ్ఞానిక వేత్తలిప్పుడుఁ బొగడ్తలొనర్తురు బుద్ధిమంతులై. 6

## 2. భారతేందిర



భరతపుత్రుల హృదయాల పాదులందు
ప్రేమలతలను నాటిన పెన్నిధాన
మీవు- నీ గుండెలోతుల నెన్ని తూట్లు
పాడిచినంగాని సంతృప్తి పొందమేము! 1

అమ్మ! నీ నవ్వు వెన్నెలయంత చలువ!
అమ్మ! నీ చూపు వెన్నెల యంత వెలుగు!
తల్లి! నీ మాట మరి అమృతంపు బాట!
నీవు భారత రత్నమ్మ నిజము తల్లి! 2

ఇందిరవు నీవు భరతరాజ్యేందిరవును
ఆ సముద్ర హిమాచల వ్యాప్తమైన
నీదు నౌన్నత్య మందుకోనేర రెవరు-
కాని, నిను గూల్చు నందాక కనరు తృప్తి. 3

హంతకుడు తల్లియౌ నిన్ను హతము జేసి
సోదర హృదయ వీథుల క్షోభపెట్టె
బ్రతికినన్నాళ్ళు నిన్ దుయ్యబట్టినారు
నీవు లేనట్టి లోటును నింపలేరు. 4

అమ్మా! నమ్మినవారె ద్రోహమును జేయంగా జగమ్మందునన్
నమ్మంగా దగువార లెవ్వరని సంతాపమ్ము డెందమ్ములో
కుమ్మున్ బెట్టెను దేశమంతకును - రక్షోధర్మమేగాని స
త్యమ్మున్ శాంతియు దాంతి నీతి వలదా తల్లీ! ప్రజాకోటికిన్. 5

హిమభూభృచ్ఛిఖరంబులందునను తల్లీ! నీదు కీర్తీందిరా
సమ లాస్యప్రభ, వార్ధి గర్భమున నీ సర్వార్ద్ర భావమ్ము భ
ద్రముగా భారత భూప్రజావళికి సంధానించుతన్ తావకీ
న మనోజ్ఞాత మధుప్రసారము లనూనంబైన సద్వాసనన్. 6



# వాఙ్మయ తపస్వి రామప్ప

–ఆచార్య శలాక రఘునాథశర్మ

ఆయన ఒక బంధువు ఇంటికి వెళ్ళాడు. ఆయన ఎక్కడికి వెళ్ళినా ఆయన కళ్ళు ఆబతో వెదికేది ఒక్కటే. ఏదైనా మంచి పుస్తకం ఉంటుందా అనే ఆయన అన్వేషణ. అన్వేషణ ఫలితంగా ఆయన కన్ను ఒక పుస్తకం మీద పడింది. అది సుమారు వెయ్యి పేజీల పుస్తకం. చూచాడు. అటూ ఇటూ త్రిప్పాడు. 'ఒరే, మళ్ళీ రెండు మూడు రోజులలో చదివి తెచ్చియిస్తాను. ఈ పుస్తకం ఇవ్వరా!' అన్నాడు ఆ సమీప బంధువుతో. 'మామా! ఇంకేదైనా అడుగు. పుస్తకం మాత్రం ఎవరికీ ఇచ్చేది లేదు' అని ఆయన తేగేసి చెప్పాడు. అంతే, సాయంకాలం ఆరున్నర ప్రాంతం. అక్కడనే కూర్చుని ఆ పుస్తకం చదవటం ప్రారంభించాడు. తెల్లవారింది. పుస్తకం పూర్తి అయింది. 'ఇదిగోరా అబ్బీ నీ పుస్తకం చదివేశాను' అన్నాడు.

ఆ పుస్తకం వేయిపడగలు. అలా రాత్రికి రాత్రి చదివేసిన పఠన దాహంగల మనీషి శ్రీ నారా రామప్ప. ఇది అరవై అయిదు సంవత్సరాల వెనకటి మాట. అంటే అప్పటికి ఆయనకు ఇరవైయేళ్ళ వయస్సు. ఎప్పుడో అయిదారు సంవత్సరాల వయసులో అదృష్టం పండి మీసరగండ నారాయణరాజు అనే గురువు అనుగ్రహం తనమీద పడింది. చదువుల తల్లి ఒడిలో పడుకో పెట్టాడు ఆ గురువు. భారతం, భాగవతం, రామాయణం, మనుచరిత్ర, వసుచరిత్ర - ఒకటేమిటి? తెలుగు వాఙ్మయంలో సార్వభౌములవంటి కావ్యాలన్నింటినీ సరహస్యంగా ఉపదేశం చేశాడు. వయస్సు వైభవం కొద్దీ ఎంత పండితుడు కనపడినా తొడగొట్టి సవాల్ చేసే ధీమా ఏర్పడే విధంగా ఈ శిష్యుణ్ణి ఆ గురువు తీర్చి దిద్దాడు. ద్రోణాచార్యులకు తోడు కృపాచార్యుడన్నట్లు అల్లు నారాయణప్ప గురుత్వం కూడా శ్రీ రామప్ప సాహిత్య వ్యవసాయం మంచి ఫలసాయాన్ని అందుకోవటానికి దోహదం చేసింది. ఆంధ్ర వాఙ్మయంలో ఆ జ్ఞాన పిపాసువు చదవని పుస్తకం లేదు. ఏ కావ్యం ప్రస్తావనకు వచ్చినా అందులోని రసవత్తర పద్యాలు అతని నాలుక మీద నాట్యం చేస్తూ ఉంటాయి. ఈ సాహిత్య పిపాస ఆయనకొక వ్యసనంగా పరిణమించింది. గొడ్లను కాచుకుంటున్నా, రోడ్డు మీద బస్సుకోసం ఎదురుచూస్తున్నా చేతిలో ఒక గ్రంథం ఉండవలసిందే. పొలంగట్ల మీద ఏ మార్కండేయ పురాణమో పరవశించి చదువుకొంటుంటే కాళ్ళను తాకుకుంటూ మహాసర్పాలు పోతున్నా గుర్తించలేని రసతుందిల హృదయం ఆయనది. తిక్కన భారతంలో సాధరణంగా మహా విద్వాంసులు కూడా తొంగి చూడని శాంత్యానుశాసనిక పర్వపద్యాలు ఆయనను కలలో లేపి అడిగినా చెప్పగల సత్తా ఉన్న మనిషి ఆయన. అంతేకాదు ఆ భావపుష్టికీ, ఆశబ్ద సౌష్ఠవానికీ, ఆ కూర్పు నేర్పుకూ అనుక్షణం ఆనందతాండవం చేస్తుంది ఆయన హృదయం.

ఇప్పుడు (1996) ఆయనకు ఎనభై అయిదేండ్లు. ఉత్తమ కవిత్వం ఎక్కడ వాసన కొట్టినా పరువెత్తిపోయి ఆస్వాదించే పసితనం ఆయనలో నిత్యప్రత్యగ్రంగా కనిపిస్తుంది. తెలుగు వ్యాఖ్యానాల ఆసరాతో ఇటీవల ఆయన సంస్కృతంలోని పంచ కావ్యాలను, రామాయణ భారత భాగవతాలను నిరంతరంగా అధ్యయనం చేస్తున్నాడు. ఏ కొంచెం గుణం అయినా ఇట్టే పట్టివేయగల ఆయన సహృదయంతో ఆ కావ్యాలలోని క్రొత్త పరిమళాలను నిండుగా హృదయకుహరంలో నింపుకుంటూ ఉండటం నిజంగా ఆశ్చర్యకరమైన విషయం.

ఆంగ్ల సాహిత్యం అందచందాలను చవిచూడాలని ఆయన హృదయం ఆరాటపడుతూ ఉండటం మరింత విస్మయజనకమైన విషయం.

వేదాంత సౌరభాలను తనివితీరా తనవి చేసుకోవాలనే తపన కూడా ఆయనలో అడుగడుగునా కానవస్తుంది. ఆయన పురాణం పల్లీయుల హృదయాలను చక్కగా ఆకట్టుకుంటుంది. విధానం కూడా నాగరికులకు చాలా వింతగా కనిపిస్తుంది. ఒక మంచి పాఠకుడు కావ్యం పఠిస్తూ ఉంటాడు. ప్రవక్త అందలి లోతుపాతులను సమీక్షిస్తూ

వ్యాఖ్యానిస్తూ ఉంటాడు. రామప్పగారు ఆ విద్యలో ఆరియు తేరిన వృద్ధమూర్తి. ఇక్కడ ఒక రహస్యం కూడా చెప్పుకోవాలి. పురాణ ప్రవచనానికి ఆయన ఎట్టి ప్రతిఫలమూ ఆశించడు.

శ్రీ నారా పెద్దరామప్ప సుబ్బమ్మల పుత్రరత్నం ఈ రామప్ప. 'మన్నీల' గ్రామానికి అనంతపురం జిల్లాలో ఒక విశిష్టతను తెచ్చిపెట్టిన మహనీయమూర్తి. అంతేకాదు. కులమతాలను ఏ మాత్రం పట్టించుకోకుండా మంచి విద్యార్థులను స్వార్థరహితంగా తీర్చిదిద్దే ఉత్సాహం ఈ వ్యక్తితో ఉరకలు వేస్తూ ఉంటుంది. అంటే ఆయన శరీరానికే వార్ధక్యభారం గానీ మనస్సుకు లేదు.

నిరాఘాటంగా గంటకు మూడు వందల పద్యాలు అర్థ స్ఫూర్తి చెడకుండా, ఆయాసపడకుండా గొంతెత్తి చదవగల సామర్థ్యం ఎనభై అయిదేండ్ల వయస్సులో కూడా పిసరంతైనా ఆయనలో తగ్గలేదు.

ఆయనకు పుస్తకాలు చదవటానికి కళ్ళజోడు అక్కరలేదు. అపురూపమయిన పద్యాలు ఎన్నివేలయినా సరే ఎత్తి వ్రాసుకుంటాడు. ఆయన దగ్గర చాలా విలువయిన గ్రంథాలయం - చక్కని దస్తూరితో వ్రాసుకొన్న పుస్తకాల నిలయం - ఉన్నది.

ఆయన ఎందరికో అక్షరభిక్ష పెట్టాడు. అదేదో సామాన్యమైన విషయం కాదు. ఏడెనిమిదేండ్ల మనుమరాలు మహా ప్రబంధాలను అర్థస్ఫోరకంగా చక్కని పదబంధాల పట్టు చెడకుండా చదువుతుంది. 60/70 ఏండ్ల కొండప్ప భాగవత పద్యాలను కమ్మని కంఠంతో ఒక్క స్ఖాలిత్యం రాకుండా శ్రోతలను అలరిస్తూ గానం చేస్తాడు. మూడు అక్షరాల పదాన్ని తప్పు రాకుండా చదవలేని హరిజన బాలుడు ఆముక్తమాల్యదలోని ''ఖనటత్ప్రయోఽబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య సంపీడితాంగభీతాండజములు'' వంటి సుదీర్ఘ పరుషాక్షరబహుళ సమాసాలను చక్కగా గ్రంథ సాహాయ్యం లేకుండా ఒప్పజెప్పుతాడు. చల్లా కాటమయ్య వంటి శిష్యులు చాలామంది ఉన్నారు. ఇంకా ఎందరో కూలీనాలీ పనులు చేసుకొనే హరిజనులు భారత భాగవత రామాయణాది పద్య గ్రంథాలను పొరపాటు రాకుండా పండితులకు ఆహ్లాదం కలిగించే విధంగా పఠనం చేస్తారు. ఇటువంటి వారంతా ఆనంద తన్మయత్వంతో 'మేము రామప్ప గురువు శిష్యులం, అని చెప్పుకుంటారు. ఇదీ ఆయన శిష్యులకు పెట్టిన అక్షర భిక్ష!

ఒక విధంగా చెప్పాలంటే ఆయన ఒక సజీవ గ్రంథాలయం. తెలుగు సరస్వతి ముగిసిపోయే ముద్దుబిడ్డ శ్రీ నారా రామప్ప ఏ ఆర్భాటానికీ, ఏ ప్రచారానికీ లవలేశమయినా ఆసక్తి చూపని మనీషి. ప్రొద్దున ఇంత రాగిసంకటి తింటే ఇంక ఆరోజంతా ఆయనకు భోజనంతో పనిలేదు. ఆయనకు సాహిత్యాధ్యయనమే సర్వసంపద. ఇటువంటి విద్యాతపస్విని చూచి వెలుగుతల్లి తెలుగు వెల్లువ నిరంతర చైతన్యాన్ని నిలుపుకొంటూ ఉంటుందని అస్మదాదుల నిండు నమ్మకం.

మా యిద్దరిదీ ఒక విచిత్రమైన, భావస్థిరమైన జనవాంతర సౌహృదం. మేమిద్దరం వయసులో సుమారు ముప్పది సంవత్సరాల అంతరం ఉన్నవాళ్ళం. అయినా ఆయనకు నేనంటే మహాగౌరవం. నాకు ఆయనంటే అదేదో చెప్పటానికి సాధ్యంకాని అభిమానం. పట్టుమని పదిరోజులు ఒకరినొకరు చూచుకోకుండా ఉండలేని అనుబంధం. మా పిల్లలూ, నా భార్యా 'అదిగో మన్నీలతాత వచ్చాడు' అని ఆనందంతో చెప్తూ ఉండేవారు. దాదాపు రెండు దశాబ్దాల కాలంలో మేము ఎప్పుడు కలిసినా కనీసం ఒక వంద పద్యాలు స్మృతిపథంలో మెదిలేవి. ఇద్దరమూ మనసునిండిన ఆనందంతో మెలిగేవాళ్ళం.

ఆయనా నేనూ మచిలీపట్నం, విజయవాడ, తిరుపతి, బెంగుళూరు వంటి ఎన్నో స్థలాలలో జరిగే సాహిత్య కార్యక్రమాలకు కలిసి వెళ్ళేవాళ్ళం. ఎందరో మహానుభావులు ఆయననుగూర్చి నా నుండి తెలిసికొని అంతరంగంలో ఆయనను భద్రంగా నిలుపుకున్నారు.

ఆయన ఒకరోజు ''స్వామీ! ఒక కోరిక. మీ యింటి యీ ముంగిలి వరండాలో మీ పటం ఒకటి పెట్టించండి'' అన్నాడు. 'ఎందుకూ' అని అడిగాను. ''నేను ఎన్నోమార్లు మీ యింటికి వస్తూ ఉంటాను. మీరు ఇంట్లో లేనప్పుడు అమ్మయ్యా, అమ్మాయిలూ ఎంతో ఆదరంతో రండి తాతా! కూర్చోండి. కాఫీ త్రాగుతారా? అని పలుకరిస్తారు. అది ఆనందమే. కానీ నాకు కావలసినవి అవి కావు గదా! మీ పటాన్ని ఒకసారి చూచి నమస్కారం చేసికొని మీతో ప్రసంగం చేసిన అనుభూతి పొంది తిరిగి వెళ్ళిపోతాను'' అన్నాడు!

ఒకసారి తిరుపతిలో డా॥ మేడసాని మోహన్ సహస్రావధానానికి తీసికొని వెళ్ళాను. అక్కడ ఎందరో నాకు పరిచితులైన వారికి ఆయనను పరిచయం చేశాను. 'ఈయన ఎప్పుడూ నా వెంటనే ఉంటాడు' అని చెప్పాను. వెంటనే ఆయన ''అవునవును ధర్మరాజు వెంట కుక్కలా'' అన్నాడు! ఒక్కక్షణం నివ్వెరపాటు కలిగినా వెంటనే ఒక భావనాతరంగం కదలాడింది హృదయంలో - నిజమే! నా ధర్మరాజు తనం నిజమైనా కాకపోయినా ఆయన కుక్కతనంలోని ధర్మస్వరూపం పరమ సత్యమైనదని.

ఇటువంటి స్మర్తవ్య విషయాలు మా మధ్య ఎన్నో ఉన్నాయి.

సాహిత్యాధ్యయన అధ్యాసనలే సర్వస్వమూ అయిన ఈ మనీషివరేణ్యుడు సుమారు తొంబది సంవత్సరాల వయస్సులో 7.2.2003న రథసప్తమీ పుణ్యదినాన్ని ముందు పెట్టుకొని జీవన రథయాత్రను ముగించాడు. ఆయన చేసిన అనంత సాహిత్య తపస్సు ఆయనకు అక్షయ పుణ్యలోకాలను ప్రసాదిస్తుందని గాఢంగా విశ్వసించే సమానధర్ములం పెద్దసంఖ్యలోనే ఉన్నాం.

రాజమహేంద్రి — శరశర్మ

చిత్రభాను, రథసప్తమి 8.2.2003

# విద్వత్కవిశేఖరుడు శ్రీ యార్లగడ్డ వేంకట సుబ్బారావుగారు

-మొవ్వ వృషాద్రిపతి

ఒకనాటి సమాజమున, తర్క వ్యాకరణ, మిమాంస వైశేషికాది శాస్త్ర పారంగతులను రాజు లగ్రహారములతో కంఠహారములతో సన్మానించి గౌరవించినారు. ఆనాడా శాస్త్రములు సభాపూజ్యములు. క్రమముగా కాలము మారుచు, ఆ విద్యలకు స్థానము కఱవైనది. ఆ స్థానమునందు, భౌతిక రసాయనాది శాస్త్రములు బహుళప్రచారముతోపాటు బహుజనాదరపాత్రములైనవి. ఉపాధి కల్పనకు అవి దారులు తీసినవి. వానికి రాజాదరణ ప్రజాపూజ్యత సంభవించినవి. కావున తర్కాది శాస్త్రములు నిరాదరణకు గురియగుచు వచ్చినవి.

ఒకనాడు బాధాంత తర్కవాదులు, భాష్యాంత వైయాకరణులు, ఘనపాఠీలు సమాజ గౌరవపాత్రు లగుచుండిరి. నేడా విద్యలు నేర్చుకొను విద్యార్థుల సంఖ్య మృగ్యమైనది. ఆ విద్యలకు ఉపాధ్యవకాశములు లేకుండుటయే తత్కారణము. ఇపుడు మిమాంసాది శాస్త్ర పాఠములు నేర్చుకొనవలయునన్నను బోధించు పండితులు లభించుటలేదు.

భయంకరమైన ఎడారిలో అక్కడక్క ఒయాసిస్సులవలె ఇప్పుడెచ్చటనో శాస్త్ర పండితులు స్వల్ప సంఖ్యలో గోచరించుచున్నారు. అట్టి వారిలో ప్రాతఃస్మరణీయులు శ్రీ యార్లగడ్డ వేంకట సుబ్బారావుగారొకరు. వారు కృష్ణా తీరస్థ నల్లూరుగ్రామ వాసులు. అది పూర్వమందు రేపల్లె తాలూకాలో నుండెడిది.

ఈ రేపల్లె తాలూకాలో రెండు మూడగ్రహారములున్నవి. పెద్దవరము - ముక్తిపల్లి- ఆరేపల్లి మొదలైన అగ్రహారములందు పేరెన్నికగన్న శాస్త్ర సాహిత్య కోవిదులుండెడివారు. దక్షిణదేశ దిగ్గజముగా ప్రఖ్యాతికెక్కిన పండిత రంగాచార్యులు, సముద్రాల లక్ష్మణాచార్యులు, తిరువేంగళాచార్యులు, మొవ్వ వేంకటదాసు, పండిత శ్రీనివాసపెరుమాళ్ళు పండిత మొవ్వ దాశరథిసూరి, ముళ్ళపూడి నారాయణశాస్త్రి, తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి మొదలైన మహామహులందరును శాస్త్ర సాహిత్య విద్యాపారంగతులే. వారి చరిత్రము మాత్రము నేడు శేషభూతమైయున్నది.

పైనుదహరించిన ఉద్దండ పాండితీ శౌండీర్యులతో సమస్కంధులైనవారు శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు. వారిప్పుడు ఎనుబదియవపడిలోనున్న జ్ఞాన వయో వృద్ధులు.

• మహాత్ములయొక్క చరిత్రలు జాతి కాదర్శ పాత్రములుకదా! అట్టి విద్వాంసుల జీవన విధాన మెఱుంగుటయు పాపహరణ కారణముగా పెద్దలుగ్గడించిన కతమున వారి జీవనరేఖా విలాసము నీ చిన్న వ్యాసమున స్థాలీపులాక న్యాయమున వివరించెదను.

**దండిగ మర్త్య సంతతులు ధాత్రి జనించి నశించుచుండు, నొ**
**క్కండెవడో యఖండమగు ఖ్యాతి గడింపదలంచు, నందు ను**
**ద్దండ పరిశ్రమాప్తి హితతత్పరుడైన ప్రచండ పాండితీ**
**మండనుడైన సత్కవి సమస్త జనాళికి దారి చూపడే?**

శ్రీ సుబ్బారావుగారు వ్యావసాయిక కటుంబమున జన్మించినవారు. వారికి పుష్కలమైన భూవసతి కలదు. ఆనాటి సమాజమున ప్రథన స్థానము కృషీవలునకే. వారి మాతామహులు - పితామహులు అందఱును వ్యవసాయరంగమున నిష్ణాతులే.

**తన తనుజాత ఘర్మ జలధారలు కాలువ గట్టి పారి ధా**
**త్రిని నిలువెల్ల ముంచి నిజ దేశ జనావళి క్షుత్తు నార్పగా**
**ఘన కృషి సల్పు హాలికుని కంటెను బంధుగు లన్యులుందురే?**
**జనహిత తత్పరుల్ సుగుణ సాంద్రులు వారె శ్రమైకజీవనుల్.**

యార్లగడ్డ లక్ష్మయ్యగారు నల్లూరులో సుసంపన్నుడైన రైతు. సర్వసద్గుణ సంపన్నుడు. ఆయన అర్ధాంగ లక్ష్మి సకలసాధ్వీ శిరోమణి పడిగమ్మ. ఆ దివ్య దంపతుల నోముల ఫలముగా, 1920వ సంవత్సరము అక్టోబరు నెల, మూడవతేదీ నల్లూరు గ్రామమున, పుట్టగుంట చౌదరయ్య భూషమ్మల యింట - అనగా మాతామహుల గృహమున శ్రీవేంకటసుబ్బారావుగారు జన్మించిరి.

చిన్నతనము నుండియు వీరు సూక్ష్మ గ్రహణశీలురు. పట్టుదల కలిగిన బిడ్డ. కలిగిన వారింటి బిడ్డడగుటచే అటు మాతామహులు, ఇటు తల్లిదండ్రులు అల్లారుముద్దుగా పెంచదొడగిరి. విధి చేష్టితములు అనూహ్యములు. వారికి బాల్యమునందే మాతృ వియోగబాధ సంభవించినది.

అవి స్వాతంత్ర్య సంగ్రామము ముమ్మరముగా జరుగుచున్న రోజులు. ఉద్యమము పల్లెలకు గూడ వ్యాపించినది. ఉద్ధృతరూపము ధరించినది. మహాత్మాగాంధీ విదేశీ వస్తు బహిష్కరణకు పిలుపునిచ్చిరి. ఆపిలుపునందుకొన్న యావద్భారత దేశము కట్టు పుట్టములను గూడ విసర్జించుచున్నది. ఆ ఛాయలు నల్లూరు గ్రామము పై పడినవి. అప్పుడు సుబ్బారావుగారికి ఏడెనిమిదివత్సరముల వయస్సు. ఒకనాడు వారింటి ముందు పెద్ద మంటవైచి విదేశీ వస్తువులను, వస్త్రములను దహించుచుండిరి. అప్పుడే వీథి బడి నుండి యింటికి

వచ్చుచున్న శ్రీ సుబ్బారావుగారు అన్యప్రేరితులుకాక స్వాభీష్టము మేరకు తాము ధరించియున్న పొట్టిలాగు - చొక్కారెంటిని తీసి ఆ మంటల కాహుతినిచ్చి పరుగునపోయి గదిలో దూరి తలుపులు వైచుకొనిరి. ఎందరు వచ్చి పిలిచినను తలుపులు తెఱువక, ''నాకు ఖద్దరు గుడ్డలు కుట్టించి తెప్పించినచో బయటకు వత్తును, లేనిచో రాను'' అని భీష్మించుకొని కూరుచుండిరి. సంపన్న గృహస్థులుగాన, అక్కడికి పదిమైళ్ళ దూరముననున్న రేపల్లెకు మనుష్యులను పంపి, వెంటనే వస్త్రములు కుట్టించి తెప్పించిరి. ఆ వస్త్రములను ధరించి తలుపులు తీసికొని బయటకు వచ్చిరి. అప్పటి నుండి ఇప్పటి వఱకు వారు ఖద్దరు వస్త్రధారణము తప్ప, అన్య వస్త్రములు దరింపరైరి.

చదువునందలి వీరి ప్రతిభ- చుఱుకుదనము గమనించిన వారి తండ్రి - ఉపాధ్యాయులు ఆంగ్ల విద్యాభ్యాసము చేయించినచో అభివృద్ధినంద గలడని తలంచిరి. కాని పర భాషయైన ఆంగ్లమును చదువనని వీరు మొండికెత్తిరి.

యలమంచిలి వేంకటప్పన్నగారు స్వాతంత్ర్య సమర యోధులు. గాంధీజీ అడుగు జాడలలో నడచిన గాంధీయవాది. మోకాళ్లు దిగని ఖద్దరు పంచె, - ఒక ఖద్దరు బన్నీ - పై పంచె వీరి వేషము. వారు నల్లూరు ప్రాంతమున హిందీ ప్రచారోద్యమమును నిర్వహించుచుండిరి. వారి ఉచిత హిందీ శిక్షణ తరగతులకు విద్యార్థులు విరివిగా వచ్చుచుండిరి. వారిలో శ్రీసుబ్బారావుగారొకరు. కొలది దినములలోనే మాధ్యమిక పరీక్ష యందుత్తీర్ణులై యలమంచిలి వారి యొద్ద రాష్ట్రభాష పరీక్షకు చదువుచుండిరి.

అప్పుడొక అనుకొనని సంఘటనము వారి హిందీ విద్యాభ్యాసమున కాటంక కారకమైనది. మద్యపాన వ్యతిరేకోద్యమము విరివిగా ప్రచారము పుంజుకొనుచున్నది. ఆనాడు సత్యాగ్రహిని, గృహస్థులు తమ యిండ్లలో ఉంచుకొనరాదు. వారికి భోజనము పెట్టరాదు. వారితో సంబంధ బాంధవ్యములుండరాదు. ఈ స్థితినుల్లంఘించినచో ప్రభుత్వమువారి కోపమును చవిచూడవలసివచ్చును.

యలమంచిలి వేంకటప్పయ్యగారు, సత్యాగ్రహి. మద్యపాన వ్యతిరేకోద్యమమును ప్రచారమొనరించుచుండిరి. తన వలన పరులకు కష్టము కలుగరాదను తలంపుతో ఆయన, కృష్ణా నదీ తీరమునగల ఒక పాడు బడిన దేవళములోనికి మకామును మార్చిరి. విద్యార్థులు అను నిత్యమును అచ్చటికేపోయి హిందీ విద్యాభ్యాసమొనర్చుచుండిరి. ఒకనాడు పోలీసులు ఆ శివాలయమ్మై పై విరుచుకొనిపడిరి. వేంకటప్పయ్యగారిని సున్నములోనికి యొముక లేకుండ విరుగబాదిరి. ఈడ్చుకొని పోయి కారాగృహమున నెట్టిరి.

**తత సర్వంబు నశించుగాక హిత సంతానంబు దూరంబుగా**
**బ్రతుకెల్లన్ వెతలొందుగాక యధికారశ్రేణి దుష్క్రోధ సం**

ధృతి బాధించునుగాక పూనిన ప్రజాదీక్షన్ విసర్జింతురే?
మతిమంతుల్ సకలైక విశ్వహిత సమ్యక్కార్య నిర్వాహకుల్.

శ్రీ వేంకట సుబ్బారావుగారు తన హిందీ విద్యాభ్యాసానికి చరమ వాక్యము పలుకవలసి వచ్చినది. అమృతలూరులో సంస్కృత పాఠశాల కొన సాగుచున్నది. సుబ్బారావుగారి దృష్టి ఆ పాఠశాల పై బడినది. భాషాప్రవీణకుగాని, విద్యాప్రవీణకుగాని, అర్హతను కలిగించు ప్రవేశ పరీక్షకు అక్కడ చదువుట ప్రారంభించిరి. శ్రీ పి. వి. రమణారెడ్డిగారు వీరి సహాధ్యాయి. అక్కడ చదువుచున్న రోజులలోనే పద్యము లాశువుగా అలవోకగా చెప్పగల ప్రతిభను సంపాదించుటకు ప్రయత్నము ప్రారంభించినారు.

ప్రవేశ పరీక్ష యందుత్తీర్ణులై చిట్టి గూడూరు సంస్కృత కళాశాలలో ప్రవేశించి, విద్యాప్రవీణ పరీక్షకు చదువు ప్రారంభించిరి, విద్యార్థులలో విద్యా విషయమున అగ్రగణ్యులుగా, కళాశాలాధ్యక్షులు వరదాచార్యులవారి కనుంగు శిష్యులైరి. ఆ కళాశాలలో దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు, సోమశేఖరశాస్త్రిగారు వంటి ఉద్దండ పండిత ప్రకాండులు ఉద్యోగించుచుండిరి.

ఒక పాఠశాలలో విద్యాప్రవీణ చదివిన పండితుడు, తెలుగు పండితునిగా చేరెను. ఆ వార్త చిట్టి గూడూరు కళాశాలా ప్రాంగణమునకు ప్రాకినది. భాషాప్రవీణ విద్యార్థులు ''సంస్కృతము చదివినవారు, తెలుగు నేమి బోధింపగలరు? ఆతడెందులకు తెలుగు పండితునిగా చేరినట్లు?'' అని ఈసడించి మాటాడదొడంగిరి. శ్రీ సుబ్బారావుగారు కలిగించుకొని, ''ఉన్నత పాఠశాలలో తెలుగెంత? దానిని విద్యాప్రవీణవారు చెప్పలేరా? అలాగే కళాశాలలో ఉన్న సామాన్య సంస్కృత పాఠమును భాషాప్రవీణవారు చెప్పలేరా?'' అని వారి ఆక్షేపణలకు సమాధానమొసంగిరి.

భాషాప్రవీణ విద్యార్థులు ''మీరు బాలవ్యాకరణము చెప్పగలరా?'' అని ప్రశ్నించిరి. ''నా బాలవ్యాకరణ పాండిత్యమును మీరు పరీక్షించుకొనవచ్చు''నని సుబ్బారావుగారు పలికిరి. వారు తత్సంబంధమగు ప్రశ్నలు వేసిరి. సుబ్బారావుగారు వానికన్నింటికిని సముచిత సమాధానములిచ్చుటయేకాక, బాలవ్యాకరణమునందు కొన్ని సందేహములను లేవనెత్తిరి. అవి ఆ విద్యార్థులకర్థము కాక, దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి దగ్గరకు వెళ్లి ఆ సందేహములు వెల్లడించిరి. అందులకు శాస్త్రిగారు ''ఇంతవఱకు నన్నీ ప్రశ్నలడిగిన వారు లేరు. వీని నడిగిన దెవ్వ'' రనగా, శ్రీ సుబ్బారావుగారని సమాధానమొసంగిరి. అపుడు శాస్త్రిగారు, సుబ్బారావు సూక్ష్మగ్రాహియగు విద్యార్థియని మెచ్చుకొనిరి.

భాషాప్రవీణ విద్యార్థులు వచ్చి సుబ్బారావుగారిని, 'తెలుగులో పద్యములు వ్రాయగలవా?' అని ప్రశ్నించిరి. ''వ్రాయుట యేమి? ఆశువుగా చెప్పగలను'' అని

సమాధానము చెప్పిరి. ఐనచో చెప్పుమనిరి.'' నేనిపుడు ఇక్కడ చెప్పను. సభ చేయింపుడు. మన అధ్యాపకుల సమక్షమున చెప్పద'' నని సమాధానమొసగిరి.

ఒక ఆదివారము సాయంసమయవేళ ఆశుకవితాసభ నేర్పాటుకావించిరి. విద్యార్థులు ఉపాధ్యాయులు సమావేశమైరి. అపుడు శ్రీ సుబ్బారావుగారిని 'సీతాకల్యాణము'ను గూర్చి పలుకవలసినదిగా ఆదేశించిరి. వెంటనే తడవుకొనకుండ శ్రీ సుబ్బారావుగారు గంట సేపటిలో 60 పద్యములు రసతుందిలముగా చెప్పి యందరిని ఆనందాశ్చర్య సంభ్రమములందు ముంచియెత్తిరి. శ్రీ సుబ్బారావుగారి కవితాశక్తిని అందఱును వేనోళ్ల ప్రశంసించిరి.

కళాశాలలో అధ్యాపకుల సంఖ్య చాలినంత లేకయుండెను. ప్రవేశపరీక్షకు చదువుచున్న విద్యార్థులకు, విద్యానాథుని ప్రతాపరుద్రీయ మలంకార శాస్త్రమును పాఠము చెప్పవలసినదిగా వరదాచార్యులవారు సుబ్బారావుగారి నాదేశించిరి. అదే తరగతియందు వరదాచార్యులవారి కుమారుడును చదువుకొనుచుండెను. ఒకనాడు సుబ్బారావుగారు విద్యార్థులకు పాఠమును చెప్పుచుండిరి. వారికెదురుగా ఒక గవాక్షము కలదు. గాలికి ఆకిటికీ తలుపులు బారలుగా తెఱచుకొనినవి. కిటికీ వెనుక వరదాచార్యులవారు కూర్చుండి సుబ్బారావుగారు చెప్పుచున్న పాఠమును వినుచుండిరి. సుబ్బారావుగారు, వరదాచార్యులవారి కుమారుని పిలిచి ''నాన్నగారక్కడ ఉన్నట్లు చెప్పవైతివేమి?'' అని ప్రశ్నింపగా, నా బాలుడు ''బాబాయ్! రోజూ నీవు పాఠమును చెప్పుచుండగా నాన్నగారు అక్కడనే కూర్చొనుచుండిరి'' అని చెప్పెను. అనగా పాఠమునెట్లు చెప్పుచున్నారో పరీక్షించుచున్నారన్నమాట.

చివరి పరీక్షలను వ్రాసి సుబ్బారావుగారింటికి వచ్చిరి. ఉత్తమ శ్రేణి యందుత్తీర్ణులైరి. అపుడు వరదాచార్యులవారు, శ్రీ సుబ్బారావుగారిని పిలువనంపి, ధ్వన్యాలోక ప్రతిపాదిత ధ్వనిని, అలంకార శాస్త్రమున సమన్వయించి, చంద్రాలోకము ప్రధాన భూమికగా చేసికొని పరిశోధన చేయవలసినదిగా ఆదేశించిరి.

వారి యాదేశానుసారము సుబ్బారావుగారు పరిశోధనకై పరిశ్రమ ప్రారంభించి, ధ్వన్యాలోకమును క్షుణ్ణముగా పఠించి, దానిపై వంద పుటల వివరణమును వ్రాసికొనిరి. దానిని చూచిన ఆచార్యులవారు అనేక క్రొంగ్రొత్త విషయములు సూర్యాలోకన భాగ్యమునకు నోచుకొన్నవని శ్లాఘించిరి.



ఎంతటి వానికేనియు నొకేవిధి సాగదు కాల-మెప్పుడే
యింత ఘటిల్లునో? తెలుపు విజ్ఞుడు కల్గునె? తానొకండెదన్
చింతిల దైవమొందుగ గణించును, తాను నిమిత్తమాత్రుడై
అంతయు పొందుచుండవలె హర్ష విషాదము లొక్కతీరునన్.

అదే సమయమున శ్రీ సుబ్బారావుగారి సవతితల్లి స్వర్గస్థురాలైనది. తండ్రిగారు వార్ధక దశలోనుండిరి. సవతితల్లి బిడ్డలు చిన్న పిల్లలు. ఏబది ఎకరముల వ్యవసాయము. సుబ్బారావుగారి విద్యావ్యాసంగము గ్రీష్మకాల వాపీజలంబు వలె క్రమక్రమముగా అడుగంట సాగినది. వారొకనాడు వరదాచార్యులవారి సన్నిధికేగి, ఈ విషయములన్నియు వివరించి, తనకిక పరిశోధన కవకాశము లేదని విన్నవించిరి.

అందులకు దేశికులు వ్యధనొంది ''సుబ్బారావూ! ఈ కళాశాలలో మీమాంసాది శాస్త్రములు బోధించు సోమశేఖరశాస్త్రిగారు వృద్ధులైరి. ఆ స్థానమునునీవు పూరింతువని, నిన్నిచ్చటనే యుంచుకొవలయునని ప్రయత్నించితిని. దైవేచ్ఛ. ఏమిచేయువచ్చు? అటులేకానిమ్ము, అని ఆశీర్వదించి వీడుకొల్పిరి.

వ్యవసాయమును వృద్ధులైన తండ్రిగారి కొప్పగించి, సవతి తమ్ముల విద్యాభ్యాసమునకై సుబ్బారావుగారు, ఉద్యోగమునందు చేరిరి. వారికప్పుడు మూల వేతనము రూ 45/- అన్నియును కలిపి వంద రూపాయలకు మించదు. ఐనను సోదర విద్యాభ్యాసార్థమై, ఉన్నత పాఠశాలలో సంస్కృతాధ్యాపకులుగా చేరి, పెదనందిపాడు- నిడుబ్రోలు -రేపల్లె మొదలగు ప్రాంతములందు 1945 నుండి 1952వ సంవత్సరము వరకు ఉద్యోగము కొనసాగించిరి. భార్యతోసహా కాపురమును బెట్టి తాను పనిచేయుచోటనే సోదరులను చదివింపసాగిరి. సుప్రసిద్ధ కవిపుంగవులు కీ. శే. తుమ్మల సీతారామమూర్తి చౌదరి (తెనుగు లెంక)గారికి ఏ శబ్ద సాధుత్వాసాధుత్వ విషయమైనను సంశయము కల్గినచో, వీరితో చర్చించుచుండిరి. లేఖ ద్వారానైనను తెలిసికొనుచుండిరి. వీరు చెప్పినదే సాధురూపముగా ప్రయోగించుచుండిరి.

1952వ సంవత్సరమున వీరికి పితృవియోగము సంభవించినది. వారంతటితో చేయుచున్న ఉద్యోగమును విరమించి ఇంటికి చేరిరి. వ్యవసాయ కార్యరంగమున దృఢ దీక్షతో ప్రవేశించిరి.

1952లో ఎన్నికలు వచ్చినవి. కల్లూరి చంద్రమౌళిగారి ప్రోత్సాహముతో రాజకీయములందు ప్రవేశించి, ఆ ప్రాంతమున కాంగ్రెసు పార్టీకి నాయకత్వము వహించిరి. ఆనాడీ ప్రాంతములలో కమ్యూనిస్టుల ప్రాబల్యమధికముగా నుండెడిది. శ్రీ సుబ్బారావుగారు సిద్ధాంత పరముగా వీరితో ఢీకొనిరి. 'నీ తల తీస్తా' మని రోజుకొక్క ఆకాశరామన్న యుత్తరము వచ్చుచుండెను. కాని సరకు చేయక, చంద్రమౌళిగారికి ఆ ప్రాంతమున విజయమును సాధించి పెట్టిరి.

వీరు చాలకాలము గ్రామపంచాయితీ సర్పంచిగా ఏకగ్రీవముగా నెన్నుకొనబడి ప్రజోపయోగ కార్యక్రమములకై సొంత పొలము నమ్ముకొనుచువచ్చిరి. దాదాపు వీరి భాగమునకు వచ్చిన పొలమంతయు సేవాకార్యక్రమములకు కైంకర్యమైనది.

గుడిసెయు లేని వారు పరుగుల్ పరగించుచు రాజకీయమం
దడగి, విలాస హేమమయ హర్మ్యములెన్నియొ కట్టుకొంచు ని
య్యెడ వడి కోట్లకుం బడగలెత్తెడి వేళ ప్రజాహితార్థమై
కడగి స్వకీయ సంపదల ఖర్చునొనర్తురె? వీరి పోలికన్.

కో- ఆపరేటివ్ సొసైటీ అధ్యక్షులుగా, రేపల్లె కో- ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీ అధ్యక్షులుగా - గుంటూరు జిల్లా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు డైరెక్టరుగా వివిధ పదవులలంకరించిరి. రాజకీయముగా వీరే పదవి నలంకరించినను, దానికి వన్నె తెచ్చి, ధర్మము- న్యాయము- సత్యము మొదలగు విలువలు పాటించుట కధిక ప్రాముఖ్యమొసంగిరి.

1980వ ప్రాంతమున శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు రేపల్లె డిగ్రీ కళాశాలకు ఆంధ్రోపన్యాసకులుగా వచ్చిరి. సుబ్బారావుగారిలోని గూఢ సాహితీ శక్తిని గ్రహించి, దానిని వెలికి తీసికొని వచ్చుటకు ప్రయత్నములారంభించిరి.

అదే సమయమున రేపల్లెలో శ్రీ సుబ్బారావుగారికి, వివిధ సంస్థలు కలిసి మహాసన్మాన కార్యక్రమము నేర్పాటు చేసినవి. తెలుగు లెంక, వరదాచార్యులవారు మొదలైన ఏబది మంది పండితు లా సభలో సుబ్బారావుగారి శాస్త్ర సాహిత్య వైదుష్యమును బహుధా ప్రశంసించిరి. ఆ సభ కాధ్యక్షము వహించిన వృషాద్రిపతి గారు, సభలో సుబ్బారావుగారొక రసభరిత కావ్యము వ్రాయుచున్నట్లు ప్రకటించిరి. సుబ్బారావుగారు విస్మయావిష్టులై ఆ ప్రతిపాదనకంగీకరింపక తప్పినది కాదు. ఆ సభలో వారికి 'విద్వత్కవిశేఖర' బిరుద మీయబడినది.

కాకతీయుల చరిత్రమును, కావ్యముగా వ్రాయుటకు సంకల్పదీక్ష వహించిరి. వారే పని చేసినను, పరిపూర్ణాధి కారముతోనే తప్ప అరకొర జ్ఞానముతో ప్రారంభింపరు. వివిధ పరిశోధనలు నిర్వహించి, కావ్య ప్రారంభము చేసిరి. ఎప్పుడు వ్రాసిన పద్యములప్పుడే కీ.శే. గిద్దలూరు చెంచు బసవరాజుగారికి, మొవ్వ వృషాద్రిపతిగారికి విన్పించుచుండిరి. పద్యము నందెచ్చటను, వ్యర్థ పదముండదు. పద్యములు దృఢ బంధ విరాజితములై యొప్పునే తప్ప శిథిలబంధముండదు. పద్యము విడిచిన బాణమువలె రివ్వున సాగి పాఠకుని హృదయమును సోకును. ఒడ్డు లొరుసుకొని పారు గంగా ప్రవాహమువలె భావనిర్భరములై యొప్పారును. ప్రతి పద్యము నిర్భర భావసంభృతమై యలరారును. ఏ రసము వర్తించు పట్ల ఆ రస మతివేలముగా పాఠకుని ముంచియెత్తును. వర్ణనలు నూత్నభావ రంజితములై ప్రకాశించును.

'కాకతీయ తరంగిణి' పేరుతో ప్రచురింబడిన యీ కావ్యమును పండిత ప్రకాండులందఱును వేనోళ్ల ప్రశంసించిరి. పూజ్యులు నండూరి రామకృష్ణమాచార్యుల వారు

''వీరి ఒక్క గ్రంథము శతగ్రంథముల పెట్టు'' అని శ్లాఘించిరి. తెలుగు విశ్వ విద్యాలయమువారు ఉత్తమ పద్యరచనకు ఈ కావ్యమునెన్నుకొని పురస్కారము నందించిరి.

వీరు ఈ మధ్య 'ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల' అను వసుచరిత్ర పద్యము పై లేవనెత్తిన సందేహము పండితలోకమున సంచలనము రేకెత్తించిన విషయము పండితులకెల్లఱకును విదితమే. 'సాహిత్య కౌముది' సాహిత్య పత్రిక పఠించు వారందఱకు నిది తెలియును.

గుంటూరులో జరిగిన వారి సన్మాన సభలో శ్రీ నండూరి వారు, వీరికి ''కర్షక కవిసార్వభౌమ'' యను బిరుదప్రదాన మాచరించిరి. రేపల్లె సాహితీ సమితివారు ''మధురకవిచక్రవర్తి'' యను సార్థక బిరుదము నొసంగిరి.

వీరి పద్య శైలి కొకటి రెండు పద్యములు ఉదాహరింతును. ఈ కావ్య ప్రారంభమైన ఆముఖమున మొదటి పద్యముల నారయుడు.

**''రారండోయి కుమారులార! వితతాంధ్ర శ్రీ యశః కౌముదీ**
**నీరంధ్రంబగు నోరుగల్పురము వర్ణింపంగ శక్యంబె? వి**
**న్నారా? కాకతి రాజవంశ పదవిన్యాసాభిరామంబుఁ గ**
**న్నారంజూతము రండు విక్రమ కథా వ్యాహార లీలాగతిన్.**

**కవిచతురాననుల్ కడఁగి గంటముఁ బట్టకయున్న విశ్వస**
**ద్భువన విలాసమే యణఁగిపోయి నశించును కాలగర్భమం**
**దవిదిత పూర్వమానుష మహాచరితంబగు జాతి యున్నతి**
**ప్రవణముగాదు జంతుతతిభంగి నజస్రముఁ బుట్టి గిట్టెడున్.''**

ప్రతిపద్య మిదే స్థాయిలో సాగును. పాత్ర చిత్రణము- శిల్ప వైచిత్రి ఆదునిక కవులలో నాన్యతో దర్శనీయము.

వీరు శంకరుని అపరోక్షాను భూతిని పద్యానువాదం చేశారు. అతిలోకోత్తరముగా అనువాదము సాగినది. ఇది ఇటీవలనే ప్రచురింపబడినది.

'కన్యకాపరమేశ్వరీ చరితము' ప్రౌఢ ప్రబంధముగా విరచించిరి. కాని, అదియింకను పరిపూర్ణము కాలేదు.

భగవంతుడు వీరి ప్రస్తుత అనారోగ్యమును తొలగించి పై గ్రంథము పాఠక కరకమలముల కందించ గల అవకాశము కలిగించుగాక!

## డా॥ పంపన సూర్యనారాయణగారి సంస్మరణ వ్యాసం:

# ఆప్తమిత్రునికి అశ్రునివాళి

-డా॥ యు. మధుర మోహనరావు
డా॥ జోశ్యుల కృష్ణబాబు

ఆత్మీయుడు అస్తమించినపుడు కంఠం గద్గదమవుతుంది. హృదయం విలపిస్తుంది. మస్తిష్కం మందగిస్తుంది. ఆపాద మస్తకం చైతన్య రహితం అవుతుంది. కలం కదలదు. అక్షరాలు ఆగిపోతాయి. గళం నిలిచిపోతుంది. మిత్రుడు పంపన అందరికీ ఆత్మీయుడు. అజాత శత్రువు. ఆటువంటి సాహితీ మిత్రుడు ఎవరికీ చెప్పా పెట్టకుండా, ఏదోపని ఉన్నట్టుగా హఠాత్తుగా తిరిగి రాని లోకాలకు వెళ్ళిపోయాడు. మృత్యువు దారి తప్పి దొంగచాటుగా అతని జీవితంలోకి ప్రవేశించి ఉంటుంది. లేకపోతే అప్పుడే ఆయనకు మరణం ఏమిటి? సాహితీ సరస్వతిని అనేక వినూత్నాలంకారాలతో కైసేయవలసిన ఆ మహాకవిని ఇలా అర్థాంతరంగా మధ్యలోనే తీసుకుపోయినందుకు మృత్యువు తప్పకుండా పశ్చాత్తాపపడి తీరుతుంది.

సాహితీ మిత్రుని అస్తమయాన్ని ఈ కళ్లతో చూసినప్పటికీ, ఈ చేతులతో ఆయన్ని సాగనంపినప్పటికీ మనసెందుకో ఇంకా ఆ నిజాన్ని అంగీకరించడంలేదు. ఇది కల అయి ఉంటే ఎంత బాగుండును అనిపిస్తోంది. ఇంకా ఆయన ఏ సెలవులోనో ఉన్నట్టుగా, ఏ రిఫ్రెషర్ కోర్సుకో వెళ్ళినట్లుగానే ఉంది. ఒక్కసారి ఆయన ఇకలేరనే చేదునిజం మళ్ళా హృదయాన్ని తాకి భగ్గుమనిపిస్తోంది.

పంపన తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని ఎప్పుడూ స్తబ్ధంగా ఉంచేవారుకాదు. నిత్యం చైతన్యంతో తొణికిసలాడించేవారు. ఆయన 2002 డిసెంబరు 7వ తేదీ ఉదయం అస్తమించారన్న విషాద వార్త అధ్యాపక లోకాన్ని ఆతలాకుతలం చేసింది. ఆయన అభిమాన కోటికి, ఆప్తులకు, సన్నిహితులకు, సహచరులకు అపార దుఃఖాన్ని కలిగించింది. విద్యార్థులను దిగ్భ్రాంతి పాలుచేసింది. కొందరు ఈ వార్త కాదనుకొన్నారు. ఎందరో నిజం కాకూడదనుకొన్నారు. పంపనకవికి మరణం లేదనుకొన్నారు. ఎవరికీ తలవంచని పంపన కాలునితో పోరాటంలో తలవంచబోడని ఆయన ఆత్మీయులు అత్యంత గాఢంగా ఆశించారు, ఆకాంక్షించారు. కానీ వారందరికీ ఆశాభంగం తప్పలేదు. ఏబది ఏడు సంవత్సరాల జీవన పోరాటంలో ఏమాత్రం అలసట యెరుగని అవిశ్రాంత వీరుడు పంపన ''మిత్రులారా! ఇక సెలవు'' అంటూ వెళ్ళిపోయాడు.

ఇంతకాలం మాతోపాటు ఉద్యోగిస్తూ ఒక సామాన్యుడిగా కాలం గడుపుతూ సాహితీస్ఫోరక మైన చక్కని చెణుకులతో, విసురులతో నిత్యం అందర్నీ అలరిస్తూ వచ్చిన

పంపనవారి జీవిత విశేషాలను, వారి సాహితీ యాత్రను ఆత్మీయులమైన మనమంతా ఒక్కసారి స్మరించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## బాల్యము- విద్యాభ్యాసము:

డా. పంపన సూర్యనారాయణ తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా ''తాళ్ళపాలెం'' లోని ఒకసామాన్య రైతు కుటుంబంలో 1-8-1945న జన్మించారు. ప్రాథమిక విద్యను ''శీలావారి సావరం''లోను ఉన్నత పాఠశాల విద్యను రామచంద్రపురంలోను పూర్తి చేసారు. ''చిన నింద్రకొలను'' లోని మూర్తిరాజు సంస్కృత కళాశాలలో భాషా ప్రవీణ పూర్తిచేసారు. ఎమ్.ఏ. ప్రైవేటుగా చేసారు. పాలకొల్లు పరిసర ప్రాంతమైన ''కాజ''లో తెలుగు పండితుడుగా పనిచేస్తూ సెలవుపై వెళ్ళి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్. చేసారు. పెద్దాపురంలో అధ్యాపకునిగా పనిచేస్తూ 1990లో ''వేదుల సాహిత్యం'' పై పరిశోధన చేసి పి.హెచ్.డి. డిగ్రీ తీసుకున్నారు. ఈ విధంగా వీరి విద్యాభ్యాసం చెక్కుచెదరని ఆత్మవిశ్వాసం వల్ల నిరాటంకంగా సాగిపోయింది.

## ఉద్యోగ జీవితం:

పాలకొల్లు సమీపంలోని కాజలో తెలుగు పండితునిగా పనిచేసే పంపనకు ఆ ఉద్యోగము అంతగా రుచించలేదు. 6,7 తరగతులకు పాఠం చెప్పడంతో కాలక్షేపం అయిపోతుందనే బాధ, భయం ఆయన్ని చుట్టుముట్టాయి.

''వరుస టీచింగు నోట్సులు వ్రాయ కొంత
చూచి వ్రాతలు కాపీలు చూడ కొంత
అడ్డమైనవి దిద్దంగ నట్లు కొంత
బూడిదైపోయె కాలము మొత్తమంత!''

అని వ్యథపడి పెద్దాపురం మహారాణి కళాశాలలో లెక్చరర్ పోస్టుకు అప్లికేషన్ పెట్టి ఇంటర్వ్యూకి వచ్చారు. ఇంటర్వ్యూ చేసేది అతిరథ మహారథులైన ఆచార్య ఎస్వీ. జోగారావుగారు. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగార్లు. ఇంటర్వ్యూ గదిలోకి వెళ్ళి వస్తున్నవాళ్ళు కొంచెం చిన్నబోతూ తెల్ల మొహాలు వేసుకొని ఆయనకు కనిపించారు. ప్రశ్నలు వేసేది మహామహులు. పైగా అడిగే వాడికి చెప్పేవాడు లోకువ.

తరువాత పంపన వంతు వచ్చింది. లోనికి వెళ్ళగానే ''మీదేవూరు?'' అని జోగారావుగారి మొదటి ప్రశ్న. దానికి అందరిలాగానే సమాధానం చెబితే పంపన గొప్పతనం ఏముంది? సమాధానం ఇలా వచ్చింది.

''వాసము పాలకొల్లు, సహవాసము పండిత కోటి తోడ, వి
శ్వాసము విద్య మీద, సరసంబుగ నవ్వుచు మాటలాడుట
భ్యాసము, పుస్తకంబులె మహత్తరమైన ధనంబు, తెల్గు భా
షా సుకవీశ పద్యతతి సార మెరుంగుట తృప్తి పంపనా!''

నిజమే పంపనకు పుస్తకాలే మహత్తర ధనంగా మిగిలి పోయాయి. ఈ విధంగా వారివురూ ప్రశ్నించడం, వీరు పద్యాలలోనే సమాధానం చెప్పడం ఇలా ఆ ఇంటర్వ్యూ రసవత్తరంగా సాగింది. ఆ ఆచార్య వర్యులు ఇరువురూ పరిచయం లేకపోయినా పట్టు బట్టి పంపనను సెలక్ట్ చేసారు. అందుకు శ్రీమాన్ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావుగారి సహృదయత కూడా దోహదం చేసింది. ఈ విధంగా పశ్చిమ గోదావరి నుండి పెద్దాపురానికి అడుగుపెట్టారు. పంపన నాటినుండి నేటివరకు తన పాఠప్రవచన పద్యపఠనాదులతో అటు విద్యార్థులను, ఇటు తోటి అధ్యాపకులనూ అందరినీ అలరిస్తూ వచ్చారు. ''పాఠం చెబితే పంపనే చెప్పాలి; పద్యం చదివితే ఆయనే చదవాలి.'' అనిపించుకొంటూ వచ్చారు.

## సాహిత్య ప్రస్థానం:

పంపనవారి సాహిత్య జీవితం ఎంతో విలువైనది. రాశిలో తక్కువైనా వాసిలో ఎక్కువైన రచనలు వారివి. ఆయన జన్మతః కవి. వ్యక్తిలో పాండిత్య ప్రకర్ష అడుగడుగునా స్ఫురిస్తుంది. కాని కవిత్వంలో అది యెక్కడా వెల్లడి కాదు. చదువుతుంటే వినగానే అర్థమయ్యే రీతిలో పద్యం వ్రాయాలని, అదీ మాట్లాడుతున్నట్లుగా ఉండాలని ఆయన తపన. ఎందుకంటే పద్యమంటే భయపడే రోజుల్లో కూడా సమాస గుంఫనాన్ని పట్టుకొని వ్రేలాడితే అది మూగ చెవిటి వారి ముచ్చట అవుతుందని వారి ఆలోచన. అందుకే వారు వ్రాసిన ప్రతి పద్యం ఇలా నేనుకూడా వ్రాయగల్గితే బాగుండునని ప్రతికవీ అనుకునేలా ఉంటుంది.

పంపన వారి లేఖిని నుండి జాల్వారిన సాహిత్య రసధునులు మొత్తం ఏడు. అవి (1) నిరుద్యోగ శతకము, (2) వస్తాదు రాజు జీవిత చరిత్ర (3) శ్రీ మద్రామాయణ కల్ప వృక్షం-పద్య శిల్పము (ఎమ్. ఫిల్. పరిశోధన) (4) పంపన వారి చాటువులు (5) సర్దార్ పాపన్న (6) విశ్వనాథ వారి భక్తి - దేశభక్తి (7) గౌతమీకోకిల వేదుల సాహిత్య వసంతం (పిహెచ్.డి. పరిశోధన). ఇవి గాక వివిధ పత్రికలకు, సాహిత్యోపన్యాసాలకు, మ్యాగ్జైనులకు వారు వ్రాసిన వ్యాసాలు, కథలు, సమీక్షలు ఎన్నో ఉన్నాయి. అయితే వాటిలో రెండవ గ్రంథం ప్రస్తుతం అందుబాటులో లేదు. తక్కిన వాటిని గురించి స్థాలీపులాక న్యాయంగా పరిశీలిద్దాం.

## నిరుద్యోగ శతకము:

పంపనవారి సాహిత్య ప్రస్థానం ఇంచుమించు నిరుద్యోగ శతకంతో ప్రారంభమైందని చెప్పవచ్చు. 'ఉద్యోగం పురుషలక్షణం అదిపోతే అవలక్షణం' అని నిరుద్యోగ యువత

బెంగటిల్లుతున్న తరుణంలో బ్రతకటానికి ఉద్యోగమే అవసరం లేదని, ఉద్యోగం చెయ్యటమంటే సేవకావృత్తి చేపట్టడమే నని, మనిషి బ్రతకటానికి ఎన్నో మార్గాలున్నాయని యువతకు ధైర్యం చెబుతూ వ్రాసిన పద్యాలు ఇందులో ఉన్నాయి. నిరుద్యోగ యువకులు పడే కష్టాల్ని ఏబది పద్యాలలోను, ఉద్యోగుల కష్టాలను మరొక ఏబది పద్యాలలోనూ కవి వర్ణించారు. మొత్తం 101 పద్యాలు ఇందులో ఉన్నాయి. అన్నీ తేటగీతులే. నిరుద్యోగిని అందరూ చీదరించుకుంటారని చెబుతూ...

''తాళికట్టిన యా లెగతాళిజేయు
తోడబుట్టువునైన నిన్నాడిబోయు
కడకు తల్లి దండ్రులు గూడ కసరుకొంద్రు
బాగుబాగు నిరుద్యోగ రోగ జీవి.''

అంటారు పంపన. పెళ్లైన నిరుద్యోగి భార్యను పోషించలేక ఆమెను పుట్టింటిలోనే ఉంచేయటాన్ని నిరసిస్తూ కవి-

''నన్ను పుట్టింట నుంచుట న్యాయమగునె
కూలి పని జేసి బ్రతుకుట మేలుగాదె
అనిన సతి జూచి నీ వేమి యందువయ్య
బాగుబాగు నిరుద్యోగ రోగ జీవి''- అంటారు.

ఇక సాదా సీదా ఉద్యోగులు, గుమస్తాల జీవితాలు దుక్కేటి ఎద్దులాంటివని చెబుతూ

''నాగలిని లాగగల్గినన్నాళ్ళు నెద్దు
చేత పనిని జేయించియు చివరికైన
కటిక వానికి ద్రోలెడి గతియ నీకు
బాగుబాగు నిరుద్యోగ రోగ జీవి''

అలాగే ఉన్నతోద్యోగులలో స్ట్రిక్టుగా, ముక్కుసూటిగా పోయేవారికి ఎదురు దెబ్బలు, బదిలీలు తప్పవని, ఉద్యోగ జీవితం పూలపాన్పు కాదని, అందుచేత ఉద్యోగం ఉద్యోగం అంటూ కలవరించ వద్దని నిరుద్యోగలకు పంపన హితవు పలికారు.

మొత్తం మీద ఉద్యోగం అని గౌరవంగా పిలవబడే ఈ సేవకావృత్తిని పెట్టుబడిలేని వారు, ఉద్యోగ భిన్నమైన ప్రపంచంలో బ్రతుక లేనివారు, ఊడిగం చేయడానికి అలవాటు పడినవారు, సొంతంగా ఆలోచన లేనివారును, కార్యనిర్వహణమున అసమర్థులును చేయుదురేగాని ఇతరులెవ్వరూ ఉద్యోగం కోసం వెంపర్లాడరని పంపన దృఢంగా విశ్వసించారు. ఇది ఒక విధంగా నిరుద్యోగులకు ఊరటనందించే ఓ చిన్న శతక కుసుమము. దీన్ని కవి శ్రీ శీలం మంగమ్మ,

నారాయణ స్వాములకు అంకిత మిచ్చారు. పంపనవారు కలం పట్టిన తొలినాళ్ళలో వ్రాసిన గ్రంథం కావటంచేత పంపనవారి కవితా పాండిత్యాలు ఇందులో పెద్దగా వెల్లడి కావు.

## శ్రీ మద్రామాయణ కల్పవృక్షము- పద్యశిల్పము:

పంపనవారి ప్రతిరచనా ఒక రసవత్తరమైన రచన. ఒక పద్యం వ్రాసినా, ఒక వ్యాసం వ్రాసినా, కడకు ఒక వాక్యం వ్రాసినా అవి సోపజ్ఞకములేగాని ఎక్కడ నుండీ ఉద్ధృతాలు కావు. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షంలోని పద్యశిల్పం పై వీరు చేసిన ఎమ్. ఫిల్. పరిశోధన కాళిదాసాది కవుల కావ్యాలకు మల్లినాథసూరి వ్యాఖ్యానంలా సాగిపోతుంది. పద్యవిద్యకు దౌర్గత్యం పట్టిన అద్యతన కాలంలో పద్యశిలలను కవితాకృతిలో మలచిన మహాశిల్పి విశ్వనాథ. అందుకే విశ్వనాథను కీర్తిస్తూ ఆయన వ్రాసిన క్రింది పద్యం ఎందరో కవుల, విమర్శకుల, మేధావుల హృదయాలను కొల్లగొట్టింది.

**''తెలుగు సాహిత్య సత్కృషీవలుల యందు**
**వేయి యెకరాల భూస్వామి విశ్వనాథ**
**వారి పొలమున పండని పంట లేదు**
**పండినది యెల్ల పసిడి కాకుండ లేదు.''**

విశ్వనాథను గూర్చి ఇంత కంటె అర్థమయ్యేటట్లుగా, ఇంతకంటే బాగా ఇంకెవరు చెప్పగలరు? ఈ గ్రంథాన్ని పంపన తన మేనమామ శ్రీ సూరంపూడి వెంకన్నగారికి అంకిత మిచ్చారు.

## పంపనవారి చాటువులు:

ఇక పంపనవారి వ్యక్తిత్వాన్ని వారి జీవిత విశేషాల్ని అక్షరమక్షరం తడిమే మరొక రచన పంపనవారి చాటువులు. ఇది ఒక లఘు చాటుకవితా సంపుటి. ఇందులో ఆత్మాభిమానం దెబ్బతిన్నపుడు చెప్పినవీ, చమత్కారచారువులైనవీ. గాలివిసురుగా చెప్పినవీ. హృదయం గాయపడినపపుడు చెప్పినవీ ఇట్లా ఎన్నో ఉన్నాయి. కొన్ని ద్రాక్షగుత్తుల్లా మరీ తియ్యనివీ, కొన్ని పచ్చిమిరపకాయ బజ్జీల్లా కొరికితే చుర్రుమనేవి, కొన్ని గిలిగింతలు పెట్టేవి, కొన్ని కడుపుబ్బ నవ్వించేవి, కొన్ని ఒరలోంచి తీసిన కత్తిలా తళతళ మెరిసేవి ఉన్నాయి. అయితే అన్నిటా ధారాశుద్ధి అక్లిష్టతా కొట్ట వచ్చినట్లు కనబడుతుంది.

పంపనలో అహంలా కనిపించే ఆత్మవిశ్వాసం ఉంది. అయితే తనకంటే విద్వత్తు కలవారిని సవినయంగా సంభావించడంలో అది అడ్డురాదు. నిరంతరం ఆయన శాలువాను ధరించడాన్ని చూసి కొందరు విమర్శించారు. ఇంకొందరు నవ్వుకొన్నారు. మరి కొందరైతే ఎదురుపడి అడగనే అడిగారు. అందుకాయన సమాధానం-

''పండిత శాలువా భుజము పై ధరియించిన నంతమాత్రలో
పండితుడౌనె యన్న యొక ప్రశ్న జనింపక కాదు, నేను బ్ర
హ్మాండము పిండి కొట్టగల నంచు నహమ్మది యుండి కాదు, మ
త్పాండితి వృద్ధి జేసికొను బాధ్యత విస్పుముగా వహించితిన్''

దీనిని గురించి ఎవరేమనుకున్నా జడిసేది లేదని ఆయన నిష్కర్షగా చెప్పారు.

పంపన పెద్దాపురం ఇంటర్వ్యూకి బయలుదేరేముందు ఆయన కూతురు హర్షశ్రీకి ఒంట్లో బాగుండ లేదు. ఇంటికి వెళ్లేటప్పటికి ఆ పాప ఆయనికి దుఃఖాన్ని మిగిల్చి, కడుపు కోతకు గురిచేసి, ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయింది. తరువాత ఏ పసిపాపను చూసినా ఆ రూపము గుండెల్లో ప్రతిబింబించి ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగేవి. ఆ కడుపు కోతను పంపన ఇలా వ్యక్తం చేసారు.

''ఏ పసి పాపయేని కనిపించిన టక్కున చిత్తమందు నీ
రూపమె తోచి దృష్టికవరోధము కల్గి చలించు గుండె నా
దీపము కున్కుచున్నటుల దేహము కంపము నొందు నంతలో
పాపము బద్ధలై బ్రతుకు బండలువారె నటంచు తోచెడిన్''

''నా యనురాగ లోపమని నాటికి నాటికి క్రుంగిపోదునా?
ఆయువు లేక పోయినదటంచు విచారము మ్రింగుకొందునా?
తీయని కడ్పు బాధ నెటు దీసి చరింతును? మాయనట్టి యీ
గాయము మాన్పగా తగిన కాలముకైన ప్రతీక్ష చేసెదన్''

ఈ కడుపుకోత చాలాకాలం వరకు ఆయన్ని బాధిస్తూ వచ్చింది. ఇంకా ఆయన ఈ చాటువులలో శ్రీ పాదవారింట్లో తన వాసాన్ని గూర్చి, తెలుగు పండితుడు పంచే కట్టుకోవాలా? అన్న విషయాన్ని, తాను చదువుకొన్న మూర్తిరాజు కళాశాలను గూర్చి - ఇలా ఎన్నో, ఎన్నెన్నో అంశాల్ని ప్రస్తావించారు. తమ గురువులు శ్రీమాన్ యం. వి. రామానుజాచార్యుల వారికి పంపన ఈ గ్రంథాన్ని అంకితమిచ్చారు.

## సర్దార్ పాపన్న నాటకం:

తెలుగు విశ్వవిద్యాలయంవారు నిర్వహించిన చారిత్రాత్మక నాటక పోటీలలో ప్రథమ బహుమతి పొందిన నాటకం సర్దార్ పాపన్న. నాటకాన్ని వ్రాసి మెప్పించాలంటే చాలా కష్టం. అందునా చారిత్రక నాటకాన్ని వ్రాయడమంటే మరీకష్టం. కాలచక్రాన్ని వెనక్కి త్రిప్పి, పూర్వాపరాలను పరిశీలించి, గత వైభవాన్ని, ఆనాటి ప్రజల మనోభావాలను, పునఃసృష్టి

చేయగల్గాలి. పంపన ఈ విషయంలో నూటికినూరు పాళ్ళూ విజయం సాధించారు. సార్దార్ పాపన్నచే వీరోచితంగా-

''పౌరుషంము తాకటు పెట్టి బ్రతుక లేను
ఉద్యమంబున కర్పింతు నుసురునైన
నా శరీరమందూపిరున్నంత వరకు
కత్తి కదలాడు కదన రంగంబునందు''

అని అనిపించడంలో కవి వ్యక్తిత్వం కూడా కనిపిస్తుంది. నిజమే ఆయన పౌరుషాన్ని ఎప్పుడూ తాకట్టు పెట్టలేదు. ఊపిరి ఉన్నంత వరకు కలాన్ని ఝుళిపిస్తూనే ఉన్నారు. పంపన ఈ నాటకాన్ని పూజ్య మాతాపితలకు అంకితమిచ్చి, వారి ఋణాన్ని ఒకింత తీర్చుకొనే ప్రయత్నం చేశారు.

## విశ్వనాథ భక్తి-దేశభక్తి

విశ్వనాథ యెడల తనకు గల గౌరవాన్ని, భక్తి ప్రపత్తులను వెల్లడి చేసుకోవడానికి పంపన వ్రాసిన గ్రంథమిది. 'మాస్వామి-ఆంధ్ర ప్రశస్తి' గ్రంథముల ఆధారంగా విశ్వనాథ భక్తిని, దేశభక్తిని ఆమూలాగ్రంగా వ్యక్తీకరించిన గ్రంథమిది. టి.టి.డి. వారి ఆర్థిక సహాయంతో పంపన ఈ గ్రంథాన్ని ముద్రించారు. విశ్వనాథ అంటే తనకెందుకంత ఇష్టమో పంపన ఇలా చెబుతారు.

''ఆయన పేరు చెప్పిన హృదంతర మేలకొా పొంగి పోవు, పూ
ర్వేయుల గాథలందభినివేశ బహూష్ణపు రక్తముండుటో
ఏయదియేని జంకక వచించు ప్రవృత్తి రహించువాడ నౌ
టో, అనుబంధ మొండొకటి యుండునె? నాకును విశ్వనాథకున్.''

ఈ గ్రంథాన్ని తమ బాల్యగురువైన శ్రీమాన్ శీలం రామచంద్రరావుగారికి అంకితమిచ్చారు.

## గౌతమీ కోకిల వేదుల సాహిత్య వసంతం:

ఇక పంపన వారి పరిశోధనా నికషోపలం ఈ ''వేదుల సాహిత్య వసంతం''. వేదులా-పంపనా ఇద్దరూ కూడా ఎక్కడో పుట్టి, ఎక్కడో చదివి, ఎక్కడెక్కడో పనిచేసి కడకు పెద్దాపురం వచ్చి స్థిరపడి, ఇక్కడి పౌరులుగా తుది శ్వాస విడిచిన వారె. పిహెచ్.డి. కి పరిశోధనాంశం ఎన్నుకొనే సమయంలో పంపన చక్కటి విజ్ఞతను పాటించారు. అప్పటికే వేదులవారి పై ఒకరిద్దరు పరిశోధన మొదలు పెట్టిచేతులెత్తేయడం జరిగింది. ఇతరులు



గురువు - శిష్యుడు

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు - డా॥ పంపన సూర్యనారాయణ

బెంగుళూరు - పెద్దాపురం, తూర్పుగోదావరి జిల్లా



'శ్రీమద్ భగవద్గీత పాటలు' రచించిన గతకాలపు ప్రముఖ రచయిత్రి

కీ.శే. ఆచంట సత్యవతమ్మగారు

(1897-1949)

రాజమండ్రి



కీ.శే. భళ్ళమూడి రాధాకృష్ణమూర్తిగారు

(1946-2003)

పోలీసు శాఖ, రాజమండ్రి



కీ.శే. లంక అనంత పద్మనాభ శాస్త్రిగారు

(ఎల్.ఎ.పి. శాస్త్రిగారు)

(1941-2003)

విద్యుచ్ఛక్తి శాఖ, నూజివీడు, కృష్ణాజిల్లా

చేయలేని పని తాను చేయాలనే ఆయన జీవలక్షణము కూడా వేదులవారిపై పరిశోధనకు పూనుకొనేలా చేసింది. కవల కవీశ్వరుల్లో ఒకరైన కృష్ణశాస్త్రి పై సిద్ధాంత వ్యాసం రావడం, వేదులపై ఇంకా రాకపోవడం ఆయన మనసును బాధించాయి. అందుకే కృత్యాద్యవస్థను ఇలా వ్యక్తం చేసారు-

''కాపుర మెక్కడున్న గతకాలము వాణి కటాక్ష మబ్బి పె
ద్దాపుర వాసినై సుకవితా పరిశోధన జేయు వేళ వే
రే పయివారి దీసికొననేలని వేదుల నెన్నుకొంటి త
ద్దీప సమూహ ముక్తఝరి దీప్తుల నాంధ్రి నలకరింపగన్''

ఈ విధంగా పరిశోధనను ప్రారంభించి, గౌతమీకోకిల కవితాహృదయాన్ని లోలోతుల పరిశీలించి సాహితీప్రియులకు అందించారు. సిద్ధాంత గ్రంథాలను అటుకెక్కించుకోవాల్సి వచ్చిన నేటి గడ్డురోజుల్లో పఠితను మొదలుపెడితేచాలు, తనలోకి తీసుకొనిపోయేలా, రమణీయమైన శైలితో పంపన ఈ సిద్ధాంత గ్రంథాన్ని తీర్చిదిద్దారు.

## ఆత్మీయత:

పంపన కవి సహృదయుడు. ఇతరుల్లో ఏ విశేష గుణమున్నా మెచ్చుకొన కుండా ఉండేవారు కారు. ప్రక్క రూములో పాఠం చెబుతూ పద్యాన్ని కాస్త అందంగా చదివితే ''ఈ రోజు మీరు పద్యం ఎంతో శ్రావ్యంగా చదివారండీ, అలా అలవాటు చేసుకోండి'' అనేవారు. తెలుగు శాఖను ఎప్పుడూ పద్యాలతో, రసవత్తరమైన సంభాషణలతో అనుక్షణం చైతన్యంతో తొడికిసలాడించేవారు. తనకు నచ్చని పనిని ఎంత పెద్దవాళ్ళు చెప్పినా చేసేవారు కారు. తాను నమ్మిన సిద్ధాంతానికి ఎలాంటి ఆటంకాలు ఎదురైనా, ఎందరెన్ని విమర్శలు చేసినా లెక్కచేసేవారు కారు. అందుకే ఆయన మా అందరి హృదయాలలోను చెక్కుచెదరని స్థానాన్ని సంపాదించుకున్నారు. ఏదైనా అద్భుతం జరిగి పంపనకవి మళ్ళీ పుట్టి మా తెలుగుశాఖలో అడుగుపెడితే బాగుండేదని ప్రతీక్షణం అనిపిస్తూనే ఉంటుంది.

ఒక సామాన్య రైతుబిడ్డ తండ్రికి వ్యవసాయంలో సాయపడుతూ, రెక్కల కష్టంతో చదువుకొని, పిహెచ్.డి. వరకు రావడం, అంతేగాక తెలుగులో గొప్ప పండితుడు కావడం, మంచి అధ్యాపకునికా పేరు గడించడం, మరీ ముఖ్యంగా తన మంచి మనసుతో అందరి హృదయాలను కొల్లగొట్టడం అనేవి సామాన్య విషయాలు కావు. మిత్రునిలోని చైతన్యాన్ని చెప్పడానికి ఈ అక్షరాలు సరిపోవు. నాకున్న భాష చాలదు. నా పాడి మాటల్లో కంటే పంపన గొప్పతనాన్ని మహామహోపాధ్యాయ ఆచార్య యస్వీ. జోగారావు గారి మాటల్లో తెలుసుకుందాం-

''రసికత వచ్చి కావ్యమధురత్వ మెరుంగని దేబెగాళ్ళతో
మసిమసియౌచునున్న కసుమాలపు కాలము దాపురించె నం
చుసురుసురంచు నేడ్వకు మదాప్తుడు పంపనసూరి వంటి స
ద్రసికులు, నన్ను బోలు కవిరాట్లు సజీవులు నమ్ము భారతీ!''

# సత్యవి స్వామి

-దుగ్గిరాల రామారావు

ప్రీణిత శబ్ద వైభవ ధురీణత నొప్పెడి యుష్మదాంధ్ర గీ
ర్వాణ కవిత్వ వాణి యనవద్యము, బుద్ధి విశేషమందు గీ
ర్వాణ గురుండవయ్యు, రసవత్కృతి నిర్మితియందుఁ బూర్వ గీ
ర్వాణ గురుండ వైతివి; సెబాసురా! నండురి సత్యవీశ్వరా! 1

ప్రాచీనమ్ములలోని మేల్తరము లర్వాచీన మార్గమ్ములన్
బ్రాచుర్యమ్ముల నెంచి, ఆంధ్రకవితా ప్రాశస్త్యమున్ మంజు వా
చా చాతుర్య మెలర్ప శిష్యతతు లిచ్చున్ మెచ్చ బోధించు, నీ
యాచార్యత్వము రామకృష్ణ కవిచంద్రా! శ్లాఘ్యమెంతేనియున్. 2

కవితల్ వ్రాసి, విమర్శనల్ సలిపి, వ్యాఖ్యల్ చేసి, శిష్యాళికిన్
వివిధాంశమ్ములు నూరిపోసితివిలే, నీసాటి పాటింపఁగా
నెవరయ్యా! గురువర్గమందరయ, నీవే సాటి నీ కెన్న, వై
ష్ణవ తేజోనిధి! వాఙ్మయత్రయ మహా సాహిత్య పాథోనిధీ 3

వెళపిళవారి శిష్యులఁ బ్రసిద్ధులు పింగళివారు, వారి శి
ష్యులఁ దలమానికమ్మువు మహోదయ! నీకును వారికిన్ బలెన్
వెలసిరి తెల్గునాడున ననేకులు శిష్యులు - ఏకలవ్య శి
ష్యులును, బ్రశంసనీయము లహో! భవదుజ్జ్వల భాగధేయముల్. 4

'తారకా తోరణము' పెద్ద పేరుఁ దెచ్చె
శిష్య సంతతి యశముఁ దెచ్చినది కొంత
ప్రగతి గీతాదికృతులు చెప్పంగవలెనె?
జగమెఱింగిన సత్యవిస్వామి వీవు! 5

హస్తవాసి'కి దొడ్డియంతయుఁ గలయంగఁ
బ్రాకిన ఆనప పాదు సాక్షి
తత విత్తీర్ణతకుఁ జెంతకుఁ బిల్చి యిచ్చిన
కమనీయ తుంబీ ఫలములు సాక్షి
కవితా మహోత్సాహ కలనకు గృహ కవా
టములఁ జెక్కిన యక్షరములు సాక్షి
అంతఃపుర రహస్య మరయఁగల్గునటన్న
ఖ్యాతికి శీర్ణ మేఖలయె సాక్షి
ప్రతి కవిని మెచ్చుకొనుటకు వారివారి
సకల కృతులకు వ్రాయు పీఠికలు సాక్షి
రామకృష్ణమాచార్య! నీ రమ్య సుగుణ
సంతతికి లెక్కలేని సాక్ష్యములు గలవు. 6

శ్రీరస్తు! నీ యశశ్శ్రీఖండ లతకు, నీ
వార్ధక్యమున సుఖప్రాప్తి రస్తు!
అభివృద్ధిరస్తు! నీ ఆరోగ్యమునకు, నీ
యుత్సాహమునకు నభ్యుదయమస్తు!
విజయోస్తు! నీ రమ్య పీఠికాతతికి, నీ
పాండిత్యమునకు సౌభాగ్యమస్తు!
స్వస్త్యస్తు! నీ వచస్సారస్యమునకు, నీ
కవన శారదకు దీర్ఘాయురస్తు!
నీవు పీఠాధిపతివయి నిర్వహించు
పద్యకవితా సదస్సుకు భద్రమస్తు!
సరసకవి! రామకృష్ణమాచార్య! నీదు
ఆట వెలఁదికి నీకుఁ గల్యాణమస్తు!

(డా॥ నందూరి రామకృష్ణమాచార్యులవారి
'అశీతి'కి వ్రాసి వారికి వినిపించిన పద్యములు)

# శ్రీరామ రక్ష

-ముదివర్తి కొండమాచార్యులు

శ్రీకరుడై మహాసుకృతిశేఖరుడై కరుణాలవాలుడై
ప్రాకట కార్యశూరుడయి భాసురవిద్యలు నేర్చ నొజ్జయై
పైకొను సర్వరోగముల బాపగ వెజ్జయి భక్త కోటులన్
చేకొని ప్రోచు మారుతికి జే యనుడీ జయసిద్ధి గాంచుడీ! 1

రాముని ముద్దుటుంగరము రామకు సీతకొసంగి యామె చూ
డామణి స్వామికిచ్చి నిబిడ ప్రణయాత్ములకున్ పరస్పర
క్షేమము దెల్పి దేహముల జీవము నిల్పిన బ్రహ్మచారికిన్
నీమము తోడ మ్రొక్కులిడ నిండుగ కోర్కులు పండకుండునే? 2

మనసొక దారి మాట లొక మార్గము చేతలు వేఱుత్రోవగా
కనిశము రామకీర్తనము హాయిగ నెక్కడ సాగు నక్కడన్
కనుల ప్రమోద బాష్పములు కాఱ శిరోఘటితాబ్జపాణియై
తనరు సమీరసూనుడు సదా మన కిచ్చుత శోభనమ్ములన్. 3

రణరంగమ్మున నింద్రజిత్ప్రహితమౌ బ్రహ్మాస్త్రమున్ దూల పు
చ్చిన దా వజ్ర కఠోర కాయము; జగజ్జేగీయమానంబు త
త్తను సత్త్వంబున కొక్క కాలువగ సంద్రమ్మాయె; సంజీవనా
ద్రిని వేగన్ పెకలించి తెచ్చు భుజశక్తిన్ మెచ్చ శక్యంబొకో! 4

క్షణమయినన్ బలంబు ధృతి శౌర్యము వీర్యము వాగ్విభూతియున్
వినయము పాండితీగరిమ విక్రమముంగల యాంజనేయు నె
మ్మనమున నమ్మి కొల్చు మతిమంతుల కెందును లోటురాదు మా
యనిల కుమార దేవుని దయారస బుద్ధికి దీటులే దెటన్. 5

# సూక్తి ముక్తావళి

- ఏరాసు అయ్యపురెడ్డి



సీ॥ ఎవడైన మొనగాడె ఎగతాళి చేయుచు
ఇతరుల తప్పుల నెత్తిచూప
ఎవడైన వీరుడె ఎదిరించి పోరాడు
ప్రత్యర్థి వర్గంబు పలుకకున్న
ఎవడైన దక్షుడె పవరు చేతిలోనున్న
పప్పు బెల్లాలను పంచిపెట్ట
ఎవడైన దేవుడె ఎట్టి కష్టాలయిన
తమ కర్మ యని నమ్ము దాసులున్న

తే॥ గీ॥ పరుల తప్పుల నిందింప ఫలముసున్న
శరణు వేడిన కాపాడు శౌర్యమున్న
పదవి లేకున్న రాణించు ప్రజ్ఞయున్న
దైన్యమున తోడ్పడువాడె దైవమన్న. 1

సీ॥ ఎవడైన రావచ్చు ఏలిక పదవికి
కులతత్వమున ఓట్లు కొల్లగొట్టి
ఎవడైన మంత్రిగా ఎపుడైన కావచ్చు
పార్టీ లీడరు కాళ్ళు పట్టుకొన్న
ఎవడైన కొనవచ్చు ఇంద్రభోగమ్మును
కాంట్రాక్టు దోచిన కాసులున్న
ఎవడైన బిరుదుకు ఎంపిక కావచ్చు
ఇచ్చు వారితో లంకె హెచ్చియున్న

తే॥గీ॥ నీతివర్తన పాటించు రీతివలన
కష్ట పడి బ్రతుకవలెను కాటి వరకు
దోచుకొను దొంగలకు దక్కు దొరతనంబు
ఎవరు కాదన్న నిజమిదె ఎక్కడైన. 2

సీ॥ ఎవడైన గెలుపొందు ఏకాగ్ర బుద్ధితో
శ్రమజీవన దీక్ష సలుపుచున్న
ఎవడైన పగవారి ఈర్ష్యని ఛేదించు
నీతివర్తన కెపుడు నిలచియున్న
ఎవడైన గట్టెక్కు ఎట్టి ఆపదలైన
సన్మిత్ర సంఘము సహకరింప
ఎవడైన సుఖియించు యిల్లాలి సహచర్య
మాదరణీయమై అమరియున్న

తే॥గీ॥ బ్రతుకు బాటలో కలగన్న బ్రతుకులన్న
కలసివచ్చును ఎవరికో కలిమి బలిమి
కలసిరాకున్న ఇసుమంత కలత వలదు
అంతరాత్మకు లేదెట్టి అపజయమ్ము! 3

'దాన చింతామణి'

## శ్రీ డి.కె. ఆదికేశవులు గారికి

## అభినందన

చిత్తూరు పార్లమెంటు నియోజక వర్గం నుండి తెలుగుదేశం అభ్యర్థిగా పోటీచేసి అఖండ విజయాన్ని సాధించిన 'దాన చింతామణి' శ్రీ డి.కె. ఆదికేశవులు నాయుడుగారిని 'చైతన్య కవితా వేదిక' మరియు 'శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య' హృదయపూర్వకంగా అభినందిస్తున్నాయి. శ్రీ ఆదికేశవులుగారు గత పది పన్నెండు సంవత్సరాలుగా 'చైతన్య కవిత' ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందజేస్తున్న మహానుభావులు. వారికి మా నమశ్శతములు..........

-సంపాదకుడు

# డిలాన్ థామస్

-డా॥ ఎన్. గోపి

నిశ్శబ్దం బద్ధలైనప్పటి నుంచి
నిశ్శబ్దంలోకి నిష్క్రమించేదాకా
ఆ పేరుకు అర్థమే మారిపోయింది.

తీవ్రంగా స్పందిస్తే అది డిలాన్ థామస్
తీవ్రంగా జీవిస్తే అది డిలాన్ థామస్
పుట్టుకకీ చావుకీ మధ్య
గీతను చెరిపేసి
రెండూకాని అతీతస్థాయికి
బారలు చాస్తే అది తప్పకుండా డిలాన్ థామస్.

తనలో పుట్టిన
ఈ మహాసముద్రాన్ని చూసి
స్వాన్ సీ చిన్నబోయింది.
వేలాది సంవత్సరాలుగా
వేల్ష్‌కొండల్లో వెతుకుతున్న గాలులకు
తమలాంటి చలనశీలి దొరికాడు.
రూపానికీ బింబానికీ
నిజానికీ భ్రమకీ
కొత్తర్థాలు చెప్పిన తపస్వి థామస్.

కాలానికే కాదు
మృత్యువుకీ మరోపార్శ్వం ఉంది.
మనిషికే కాదు
మనసుకీ మరోగమ్యం ఉంది.

ఎంత మునిగినా తడి అంటని
చేపబాలుడు డిలాన్ థామస్.

రాత్రేమో ఒంటరిది!
చీకటి ఇంకెంత దూరమో!!
గాలిదెబ్బలు
కొండల రెక్కల్ని విరుస్తున్నవేళ
ఒక్కడే భూగోళమంత ఏకాంతాన్ని ఆలపిస్తున్నాడు.
"Do not go gentle with that good night"
అంటూ
చచ్చిపోతున్న చివరివెలుగుకి వ్యతిరేకంగా
శక్తులన్నీ కూడగట్టుకొని లెమ్మంటున్నాడు
లోకాన్ని
దీవించీ శపించీ
గుండెల్ని చీల్చే కన్నీళ్ళను చిందించీ
ప్రార్థించీ
లోకాన్ని ధిక్కరిస్తూ వెళ్ళిపోయాడు.
మిగిల్చిపోయిన కవిత్వం ముందు
సిగ్గుతో తలొంచుకున్నాయి సముద్రాలు
ఆరిన సిగరెట్ పీకలు
ఖాళీమద్యం సీసాలు
కాలం మ్యూజియంలో ఊపిరి పీలుస్తున్నాయి.

['మరో ఆకాశం' (ఇంగ్లండు కవితలు) అముద్రిత సంపుటి నుంచి ]

# ఆకాశాన్ని జయించే పక్షి

-రామా చంద్రమౌళి

పక్షి ఆకాశాన్ని ఈదుతూనే ఉంది రెక్కలతో అవిశ్రాంతంగా
ఏమికావాలో తెలియదు... ఎక్కడికెళ్ళాలో తెలియదు
ఎగరడం మాత్రం వ్యసనం
ఎగరలేని పక్షి... మరణించిన మనిషి - ఒక్కటేనా ... పగిలిన సీసావలె
లక్ష్యాలు ... లక్ష్యాలు ... అనిర్వచిత లక్ష్యాలు
మస్తిష్కంలో నిద్రిస్తున్న సముద్రం ఆవులించి జ్వలితమైనపుడు
చూపులు ఎగిరే పక్షిని వెంటాడుతూ
ఆత్మ పక్షయి ... పక్షి ఆరోహిస్తున్న ఆత్మయి
నిశ్శబ్దమే మత్తును వర్షించే జోలపాటై
జీవితం ... జ్ఞాపకాలు ... దృశ్యాలు దృశ్యాలుగా తరుముకొస్తూ
కరెంటుతీగపై మంచుకురుస్తున్నట్టు
ఇలా తలంపై చినుకులు గునపాలు గునపాలుగా దిగబడ్తున్నట్టు
రాత్రి గడిపిన సంగీత కచేరీలోని గీతాల వసంత సమూహాలు వెంటాడుతున్నట్టు
తడిచిన రెక్కలను ముడుచుకుని పక్షిపిల్ల గజగజ వణుకుతున్నట్టు
సరిహద్దులను నిర్ధారించే ముళ్ళకంచెలో చంద్రుడు చిక్కి చిరిగిపోతున్నట్టు
ఒంటరిగా పొన్నపూల చెట్లక్రింది నడచిపోతున్నపుడు
వెన్నెల శరీరాన్ని తడిమినట్టు
పుస్తకాలు లైబ్రరీ అరల్లో తపస్సులో మునిగిఉన్న
మునుల్లా సిద్ధాంతాలుగా వినిపించినవే గదా.,
గమ్యాన్ని ఉదయించే సూర్యునంత స్పష్టంగా నిర్ధారించుకోమని
మనస్సును సారించిన ధనుస్సులా సిద్ధపరచుకోమని
గమనాన్ని సుడిగాలై తుఫానులా వ్యూహించుకోమని
ప్రపంచంలోని 'నీ' నుండి మరో ప్రపంచాన్ని ఆవిష్కరించి విస్తరించమని
చిన్న చేపను పెద్దచేప - పెద్ద చేపను తిమింగలం
... జీవన న్యాయంగా బోధింపబడ్డపుడు
చెట్టు తల్లిలా - ఆకులు ఆహారమై, కొమ్మలు అమ్మలై, దేహం గేహమై

తనువును త్యాగం చేసి తరించే సృష్టి పరమార్థాన్ని ప్రవచించినపుడు
సమ్మేళన క్రియైనా, విచ్ఛిన్న క్రియైనా
ఏడ్చినా నవ్వినా కన్నీళ్ళే వస్తాయి వలె - శక్తినే ఉదారించినా
పయనించే ఓ చిలుకా - ఎందుకే ముక్కులో
హృదయాన్ని ఓ చంద్రవంకను చేసుకుని రివ్వున దోచుకుపోతావ్,
కౌన్సిలింగ్‌లు ... కౌన్సిలింగ్‌లు ... ఎ.సి. రూంలలో
వ్యక్తిత్వ నిర్మాణ రహస్యతంత్ర బోధనలు
ఏమిట్రా తంత్రం ... How to make quick money
ముద్రించు ముద్రించు గుండెలపై 'సెవెన్‌స్టార్స్ జలతారు' బొమ్మలను
తరుము తరుము ... తొందరగా తరుము సప్తసముద్రాల అవతలకి
ఆడా, మగా - అందరినీ
మనిషినుండి దేహాన్ని వేరుచేసి, గాజు హృదయాన్ని వేరుచేసి
జీవితాన్ని ఓ మానని పుండుగా మిగిల్చి
శాశ్వత మరణస్పర్శ ధర్మరాజువెంట కుక్కలా నీడై నడచివస్తూంటే
మనుగడీసుకుని స్మృతులు స్మృతులుగా వేకువజామున
ఒళ్ళంతా విస్తరించిన నిజంకాని కల భళ్ళున చెదరిపోయినా
కళ్ళలోనుండి జలపాతంలా కారుతున్న కన్నీరు నిజమేనా ...?

## సుహృద్గీతి

-చిటిప్రోలు కృష్ణమూర్తి

అదియు నిదియు ననక అఖిల ప్రజాహిత
కార్యముల నలంగి కళ నెసంగి
అలరియుండు యుష్మదన్వయం బిది మున్ను
సకల కీర్తి విభవ సాంద్ర మగుచు. 1

పలువురు పురుషశ్రేష్ఠుల
నలువొందవి రహించి తవుర! నరసింహులనన్
మెలపరి భారతకవి నెఱి
గులుకన్ గోడండ్రు నాక కోడండ్రు రనెన్. 2

మేల్మి మంజిమ నిత్యత మెఱయుకతన
నీ సువర్ణ వణిజ్య నీ కించె నేమొ!
కవి సువర్ణ తపస్వియౌ కతన నీకు
నతనిదెసఁ బేర్మి సహజమై యతిశయిలునొ! 3

కసటుంజీఁకటి రూపఱన్ బసిఁడిరేకల్ రువ్వుసప్తాశ్వు తై
జనసారంబుల నొఘలించు రఘువంశంబందు రామాభిధన్
సిసువై స్వామి జనించినట్టి తిథియందే యుర్వి 'గన్విప్పు నీ
కసదౌనే? సకలాన్వవాయ! బుధగేయ స్వచ్ఛతల్ స్వాదుతల్. 4

నీ పుట్టు పండువుననే
నీ పుణ్యపురంధ్రి తరలెనే! స్వర్భువికిన్
ఏ పరమార్థము నెంచెనొ!
ఆ పయివాఁడట్లు పెట్టె నగ్ని పరీక్షన్. 5

కుదురౌ నీ నునుగుండియన్ బసిడి నిగ్గుల్ చిందుచున్ నిల్చె నీ
సుదతీ రత్నము రంగనాయిక, సుధాశుద్ధానురాగంబు పెం
పొదవన్ బిడ్డల దిద్దితీర్చుగుణ సింధూ! నల్లనల్ పెల్చనన్
గదియం జాలకపోయెఁ దెల్లనల పొంకంబొప్పు ని న్నెవ్విధిన్. 6

మును మూఁడేడులనాఁడు నీ తనువు పొల్పుం గంటి, సీతా మనో
జుని యుద్ధర్షము నీ జనుర్దినమహస్సున్ సాధ్వియౌ నీ సధ
ర్మిణి శ్రాద్ధీయము వాసరమ్ము నొక మేమే వచ్చి యెన్నెన్ని జీ
వన చిత్రమ్ములొ లీలగా మెఱసి భావవ్యగ్రతం గూర్చెడిన్. 7

కుందును గందును గలుగని
చందమ్మును రామకృష్ణ సందేశములన్
బొందుచుఁ జిన్మయము సదా
నందము నందుచుఁ దరించు నను పొందితివా! 8

పుట్ట పుట్టువు మునివరు పట్టిగాక
కలుగ రెండును మాఘమేఘ ప్రణేతృ
వల్లభుల కీడయిన కవీశ్వరు లటంచుఁ
దెలిసి పూనితె? ఆవిష్కృతికిఁ గృతాత్మ! 9

నా మిత్రున్ మురిపింపఁ గూర్చితిని గ్రంథం బిద్ది, యిందేదియో
సామీచీన్య సుగంధ మింపొలయు నోజల్ సూచి ప్రజ్ఞామయుల్
రామబ్రహ్మ కవీంద్రముఖ్యులు వెలార్పన్ వెల్గె నీకబ్బముల్
భూమిన్ జూపఱఁదేర్ప దర్శయిత తన్పున్ దృశ్య ముద్దీప్తమై. 10

మాత్సర్యంబను మాటకున్ హృదయసీమన్ సుంతతావీని ని
త్యోత్సాహమ్ము సముచ్ఛ్వసించు నొక శ్రేయోమూర్తి నానొప్పు సం
ధిత్సాప్రాంశువు సుబ్బరాయసుధి మైత్రీసాధిమల్ కూర్చె నీ
సత్సాంగత్య, మనన్యసాధ్యములు తత్సాహిత్య సేవావిధుల్. 11

అష్టదిగ్గజకవులతో నిష్టగోష్ఠి
నలరు శ్రీకృష్ణదేవరాయల శుభాఖ్యఁ
దగు రసజ్ఞ సమాఖ్య సంస్తవ్య కాదె
రస సమృద్ధ వసంత పర్వ ప్రసిద్ధ. 12

ఇది గాంధీ సాహిత్యా
స్పద రుచిర వితర్ది భద్రపద భావ రసా
స్పద మాఘమేఘ కృతియుగ
మదిరా! రుచి చిందె నిటఁ ద్వదావిష్కృతమై. 13

ఆనందప్రదమయ్యె నయ్యవచి తిప్పయ్యన్ విడంబించు నీ
జ్ఞానామూన కళాసమర్చన విధా సాహిత్య మత్యంతమున్
గానీ నాయెఱ పప్రధృష్యమని పల్కన్ గాద శ్రీనాథుఁడన్
గానే కానని విన్నవింతు బుధలోకం బింత మన్నించినన్. 14

అనుపమ మద్భుతమ్ము భవదాదృతి లెస్స పరీమళించు నె
మ్మనమున మళ్ళి వత్తు మతిమన్మణి! నీదు సహస్ర చంద్ర ద
ర్శన మహితోత్సవైక వికసన్ముఖమండల వీక్షణ త్వరన్
జనవున నాగమించు కవిచంద్రులతో నమ్రుతమ్ముఁ జిల్కఁగన్. 15

ఈ నూత్న వర్షమున న
మ్లాన శ్వశ్రేయసము లలర్చుత మిమ్ముమ్
మీ నేస్తుల నఖిలకళా
శ్రీనిధులన్ స్వామికృప నృసింహులు శ్రేష్ఠీ! 16

(*28-3-2004* నాడు బెంగుళూరులో 'శ్రీరస' జరిపిన 'మాఘ-మేఘములు' కావ్యావిష్కరణ సభలో చదివిన పద్యాలు)

## వెన్నెల నవ్వు

-అంబికా అనంత్

'కవిత్వం ఒక మెస్మరిజం
కవి కన్ను ఒక ప్రిజం'
మా శ్రీరసాధ్యక్షులు
దీనికి ప్రత్యక్ష ప్రమాణం!
కవిత్వం అనే ఆల్కెమీ
కాళిదాసుకు, కృష్ణశాస్త్రికే కాదు
ఆయనకూ పూర్తిగా తెలుసు.
తెలిసినది మాతో పంచుకునే ఔదార్యం
మా ఆత్మస్పందనలకు, అక్షరావేశానికి
దారి చూపే మార్గదర్శకత్వం
కవిత్వాన్ని నాలుగు దిక్కులకూ పంచాలనే
'చైతన్య కవితా' వ్రతం
మంచి కవితను వింటూ

ఉబ్బితబ్బిబయిపోయే బంగారు పసితనం
ఆర్ద్రమైన పదాలు వింటూ
కన్నీరు వర్షించే శీతమయూఖం
అనర్గళ సాహితీ ప్రసంగ ఆనందారావం
నిస్తులప్రతిభను వెన్నెలనవ్వులో దాచుకున్న నిండువిగ్రహం
తంగిరాల సుబ్బారావుగారి కిదే
మా అభినందన కవితాకుసుమం!

*(ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారి 69వ జన్మదిన సందర్భంగా 7-4-2004 నాడు జరిగిన సన్మాన సభలో చదివిన కవిత)*

# పునర్భవం

– అడిగోపుల వెంకటరత్నమ్

అడవి దగ్ధమైంది
మంటలు మేఘాల్ని
అంటుకున్నాయి
ఒక విద్రోహ వ్యూహరచనకు
వినాశకర ఫలితం!
కోకిళ్ళ గానాలు
నెమళ్ళ అందచందాలు
కుందేళ్ళ కుదికిళ్ళు
కోతుల కోతికొమ్మంచులు
కానరాని ప్రకృతి పులకింతలు!
గర్జనలు గాండ్రింపులు
ఝీంకారాలు
నిశ్శబ్దం వొడిలో గాఢనిద్రలు!
కాల్చిన ప్రకృతి సంపద
పెను పైశాచిక విధ్వంసం!

మండిన ఆకాశం మళ్ళీ నీలం
కాలిన మేఘాలు కాన్పుకు సిద్ధం!
బుగ్గైన అడవిలో
గజ్జెకట్టిన సెలయేరు
వీచే మలయమారుతంలో
పక్షుల విన్యాసాలు
జంతువుల ఆరావ విరావాలు
ధ్వనులు ప్రతిధ్వనులు
మనుషుల అలికిడి
మళ్ళీ మహారణ్యం
పచ్చ పచ్చగా
చిలక పచ్చగా
ప్రకృతి పరచిన
తివాసీగా – .....

# ప్రకాశం పంతులుగారికి ప్రేమాంజలి

-సుశర్మ

బాల్యంబంతయు ధైర్య సాహసము లాస్వాదించి, స్వాతంత్ర్యమన్
కల్యాణంబును చూపినావుగద - ఆంగ్ల ప్రాభవంబీగగా;
మూల్యంబేమిడువారమయ్య త్రిజగత్ పూజ్యా! త్వదీయాచ్చ సౌ
శీల్యంబుల్ భరతావనిన్ నిలుపు వాసింగూర్చు సత్కీర్తితో. 1

గాంధీజీకి అనుంగు శిష్యుడవు - త్యాగంబే ధనంబంచు - సం
బంధుల్ కాదన ఆస్తినంతటిని - ఈ స్వాతంత్ర్య పోరాట - సం
బంధంబైన - మహాశయంబునకు - సంప్రాప్తింపగాజేయు నీ
గంధంబైన చరిత్ర తెల్పుటకు నే గర్వించెదన్ ధీవరా! 2

సత్యాగ్రహమ్ములో - సరిసాటి లేనట్టి
దేశభక్తుడవౌచు ... తిరిగినావు
క్విట్టిండియాయంచు - కట్టడితో పల్కి
ఆంగ్లేయులదరగా అరచినావు
ఉప్పు సత్యాగ్రహమ్మొనరంగ జేయుచు
గాంధీకి నీ చేయి కలిపినావు
ఖద్దరు వస్త్రమే కాని నీ తనువుపై
వేరొక్క పటమును వేయలేవు
ఎంత తీవ్రమ్మొ నీదైన స్వాంతమోయి
ఎంత సత్యమ్మొ నీదైన చింతనమ్మొ
ఎంత త్యాగమ్మొ నీదైన హితపథమ్మొ
ఆంధ్రకేసరి గొనుమ ప్రేమాంజలులను! 3

వచన గీతాల తాత్త్విక కావ్యం:

# శ్రీగీతా

కీ.శే. డా॥ మిరియాల రామకృష్ణ

(గత సంచిక తరువాయి)

మల్లెలు తురిమిన జడ
అల్లుకుని జపం చేసిందామె.
ఆ రాత్రి నిద్రపట్టలేదు.
అందుకు కారణం ఏమిటి?

పరిశోధన చేస్తున్నాతను
పదే పదే పుస్తకాలు
చోట్లు మారుతున్నాయి.
చోద్యంగా లేదతనికి.

కావ్యమంతా ఒకేరాత్రి
కంగారుగా రాశాడు.
నాలుగు రోజులు దాకా
మూలుగుతూనే ఉన్నాడు.

రెండు పేజీలు రాశాకా
రెండు నిమిషాలు
నడిచి మళ్ళీ వచ్చాను.
నవ్యత తరుముకొచ్చింది.

అమ్మవారి ఆలయంలో
ఆయన మాత్రం చదువుతాడు.
సంస్కృతం వచ్చినవాణ్ణి నేను.
సేసేమీరా అర్థం కాదు.

వ్రేలికి గోరెందుకుంది?
వ్రేలిని కాపాడేందుకా?
రంగులను గోకి,
రమ్యతను తీసేయడానికా?

కిరణాలు వస్తున్నాయని
క్రీగంట కనిపెట్టాడు;
ఇంకా పట్టుదలగా
ఇచ్చాడు నిద్రకు సంకేతం.

శరీరమే తాను అనుకున్న
శాస్త్రిగారిని చూశాను.
రోజు కారు సారులు
రుచులకోసం తింటున్నాడు.

ముక్తసంగుడని ఓ సమాసం
మోక్షంకోరేవారి కుపరిచితం.
నేను మోక్షం కోరడం లేదు
నిత్యయజ్ఞం తలపెడుతున్నా.

నా కొక కామధేనువుంది
ఆకలినీ కోరికనీ
దేన్నయినా దాన్నడిగి
తీర్చుకుంటూ సుఖిస్తాను.

అక్షరాలన్నీ నా దేవతలే
చక్షువుల ముందు
కనిపిస్తూ ఉంటారు.
కలలో కాదు; కవిత్వంలోనే.

మబ్బులిచ్చిన వానను
మళ్ళీ సముద్రం, చూశారా
కావాలన్నా, వద్దన్నా
ఆవిరై మబ్బులకిచ్చేస్తుంది.

దొంగతనం చేయడం
దోషమంటుంది శాస్త్రం
తనకు కావలసిందడిగి తీసుకు
దాచేసుకోవడాన్నేమనాలో?

మిగిలిన అన్నమెంతైనా
మింగుతుందామె తానే.
ఆకలి లేకున్నా తినడం
అతిపాపం అని ఆమెకు తెలియదు.

మనం తింటున్న ఈ భోజనం
మబ్బులనుంచి వచ్చిందని
గుర్తు చేసుకోడానికైనా కిటికీ వద్ద
కూర్చుకోవాలి మన డైనింగ్ టేబుల్.

ఏ పనులూ చేయకుండా
ఎక్కడో అక్కడ కూచోండి.
తేదీలు మారవు; మబ్బులైనా
తిరిగి మీ దేశాన్ని తొంగి చూడవు –



''అన్నాత్ భవంతి భూతాని
పర్జన్యాత్ అన్న సంభవం
యజ్ఞాత్ భవతి పర్జన్యో
యజ్ఞః కర్మ సముద్భవః''

'నాలుగిళ్ళు కట్టాడు నాన్న
నాకెందుకు శ్రమ' అన్నాడతను
కూలిపోయిన మేడలు
కూడు పెట్టలేదు మనమలకు.

అతడు ఆత్మరతుడూ
ఆత్మతృప్తుడూ కనుక
ఏ పనిని నెత్తిన వేసుకోకున్నా
ఏ దోషమూ అతనికి లేదు.

పూర్వదశా ఉత్తరదశా
పూర్వకాలం నుంచీ ఉన్నాయి.
'ఆత్మతృప్తి' దాకా
అడుగేయందే పైకి రాలేము.

'లోక సంగ్రహం' కోసం
పాకులాడే వారుంటారు.
కౌపీనం చాలు వారికి
కార్యార్థులై పరుగెడతారు.

నేలను లోతుగా తవ్వితే
నీరు ఉబుకుతుంది.
తవ్వేవారు కూలికోసం
తవ్వుతారా? తృప్తికోసమా?

నాలుగు వ్రేళ్ళూ నోట్లో
నానేవారు కూడా చేయవచ్చు;
మంచిపనులేవైనా ఒళ్ళొంచి
మనకెందుకనుకుంటే ఎలా?

ఈ ప్రపంచం నీకు వద్దన్నావు
ఈ ప్రపంచానికి నువ్వు కావాలి
ఓ ఆత్మజ్ఞానీ నీకు కూడా
ఉంది కదా ఒక అవయవ శిల్పం.

ఇంటిని కాపాడేందుకు
ఏదో ఒక శునకం చాలు.
నాలుగు కాళ్ళున్న దాని పని
నరుడెందుకు నెత్తినేసుకోడం?

''శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః''

మతం వేరని కులం వేరని
మనుషులెందుకు చంపుకుంటారు?
ఆ మాత్రం తెలియదా
అది కామక్రోధాల ఫలితం.

''కామ ఏష క్రోధ ఏషః
రజోగుణ సముద్భవంః
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణం''

స్త్రీ హింసా శిశుహింసా
చేసే వాళ్ళ కసలుంటుందా
శేముషి అనే పదార్థం?
చెప్పకింక దాని పర్యాయం 'కామం'.

స్త్రీలకూ శిశువులకూ
చెడును తలపెట్టేవాళ్ళు
నీటి రూపంలో ఉన్నా
నిప్పు బొమ్మలే వాళ్ళు

అందరిలోనూ ఉంది జ్ఞానం
కొందరిలో మాత్రం
కామక్రోధాల కింద ఆ వెలుగు
కనబడకుండా ఉండిపోయింది.

విశ్లేషించుకుంటున్నాడు
విజ్ఞాని తన వ్యవస్థని
కోట్లకొద్దీ ఇంద్రియాలూ
కొన్ని మనస్సులూ ఒక బుద్ధీ.. గా

''ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిః
యో బుద్ధేః పరతస్తు సః''

# నాలుగు

అన్నీ పుస్తకాల్లోనే
ఉన్నాయనుకున్నాను.
సరిపోతుందా జీవితం
సమస్తం చదివేందుకు? 1

ఒకరు బోధిస్తే వినడం
ఊహకు పెన్నిధానం.
ఉండటం ఒక గురువుగారు
ఒక కోటిరెట్లు లాభం. 2

ఎందుకు కొందరే
ఇట్టే మేధావులవుతున్నారు?
సహకరిస్తున్నాయా వారి
సద్బుద్ధికి పూర్వజన్మలు? 3

ఎంత సూత్రబద్ధం
ఈ ప్రకృతి నడకంతా.
దీన్ని సృష్టించిన
దివ్యుడెవడైనా ఉన్నాడా? 4

ముదిమి వచ్చి వీణ్ణి
ముడిచి వేస్తూ ఉంది.
వీడు చూడు దివ్యుణ్ణి ని
విశ్రవీగుతున్నాడింకా. 5

ఇంద్రజాలమైతే
ఎరిగిన విద్యే
కొందరికైనా
ఎందరెరుగుదురు సృష్టిమాయ? 6

అజుడని, భూతపతి అని,
అవ్యయుడని మనమంటున్నది
నామంలేని రూపంలేని
నానార్థశక్తి అవునా కాదా? 7

సృష్టికే నియమాలున్నప్పుడు
ఇష్టమొచ్చినట్లుగా
మనిషి నడుస్తానంటే
ఉనికికి ప్రమాదం లేదంటావా? 8

'ధర్మగ్లాని' అని
ధాష్టీకాల్ని
ఒక్కమాటతో
నొక్కి చెప్పడం బావుంది. 9

ఈ రోజున వచ్చిందా
ఈ 'ధర్మగ్లాని'?
మనిషి దుశ్శాసనుడైతే
మళ్ళీ మళ్ళీ వస్తున్నదే. 10

దుశ్శాసనాలూ
దుర్యుద్ధాలూ
ఉన్నప్పుడల్లా
ఉంటారు యుధిష్ఠిరులు. 11

ఎంత యుధిష్ఠిరుడికైనా
ఇదిగో నేనున్నాని
ఊతమిచ్చి నడిపే
ఊహాశాలి ఉండాలేమో. 12

ఊహబలం ఉన్నవాడికి
వ్యూహం పన్నడం సులువు -
ఆ శక్తి ఉన్నవాడేనేమో
అవతార పురుషుడంటే 13

అధర్మానికి కూడా
అభ్యుత్థానం కల్గితే
గోవింద గోవిందా
కోరుకుంటాం నిన్నే మరి. 14

అవును ధర్మానికీ
అధర్మానికి సుతరామూ
పడదు కనకనే
పడుతున్నాం ఇన్ని పాట్లు. 15

కాలంలో ఈదాలంటే
కష్టాలు తప్పవు
కానీ అకాలంలో
కాలం చేయడమే కష్టం. 16

హత్యలు చేసే వాళ్ల నుంచి
నిత్యం మనల్ని
మనం కాపాడు కోవడం
మరణాన్ని జయించడమే కదా 17

మనం సాధువులమా?
మరి, అసాధువులమా?
ప్రాథమికంగా వేసుకోవాల్సిన
ప్రశ్న కదా మనకెప్పుడూ. 18

సాధువులమే అయితే
శత్రువులు మనకున్నారు
ఉన్నారేమిటి? జగత్తులో
ఉండకుండా ఉండరు. 19

యుగయుగాల్లోనూ
యుద్ధం జరుగుతోంది
దుష్కృత వినాశం కోసం
దోర్బలంతో కాక పోవచ్చు. 20

వాగ్యుద్ధాలయినా
వట్టి పోయాయంటే,
వార్తలు కూడా ఉండవు.
స్ఫూర్తి రాదు వార్త లేందే. 21

నీతి, ధర్మం, న్యాయం
నేడూ నాడూ ఒకటేనా?
సందర్భాలనూ బట్టి
సర్వం మారుతుంటుంది. 22

ఎందుకు చెప్పావు గీతా
ఇంకో జన్మ గురించి?
ఒక్క జన్మ చాలదా
ఓంకారం తెలిస్తే. 23

పది సార్లు ఓడితే
పదకొండోసారి
గెలవక పోతానా?
గెలిచాకా ఆడను. 24

ఈ జన్మ ఫలిస్తే
ఇంకో జన్మ వద్దు
పుట్టుగుడ్డినైతే
పుడతాను మరోసారి. 25



''జన్మ కర్మ చ మే దివ్యం
ఏవం యోవేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి మామేతి సోఽర్జున.'' 26

వీతరాగ భయ క్రోధులు
వేరెవరైనా ఉన్నారా?
ఉన్నారులే కొద్దిమంది
విన్నాం వారిని జ్ఞానులని. 27

ఎగరని కెరటం
ఏం చేయగలదు?
తలవంచుకు నీరై
కలియాల్సిందే సముద్రంలో 28

కర్మ చేసే వాణ్ణి
కార్మికుడనవచ్చు
ఏం కర్మమో కానీ
ఇంకో అర్థం కర్మకు. 29

కర్మ అంటే గీతా! ఆ
మర్మం నువ్వే చెప్పాలి.
ఒక సత్కృతిని కర్మ అని
ఓహో బాగా చెప్పావు. 30

విధులు, బాధ్యతలు
వివేకంతో చేస్తే
అవి కర్మలు కావా?
ఆధునికులేమంటారో? 31

ఎరుకలేక, యత్నం లేక
ఏదేదో చేస్తే
మూర్ఖాచారమే
మునుపైనా నేడైనా 32

పద్ధతి ఉంటుంది
ప్రతి కార్యానికీ
సంస్కృతి లేని కార్యం
సరదాయే కదా. 33

సరదా పనుల
సందర్భాలు వేరు
సంస్కారంతో కూడిందే
సదాచార మవుతుంది. 34

అతడు చేసే పనులు
అతని గుణాలకు
ప్రతి బింబాలని
పాపం అతనికి తెలియదు. 35



చాతుర్వర్ణ్య మనేది
చక్కని విభజనే
అయినా చర్చనీయ మై
సమస్య అయింది. 36

నానా వర్ణాలున్నాయి.
నాలుగు రంగులే
ఏమిటి? లోకంలో
స్వామీ! ఇది పొరపాటు. 37

(సశేషం)

# శ్రీమద్ భగవద్గీత పాటలు

(34 &35 సంచిక తరువాయి)

-కీ.శే. ఆచంట సత్యవతమ్మగారు
(క్రీ.శ. 1897-1949)

వరుస : గరిమెళ్ళవారి ''మా కొద్దీ తెల్ల దొరతనమూ'' పాటవలె

పల్లవి : భగవద్గీతామృతారసము - మనము
మనసార గ్రోలినా ఘనముక్తి నొందెదము ॥ భగవద్గీతా॥

13. పార్థుడంతయు విని।
పరమాత్మకును మ్రొక్కి ।
పరమ ధర్మము లెరిగి నేను ।
పరమ పూజ్యులనెటు త్రుంతునయ్య ।
బంధు మోహంబునెటు విడుతునయ్య ।
ముందు జయ మెవ్వరిదొ తెలియగలమా ।
అందరిని జంపి ఆ రాజ్యంబు నాకేల? ॥భగ॥

14. అర్జునుని మోహంబు అధికంబగుట గని।
ఆత్మజ్ఞానము తెలియ చెప్పె।
ఆది భూతాది దైవముల తెల్పె।
అధిక జ్ఞానికి కర్మ తప్పదుగా।
జన్మనొంద కర్మను వీడలేడు।
జ్ఞాని చేయు కర్మ సర్వాత్మకర్పించు ॥భగ॥

15. జ్ఞాన విజ్ఞాన మెరిగి।
జన్మక్షయములు తెలిసి।
కర్మసన్యాసివై మనుము।
ధర్మరక్షణకై రణము చేయు।
నిర్మలాత్మ యోగ బుద్ధి జనుమ।
జీవభ్రాంతి విడచి దేవుని జూడుమ ॥భగ॥

16. చేయువాడు, చెప్పి చేయించువాడెవడు।
చెరచు కర్తయు నెవడు గనిన।
అయినదంతా నా మాయయని తెలియు।
అంతరాత్మ స్వరూపుండ నగుచు।
బ్రహ్మాండమంతయు నిండి।
అణురూపమున నుండు ॥భగ॥

17. జ్ఞానయోగం బనగ।
విజ్ఞానయోగ మన।
తన్ను తా తెలియుటె పార్థ।
జీవ పరమాత్మ లేకమే ఎరుక।
ఎరుక నెరిగితి అహమదములణగు।
అహ మణిగితె కర్మవెరపణుగు।
వెరపు వీడితె ధర్మంబు తెరవు కనుగొందువు ॥భగ॥

18. సూర్యచంద్రులు నేను।
సురలందు ఇంద్రుడను।
వరుణాగ్ని ఆర్యముడ నేను।
పరలోకంబులో విష్ణు నేను।
పరబ్రహ్మంబు బ్రహ్మండ మేను।
సర్వ మహిమలలో మహిమ నేను।
సర్వ జగన్నాటక సూత్రధారినై ఆడింతు । ।భగ॥

19. నన్ను కొలిచెడు వారు నాల్గు విధంబులు।
నామాయనే తెలియలేరు।
త్రిగుణాతీతుండ, రూపరహితుండ।
జగతి మిన్నగ నన్నెంచువారి
కున్న ఆపదలన్నియు బాసి।
పన్నగ శయనుని పదవి గల్గింతును ॥భగ॥

20. క్షరము నక్షరమెరుగ।
అక్షరమె బ్రహ్మంబగును।

స్థిరమౌనదే బ్రహ్మ యంద్రు।
అస్థిరంబగు దేహంబు క్షరము।
అక్షరరూప మధ్యాత్మమంద్రు।
బ్రహ్మ మాయచే పుట్టును జగతి।
జగతి పుట్టుకతో కర్మపుట్టి జన్మొందించు ॥భగ॥

21. జన్మవీడగ జేయ।
కర్మనాకర్పింప।
జనక శుక శౌనక మునులు।
మున్ను కర్మ ఫలత్యాగులై మనిరి।
జ్ఞాన భక్తిగ సనకాది మునులు।
మనమునందే నన్నెరిగి కనినారు।
నాలోన లీనమై నారూప మందిరి ॥భగ॥

22. పార్థా! శంక వీడలేదా?
వ్యర్థముగాబోదు నాబోధ వినుము।
బ్రహ్మ విద్యారహస్యంబు గనుము।
విమల భక్తిగ తత్వంబుగనిన।
పరమ పురుషుని లక్షణ మెరుగు।
జ్ఞాని శ్రేష్ఠత్వమెరిగితె మేలు।
అంత నిష్కాములై కర్మ నిష్కాముగజేతువు ॥భగ॥

23. సుగుణ స్వరూపుని సరగసేవ చేయ।
సత్కార్మ తప్పదు పార్థ!
సగుణరూప ధ్యానమై భక్తి నిచ్చు।
భక్తి కల్గిన విజ్ఞాన మబ్బు।
దాన నిర్గుణ ధ్యానమె కల్గు।
నిర్గుణంబున మోహావృత్తులు నశించు ॥భగ॥

24. కృష్ణుని బోధంత కుంతీ సుతుడు విని।
విష్ణు మాయ నెరుగదలచి।
సకల ధర్మంబు లెరిగించినావు।

స్పృష్టి మిథ్యాభూతంబంచు తెల్పి।
వ్యష్టి సమష్టిలో స్పృష్టి యంచు।
తుదకు హింసకల్గు కర్మకుత్సహించుట మేలు ॥భగ॥

25. అయ్యో మొదటికి వచ్చితివేమి పార్థ
బ్రహ్మవిద్యాబోధ వ్యర్థమాయెనా।
కర్మచేయంగ నీవెవరవయ్యా।
అంతనాదేయని బోధించలేదా?।
సుంత కర్మ నీకంటదు లెమ్మా।
మదిని నన్నే ధ్యానించి నావిభూతిని వినుమ ॥భగ॥

26. దేవ మానవ కోటి దివ్యాఋషులై నాను।
నా పుట్టుక తెలియలేరు।
ఆది మధ్యాంతములు లేవు నాకు।
నామ గుణ రూపములు లేవు నాకు।
భూతస్పృష్టికి మూలకారణుడ।
స్పృష్టి స్థితి లయములు చేయు కాలస్వరూపుడను ॥భగ॥

27. సామవేదము నేను, సర్వేశ్వరుడ నేను।
సకలజ్ఞానమేను పార్థ!
మరియు ఋతువులందు వసంతమును।
మాసముల మార్గశిరంబు నగుదు।
సర్వయజ్ఞంబులన్ భోక్త నేను।
శబ్దజాలాన నోంకార శబ్దంబు నేనాదు ॥భగ॥

28. భృగుమహర్షిని నేను, బృహస్పతిని నేను।
భూమిలోన శ్రద్ధ నేను।
అచలమందాది హిమవంత మేను।
ఇంద్రు వజ్రంబ ఐరావతంబ।
అగ్నిదేవుండ జఠరాగ్ని నేను।
సర్వచిత్తంబు, బుద్ధిగనాదు।

అంతరాత్మజ్యోతి వెలగ-
జేయు దేవుడ నవుదు ॥భగ॥

29. దైత్య ప్రహ్లాదుండ ధర్మదేవత నవుదు।
ధైర్య, శౌర్య, వీర్య, ధర్మంబు లేనవుదు।
ధనంజయా నారదుండ।
వైనతేయా చిత్రగుప్తు లవుదు।
ఇటులె నాశ రహితంబైన సకలంబు నేనవుదు ॥భగ॥

30. విభూతి నెరిగించి॥ విశ్వరూపము చూపి।
విజయుని సందియముబాప।
బాహ్యచక్షుల కలవి కాదనుచు।
దివ్య యోగజ్ఞాన దృష్టి నిచ్చె।
అంతర్లక్ష్యంబుగా జూడమనెను।
అంతర్య దృష్టి గన బాహ్య మోహము బాయు ॥భగ॥

31. విశ్వరూపమునందు, వెనుక ముందులు లేవు।
ఆది అంతములందు లేవు।
అందు దేవ, మానవ, దానవులు।
సోమ, సూర్యాగ్ని, నక్షత్రభూమి।
భూరి పర్వత, నదులు, వృక్షములు।
జంతు జాలంబు, పక్షి క్రిమి జాలంబు లందుండె ॥భగ॥

32. స్వర్గ, నరకంబులు, సౌఖ్య, కష్టంబులు।
సౌమ్య రౌద్రమూర్తులుండె।
మృత్యుకరాళ దంష్ట్రములు కలవు।
మృత్యుముఖమందె దుర్యోధనాదులు।
నలిగి పిప్పిగ నమల బడుచుండిరి।
తిరిగి పుట్టి మరణించుచు నుండిరి।
గతము నొందిన యుగ జనులు పుట్టి చచ్చుచుండ్రి ॥భగ॥

33. భయంకరంబగు భగవంతు విశ్వరూపు।
పార్థుండు గనలేక వసుధకెరగి సాష్టాంగ మొనరించి।

గడగడ వణకి కరములను మోడ్చి।
కృష్ణ కృష్ణా! మొదటి రూపు జూపు।
మోహముడిగె ధన్యుడనైతి దేవా।
అని వేడ నాశక్తి ఆదిరూపున నుండె ॥భగ॥

34. విశ్వరూపునిచేత వైరిజనులు ముందు।
మరణింప జూచి కిరీటి।
వైరి సంహారమున లేరు కర్త।
తాను నిమిత్త మాత్రమును గాని।
అంత సర్వేశ్వరుని మాయయంచు।
కార్య కర్తృత్వ భావంబు కడకువీడె కిరీటి ॥భగ॥

35. యుక్తిగ కృష్ణుండు, భక్తి కలుగజేసి।
ముఖ్య శిష్యుండు మరదికెంతో జ్ఞానధారణశక్తి కల్గించి।
విజయు నహంకార, మమకార ముడిపి।
దేహ మానాభిమానంబు లుడిపి।
క్షేత్ర క్షేత్రావిభాగంబుతెల్పి।
జీవపరమాత్మ భేదంబు బాపి।
కార్యకర్తృత్వ భారంబు దైవంబు దనిపించె ॥భగ॥

36. ప్రకృతి మాయ నాదె।
పరమ పురుషుడ నేనె।
బ్రహ్మాది సృష్టులు నాది।
మాయలీలానటన సూత్రధారిని।
త్రిగుణాతీతుండ, విషయ రహితుండ।
శాంత, శమ, దమాది సాత్వీక గుణుడ।
సాత్వికాహార భక్షకుండను।
పంచకోశాదేహాత్ముండ।
వర కృష్ణనాముడను ॥భగ॥

37. శీతోష్ణములందు, సుఖ దుఃఖములందు।
సంగవర్జితమందు వినుమ।

పరగ నిందాస్తుతులందును గనుము।
కలిమి లేమి, ముదిమి, చావులందు।
సమముగా నెంచి వర్తించు నరుడే సంయమి యౌను ॥భగ॥

38. ఇంద్రియ వాంఛతో ఇతర దైవములాను।
క్షుద్రదేవతలాను కొల్చు
చుండు వారికి తగినట్టి వరము
లిచ్చి బ్రోచువాడ నేను।
ఫల్గుణా నన్ననుసరించ నాలోన లీనమౌ ॥భగ॥

39. సంసార వృక్షంబు సరగ మూలముపైకి।
కొమ్మలన్నియు క్రింది కుండు।
దేవావృక్షంబె అశ్వత్థమంద్రు।
దాని ఆకులె విషయేంద్రియములు।
దేహ, మింద్రియ మాత్మయు, జగతి।
ప్రాణికాధార మన్నోదకములు।
జఠర దీప్తియె చతుర్విధాన్న పచనకారి ॥భగ॥

40. దీనినెరిగినవాడు తిరిగి పుట్టడెందు।
పురుషోత్తముని బొందియుండు।
మృత్యు భయవర్జింతుండగునువినుము।
వృక్ష తత్వమెరుగుటె ఎరుక యంద్రు।
అసురగుణమె భ్రాంతి నిచ్చి, అమరత్వమును బాపు ॥భగ॥

41. జన్మ నొందిన వాడు శ్రద్ధాభక్తులతోను।
ఫలత్యాగియై కర్మజేసి।
విషయవాంఛలు విడనాడి పార్థ!
భక్తి జ్ఞాన వైరాగ్యములుపొంది।
మనఃస్సన్యాసిగా మనుచు।
తుదకు దివ్యజ్యోతి పరమాత్మను చేరి।
మోక్ష సన్యాసియై ముక్తిగాంచు।
నీవు నేనను భ్రాంతి లేనట్టి యోగమిది (సంపూర్ణం) ॥భగ॥

# డా॥ పొన్నా లీలావతి కవితలు

(34 & 35 సంచిక తరువాయి)

## 3 సముద్రం

సముద్రాన్ని గూర్చి ఎంత విన్నా ఏమి తెలుస్తుంది?
చూస్తేనే గోచరిస్తుంది దాని గాంభీర్యం
రెప్ప పాటెరుగని సుదీర్ఘ ఆలోచన సముద్రం
అది భగవంతుని అద్భుత సృష్టికి నిదర్శనం
సముద్రాన్ని చూస్తున్నంత సేపూ చూపుల వెల్లువ
తీరం వెంట పోతూనే ఉంటుంది
ఐహిక లంపటాల జ్ఞాపకాలకు ఆనకట్ట పడుతుంది
ఆధ్యాత్మిక చింతనా తరంగం పెల్లుబుకుతుంది
తనలో భీకర బడబానలం ఒదిగివున్నా
సుందర పర్వత శ్రేణులు దాగివున్నా
చిత్ర విచిత్ర జీవ సంతతులు తారాడుతున్నా
మహోజ్జ్వల రత్నరాశులు కొలువైవున్నా
ఏవికారాలూ లేని నిశ్చల యోగివలె
ఏచింతలూ లేని శ్రీమంతునివలె
ఏబాధలూ లేని భాగ్యశాలివలె
దివ్యంగా సాక్షాత్కరిస్తుంది సముద్రం
సుమధురంగా జావళీ పాడుతుంది సముద్రం
తొణకిసలాడని ధీరునికి
తుది మొదలు లేని సంసారానికి
ఉపమై నిలిచింది సముద్రం
విశ్వమానవ జీవనయాత్రకు కూడలి సముద్రం
మేధకు అంతుపట్టని పరమరహస్యం సముద్రం

# 4 స్నేహసుమం

ప్రియ నేస్తమా! నా హృదయ రాగమా!
నీవు తుమ్మెదలా చేరువైతే
నా మానస మందారం
కలతలన్నీ మరచి
మెల్లగా రేకులు విచ్చి
ప్రేమ మకరందాన్ని చిందిస్తుంది
అనురాగ గీతిని ఆలపిస్తుంది
నీవు పారవశ్యంతో ఆస్వాదించి
పులకించి పోతుంటే
ప్రణయ వాహినిలో నేను ఓలలాడుతున్నట్లు
గగన వీథుల్లో తేలిపోతున్నట్లు
ఏవేవో ఆ మధురానుభూతులు కలుగుతుంటాయి
పుష్పానికి జీవితం ఒక్కరోజే
మరి మన స్నేహసుమానికి జీవితం కలకాలం
ఈ సుమం వాడిపోనిది
రేకులు వీడిపోనిది.

తను 'కథను'ను
తానే అల్లుకుంటోంది
ఏకాకి నిప్పు కణిక. 1

ఎండ తగ్గింది
అందరూ వెళ్ళిపోయారు
చెట్టు మళ్ళీ ఏకాకి. 2

కాస్త చోటిచ్చిన నేలకు
గొడుగు అయింది
ఒకనాటి బీజం. 3

తీరం చేర్చాలని
అలల ఆరాటం, పగలు
సూర్యుణ్ణి, రాత్రి చంద్రుణ్ణి. 4

అలల చిక్కు తీస్తూ
అనేక దువ్వెనలు -
తీరాన కొబ్బరి చెట్టు! 5

(-డా॥ పెన్నా శివరామకృష్ణగారు ఇటీవల ప్రచురించిన 'సులోచనాలు' అనే హైకూల సంపుటి నుండి)

# నా మది నివ్వెరపోయిన వేళ

- శారదా అశోకవర్ధన్

సాయంసంధ్య సోయగాల్ని తిలకిస్తున్న
నా మది నివ్వెర పోయింది.....
దరిద్రాన్ని పారద్రోలాలి
మనదేశాన్ని నందనవనంగా మార్చాలి
మనది ఎంతో అందమైన దేశం
మంత్రిగారి ఉపన్యాసం
మైకు పగిలేలా వినిపిస్తోంది.
అవును మరి!
ఎటు చూసినా పెద్ద పెద్ద భవనాలు
ఆకాశాన్ని పట్టుకునేలా
వాటి మధ్య అందమైన ఉద్యానవనాలు
ప్రకృతి శోభా విన్యాసాలూ విలాసాలూ
పరుగులు తీస్తున్న రంగురంగుల
వివిధ రూపాల కార్లు
రోడ్డు పక్కనే తెరుచుకున్న ఖరీదైన బార్లు
కోటీశ్వరుల పెరిగిన బొజ్జలషికార్లు
జాగింగులూ రన్నింగులూ రకరకాల ఫీట్లు
తల మరో వైపు తిప్పితే మరో దృశ్యం
రోడ్డు పక్కన కుప్పతొట్టిలో పడేసిన
ఒక్క ఎంగిలి విస్తరికోసం ఒక పసివాడి నోరు
కుక్కల గుంపుల అరుపుల జోరు
విస్తరిని చింపుకుంటూ....
పసి రక్తపు ముద్దను చేతలో పెట్టుకుని
పచ్చిబాలింత బిచ్చానికొచ్చిన దృశ్యం
ప్రాణాలు బిగబట్టుకుని
చేతి కర్ర సాయంతో అడుగులు వేస్తూ బిచ్చకత్తె

అడుక్కుంటున్న వైనం
వీళ్ల ఆకలి రోదనల పునాదులే
ఆ భవనాల అందాల రూపాలు
వీళ్ల చిరిగిన చితికిన జీవితాలే
వాళ్ల ముంగిళ్లలో విరిసిన చిత్రాలు, వెలిసిన ఆకాశహర్మ్యాలు
అన్నార్తుల అభాగ్యుల రక్త మాంసాలు
కలవారి బీరువాలలో మగ్గుతూన్న రత్నాభరణాలు
మంత్రిగారి ప్రసంగం మైకులలో మోగుతూనే వుంది
'మనది రత్నగర్భ......'
'మనది సుందర నగరం......'
'దరిద్రాన్ని పారద్రోలాలి....'
'దేశాన్ని నందనవనంగా తీర్చి దిద్దాలి....'
సాయంసంధ్య సోయగాల్ని సంతోషంగా
తిలకిస్తున్న నా మది నివ్వెర పోయింది.....'

# అష్టపది

డా॥ కావూరి పాపయ్యశాస్త్రి



చెట్టును మూర్ఛలో ముంచి
  కోకిల ఎగిరిపోతుంది!
పువ్వును స్మృతులలోకి నెట్టి
  సీతాకోక చిలుక కదలిపోతుంది!
తోట చేసే పాటకచేరికి
  కాలం తాళంవేస్తూ నిలిచిపోతుంది!
చంద్రుడు మిగిల్చిన వెన్నెల కలలను
  మబ్బు మత్తుగా నెమరువేసుకుంటుంది!
సరస్సుకు పరిమళాల కబుర్లు చెప్పి
  జలజం చీకట్లోకి కనుమరుగవుతుంది!

నింగికి రంగుల అనుభూతిని మిగిల్చి
  హరివిల్లు కరిగి అదృశ్యమవుతుంది!
పచ్చికను ఆర్ద్రంగా పలకరించి
  మంచు బిందువు మాయమైపోతుంది!
రసాత్మలకు రాగ జ్వాలను రగిల్చి
  సౌందర్యం మందహాసంచేస్తుంది!

# అమర్త్యసేన్

డా॥ కాసర్ల రంగారావు

అమూర్త భావనలకు మూర్తి మత్వము నందించిన
శాంతినికేతన్ చదువుల రాజహంస.
కరవు దారిద్ర్యాల కరాళతాండవానికి
కారణం కనుగొన్న కారుణ్యమూర్తి.

కరడుగట్టిన కరకుభావనాశిలలను
హేతువాద వజ్రాయుధంతో కూల్చిన విజ్ఞానఖని.
అర్థశాస్త్ర పూసల తోరణంలో
ఎల్లప్పుడూ వెలుగులు విరజిమ్మే స్వయంప్రకాశకమణి.

మానవ సంపత్తి జవసత్వాలకై
విద్య ఆరోగ్య ఆర్థిక హక్కుల పునాది.
సూత్రబద్ధ నిరూపణను పట్టు పట్టి సాధించిన
చదువుల గణాంక విక్రమార్కుడు.

'మానవ అభివృద్ధి సూచిక'ను
ఆర్థిక సామాజిక సాంస్కృతికంగా మలచిన స్రష్ట
''గొప్ప ముందడుగు'' లోని లొటారాన్ని ముందుగా
విన్పించి విశ్లేషించిన వాస్తవికద్రష్ట.

తూర్పు పడమరల ప్రచ్ఛన్న ముష్టియుద్ధాల
మధ్య చిక్కిన ఆర్థిక నీతికి,
ఐక్యరాజ్యసమితి సామాజిక సాంస్కృతిక దృక్కోణానికి
అవసరమయ్యింది కదా నీ రీతి.

పెద్దలు నీపై వేసిన శీత కన్నులు
తొలగటానికి పట్టాయి కదా నాలుగు పదులు.
''ట్రినిటి'' లోని మాస్టర్
మసక తెరల బ్లాస్టర్.

స్థిర వాస్తవ విశ్లేషణల తెరగులు
సేన ఆర్థిక సూత్రాలకు నోబెల్ మెరుగులు!



కవిమిత్రుడు కీ॥శే॥ జవాద్ హుసేన్ గారికి

## కవితా నీరాజనం

డా॥ మన్నవ భాస్కరనాయుడు

నిండైన మనిషి - యాపిల్
పండైన మనస్సు - కావ్య పాండిత్యములో .
మెండైన పాటవము - కల
కండైన పలుకు ''జవాదు'' కద! ఇక లేడా?।

హితుల ముందర తన హృదయమ్ము విప్పితే
మల్లెతావుల హరివిల్లులేల?
కవి సమాజము మధ్య కంఠమ్ము విప్పితే
కాహళారవ కలకల మదేల?
మైకు ముందర నిల్చి మాట కదల్చితే
ఘనఘనార్భటముల నినదమేల?
'గ్లాసు సంఘము'నందు గళము పెగిల్చితే
గంగా తరంగ వేగంబులేల?

నిజము మా జవాద్ హుస్సేను నిష్కరా(గ్ర
కావ్య హృదయ మర్మజ్ఞుడు కమ్మదనము
పోతబోసిన రసికుడు లేత హితము
కుప్పబోసిన కూర్మిలో గొప్పవాడు!

పదమె సంపద ''పదముల పాదుషా'' కు
ముదమె వారి ''సాహిత్య సహృదయ ఝరి''కి,
మిట్ట మధ్యాహ్నమే అస్తమించి నట్టి
రాజ సమునకు కావ్య నీరాజనములు!



## అన్నపూర్ణ సీతమ్మ

కీ.శే. డా॥ పంపన సూర్యనారాయణ

ఎక్కడనుండియో యెటకొ యేగుచు జీవు డనంత యాత్రలో
ఒక్కటియైన స్త్రీపురుష యుగ్మ రసాశ్రయ గర్భకోశముం
జిక్కి, శరీరియై ధరణి చేరుచునే పెదనోరుపెట్టి న
ల్దిక్కులు పిక్కటిల్లగ నదేపని యేడ్చును జిన్ని పొట్టకై 1

బిడ్డ యేడ్పు చెవిని పడ్డ వెన్వెంటనే
తల్లడిల్లిపోవు తల్లి(పేవు
(పేవువెంట నెడద పెనుపాలవెల్లియౌ
కొండ నురుమ నేలు నిండినట్లు 2

తనదు బిడ్డయేడ్పు విన గుండె చెఱువౌట
తల్లి కెవరికైన తత్త్వ మదియ
పరుల బిడ్డ లేడ్వ వార్ధియౌ అమ్మలో
గుండె లెన్ని దాగియుండవలయు 3

బిడ్డలనిగాక, పిన్నలు పెద్దలనియు
గాక, కులముల పట్టింపులేక, వేళ
పాళయును లేక, వానయు వఱద యనక
అన్నపూర్ణయౌటనుబట్టి అమ్మతనము 4

అమ్మను మాటలోన గదలాడు మరెక్కడ లేని సాన్నిహి
త్యమ్మును బెంపుజేయు నమృతమ్ము, కుపుత్రుడు పుట్టవచ్చు చె
డ్డమ్మయు మాత్రముండదు; ప్రియాంగన కోర సుతుండు తల్లి శీ
ర్షమ్మును గోసి యేగునెడ స్వల్పపు గొప్పున కమ్మ అమ్మనున్ 5

అదె గోదావరి తల్లి, ఆంధ్ర జన జీవాధారమై సాగుచు
న్నది, కానీ! తన వార్ధివల్లభుని శ్వాసంబింత సోకన్, పదే
పదె యుప్పొంగును, కన్నుగానక ప్రజా ప్రాణంబులందీయు,తా
నది వ్యాళంబయి పొట్ట బెట్టికొన దౌమ్మా! జాడ్యమా! సంతతిన్ 6

నీరు పాలు జేసి నిత్యప్రవాహియై
సస్యవృద్ధి జనుల సాకుచుండు
నీటి పాలు జేసి నెత్తురు చూడని
చావు కెరలుగాగ సాగనంపు 7

అదిగో సాగర గర్జ రూపము తుఫానత్యంత బీభత్సమై
కదుపం జోరుగ పొంగుచున్నది మహాకామాంధ గోదావరీ
నది, తా జెట్టుల పుట్టలం దరుల నంతా నల్లకల్లోలయై
చెదరంగొట్టుచు బడ్గు జీవులను జేసెన్ కొంప కొల్లేరుగాన్ 8

ఈ సాయంత్రము తగ్గువర్షమని ఎంతే నాశతోనుండగా
ఆ సాయంత్రము నట్టులే కురియగా నక్రాకలిన్ మండె తా
బాసీ బాయని ప్రాణముండి కులదౌర్భాగ్యంపు కర్మంబుకై
దాసోఽహుండొక, డాది మాంధ్ర తలరాతల్ బ్రద్దలై పోవగన్ 9

ప్రకృతి వికారియై ప్రళయభావ పరంపర వాంతిగొన్నచో
సుకృతము పేర దోచుకొనుచున్ ధనకేసరులైన వారికా
ఒక చిన చీమకుట్టినటు లుండదు; పేదలకైనచో కకా
వికలము జీవితంబు; కడబిడ్డకు పుట్టవు నీళ్ళు గ్రుక్కెడున్ 10

కొండల కోనలందు గుడి గోపురముల్ పసమీర గట్టి బ్ర
హ్మాండపు విగ్రహంబు లెదహత్తగ నిల్పియు నర్చనక్రియా
కాండము పేర పాపపు లకారపు మూటలు కాన్క పెట్టువా
డుండును గాని, పేద కొకరున్ దయతో నిడరొక్క ముద్దయున్ 11

తట్టుకోలేని యాకలి తనను దినుచు
ప్రేగులను ఉంగలుగ చుట్టివేయుచుండ
ఏదియో తోచి సాగె పూరింటినుండి
చావుకాలాన పుట్టగా లావుతెలివి 12

ఉదరమున నగ్నిచే మండు నుదధివోలె
కడుపులో మంట పైకేమొ తడియు ముద్ద
హోరుగాలి వాన నతడుసూరుమనుచు
నుసురుతో నెట్లొ గోదారి యొడ్డునెక్కె? 13

(నా అముద్రిత కావ్యమునుండి)

## ఆకాంక్ష

డా॥ ఎస్. ఇ. బలరామిరెడ్డి

(పల్లెటూరిలో పాతకాలపు చదువు చదివిన ఒక భావుకుని
మదినుండి పొంగిన భావావేశానికి ప్రతిబింబమే ఈ కవిత)

ఊహలనంతముల్ చెలగి యూయెల లూపును మానసంబు నా
పై హృదయాన సాగు పలుభావములేవొ? లిఖింపవాని నా
యూహలపోహలేమొ? ప్రతియొక్కరు కన్గొని నవ్వినారిలన్
సాహితియెట్టులర్థమగు? సత్కవనం బెటులబ్బు భారతీ! 1

ఉల్లము తల్లడంబడుచు నుండగలే నొకచోట నాకిలన్
తల్లియు దండ్రియు లేరు నను తప్పక యెక్కడికైన బంపు, మీ
పల్లెను తోచదేమియును పాటగుచోటికి బోవ నాకు మా
తల్లిరొ! దారిజూపు నినుధ్యానము జేసెదనమ్మ! భారతీ! 2

లోకమునందు నీ పదసరోజములన్ సతమున్‌భజించి సు
శ్లోకులుగా మహాత్ములుగ శోభిలి రెందరొ, పోతనాదులున్
నీకడ మోకరిల్లి మహనీయతగాంచిరి, నీ పదాబ్జముల్
సోకెడు భాగ్యమిచ్చి కృపజూడుము ప్రోవుము నన్ను భారతీ! 3

వచ్చిన పల్లెటూరి చదువా! యదికొంచెమె, యైన కావ్యముల్
చొచ్చును నామనంబు నొకచొప్పున కాని తదర్థ భావముల్
విచ్చి గ్రహింపజాలను కవిత్వ సువాసన గుప్పుమంచెదన్
జొచ్చె నికేమి సేయుదును చూపుము సత్పథమమ్మ! భారతీ! 4

ఉన్నది సాగుజేయ పొల, మున్నది కూడు తినంగ పెట్టగా,
ఉన్నది ఇల్లు పూర్వులది, యున్నది రత్నమువంటి భార్య, నా
కున్నది సేద్యమందు పరులొప్పెడి నేరుపు, ధైర్య సాహసా
లున్నవి, వాగ్రసజ్ఞత యదొక్కటి తక్కువ యయ్యె భారతీ! 5

తల్లిరొ! యేమిసేయుదును దైవకృపాబలమద్ది లేదు, నా
కిల్లును వాకిలిన్ విడువ నిష్టములే, దిక నామనంబు నీ
సల్లలితాంఘ్రి పూజలను సల్పగ నువ్విళులూరుచుండు, సం
ఫుల్ల సరోజనేత్ర! తగుబోధ యొనర్పుము నాకు భారతీ! 6

బమ్మెర పోతరాజు కృత భాగవతమ్ము తమిన్ పఠించుచో
కమ్మని పూవు దేనియలు కాల్వలుగట్టు, ననూన భక్తియున్
నెమ్మది వెల్లువెత్తు, మరినేటికి పోతనపైన పూజ్య భా
వమ్మది నాకు హెచ్చుట భవత్పదసేవ గదమ్మ భారతీ! 7

కమ్మని కావ్య మాధురుల గాంచి మనంబున చొక్కు చుందు నే
నిమ్మహి జన్మమంది ఫలమేమి గడించితి నంచు కుందుదున్
కొమ్మల మీద కోయిలటు కూయగ కమ్మని కైత నేర్పుమిన్
అమ్మరొ! నన్ను బ్రోవు మెటులైన కవిత్వమొసంగి భారతీ! 8

ఉన్నది ముందు ముందు వినుమోయి నిరంతర భావుకా! నినున్
మన్నన సేయు భాగ్యమని మానక చెప్పు మదంత రాత్మ, యా
పున్నమి పండు వెన్నెలలొ పొంగి ననున్ దనియించు టెప్పుడో?
నిన్నె తలంచి మ్రొక్కెదను నీవె శరణ్యము నాకు భారతీ! 9

## వాంఛలు

– చిలకల వెంకటసుబ్బారెడ్డి

తిరుపతి దేవుడు కనకము,
వర పండరినాథు డెపుడు వలయును నాదం,
బరయగ నుడిపి నివాసుడు
ధరలోపల గోరు నన్నదానము నెపుడున్ 1

రమ్మని కంచిన్ కామా
క్షమ్మయు, కాశీపురిన్ విశాలాక్షియు, ని
ట్లమ్మధుర వెలయు మీనా
క్షమ్మయు సౌఖ్యముల నిచ్చు జక్కగ మనకున్ 2

సిరిగల వానిని కోరిన
వరమిచ్చును సిరులొసంగు వసుధందలంపన్
హరికి సిరిగలదు గావున
హరినే సిరినిమ్మన వలె, హరునేలనయా? 3

బూడిద దాల్చిన ఈశుడు
గాఢముగా కోర్కె దీర్ప గలడా కరుణన్?
వేడెను భిక్షను శంకరు
డాడది సగమైన సాంబు డతడేమిచ్చున్? 4

దృష్టమన కనబడునది, అ
దృష్టము గోచరము కాని దందురు కానీ
దృష్టము వలదని అందర
దృష్టమ్మునె కోరుచుందు రది యెందులకో! 5

## *English Poetry:*

# PRASANTHI, U.L.

### 1. Web Posting the Poetry

A wonderful opportunity
for the amateur poet community
to post poems on the web
to feel as part of the celeb.

Just think,
our thoughts were read
by people in distant miles
whom we never see
whom we don't know.

Elder and Experienced
Younger and Enthusiastic
People all over the world
of many a cadre and of different calibre
will share their word
We can get the ready feedback
if alone, which we lack.

When we pen, we don't know
the answer for the question,
"Is it a poem?", Yes or No!
But when we post, if they are selected
we are assured, for they be read and elected,
by many a proficient people,
this thought makes the heart hopeful.

We need not write again and again
to send these poems
to our near and dear
but simply say them
to browse in the NET centre.

We can learn the language, the style,
the rhythm and the thought pattern
from others verses,
to activate our senses.

A wonderful opportunity
for the amateur poet community
to post poems on the web
to feel as part of the celeb.

## 2. Education

Education is the might
which brings us to light
which develops the insight
to differentiate the wrong and right
which gives us the strength to fight
for what we think is right
teaches us the ways to use our
knowledge to everyone's delight
can get accolades even from the Knight
make one's life bright which helps us
to be happy in the life's twilight.

## 3. To Husbands all over the World

("You" means representative for Husbands.
"She" is a representative for Wives.)

You want her to be beautiful
Do you ever notice?
The beauty of a woman when she feels shy
while you are looking at her with love
The beauty of a woman when she is
thinking of you in solitude

You want her to be healthy
Do you ever notice?
The sense of strength in a woman
when she is surrounded by you
The spirit of work in her even she is ill
when she is in your company

You want her to be happy
Do you ever notice?
The feeling of joy and gay
when she walks in hand with you along the way
the sense of pride and merry
to hear all that you say, to share your hear

When can you know?
A woman feels you as her real wealth
you are the source of her happiness and health
It is your love, rather than the sense of duty
that make her the real beauty.

ధారావాహిక పద్యకావ్యం:

# మల్లీ! ఓ మల్లీ!

## (జానపద శృంగార పద్యకావ్యం)

(గతసంచిక తరువాయి)

- జి.సుబ్రహ్మణ్యశాస్త్రి

సరె సరెపో! ననిద్రితివో మరి రమ్మని కమ్మగ పిల్చివెమే?
అరరరె మల్లి! మనస్సులో నిన్నె దినాలు యుగాలుగ నిల్పితినే!
కరవయినాదె కనుల్లొ కసింతగ నిద్ర అనేది మరే తెలుసా?
తొరతొరగా నను రమ్మని పిల్చక, తొలికి, సత్తనె ఓసి పిలా! 82

ఏమొ? నామల్లి! నీవేమి సేస్తావొ, కా
నీ? మనస్సంత నిన్నే అలుంకొంటదే!
పేమ నీ బాసలో పెద్దదో సిన్నదో?
సామి సాచ్చేయవే! సల్లగా సెప్పవే! 83

కలలో తొలికేకలలో జలలో
మలలో సిరుకొమ్మలలో సెలలో
సెలయేరులపై సెలగే అలలో
కలికీ! మరి నీ కదిలే మొగమే 84

కనిపిస్తదె - నా కరమింతనెపో!
వినిపిస్తద నా పిలుపో సిలకా!
కనికారముతో కదిలే మొలకా!
సినమల్లి! ఇనే! సినవాడ కదే! 85

మల్లి! నీవెకదా మనూరిలొ మంచిగందము మొల్కవే!
మల్లి ఈ అవతారమెందుకె? మన్సు సంపేటందుకా?
తెల్లవారునొ లేదొ నాకిక తెల్పవే బతుకింతెనా?
కల్లకాదని తెల్పవే కనికారముందని సెప్పవే! 86

అయయో! మరి నా అవస్థసూడే
నయమై ఒకటైన రూపులేదే!
వయసై కడసే బవార్సివాన్నై
బయమై నడిదావలోనె సత్తా
పియమైన సెలీవె, మల్లి! రామే! 87

నువే లేక మల్లీ! మసైతాను పిల్లా!
సివాలెత్తి సిందేసి తిక్కోన్ని కానా?
సవాలచ్చులే నా సమస్సెల్సలాకీ!
నువే తీర్పురాయే! నువే దిక్కు కావే! 88

తిరిగి తిరిగి వూళ్లన్నీ దిగాలెత్తి నానే
కరకు మనసు ఓమల్లీ! కరాబయ్యి నాదే!
కరిగి కరిగి నీ గుండే కదల్దేమె పిల్లా!
అరిగి అరిగి కాళ్లన్నీ అలోమంటునాయే! 89

సరై అయిన దేమోలె చలాకీల మల్లీ!
మరల మరులునామీదే మజాగాను ఇస్రే
కరవుతరగ కల్లారా కనాల్నుందె నిన్నూ
పరగువరగుతో రాలేవ! నామావ అంటూ? 90

కనులనిండుగ కమ్మనె మస్కులూ - వినవె మల్లి! అవీ నిను పోలనే
మనసు ఇర్సక మన్నన సేయవే - జనము తిట్టక సాగుతదే - నిజం! 91

ఎక్కడ సూడు వోకే యిదమే సెలి - సిక్కిన వోడికి సిప్పలె సేతికి
తక్కువ వోడికి తన్నులు తప్పని - తిక్క పెపంచమె తీయని మల్లిక! 92

వత్తునా మల్లి! రామంటవా సెప్పవే!
తెత్తునా మల్లెలే తిత్తిలో నిండుగా!
తిత్తి నాగుండెలే తీయపేమల్లి నీ
కిత్తునా మల్లెలై ఇంపులే నింపగా! 93

జడముడి జార్సి కొందరు ఇసాలముగా ఇరబోసి కొందర
ప్పడముగ సుట్టి కొందరు, లసాటగ పైకికెగదీసి కొందరో
గడబిడమల్లి! జుట్టును ఎగాదిగ సర్దిన రైనగాని నీ
జడసొగసేడ నాకు తమి సాయదె నీ జడనే బలే జడే! 94

తెల్లని పూలమాదిరి, అతీగతి సూపని నాగి మాద్రి కో
కొల్లలు రంగురంగులగు గువ్వల మాదిరి ముద్దు గుమ్మలే
వల్లను కానిపిన్సినరు, వల్లనె అల్లని మల్లి! నీమొగం
బల్లిన మల్లెలేవె! దవనాన నికార్సగు సెండుపువ్వనే! 95

ఒసినీ సిత్రము పాడుగాను! అది ఏమోగాని ఆదేసమే
దొ, సివాల్నంగురుతుండి సావదె! అరే! తూ! పిల్లలాడేమొ పై
టిసిరేసే పయి సెండ్ల సూపుతరె! అంటి అంటనట్లాయెదో
పిసరంతే పయిమీది బట్ట! అరె! నీపిల్లా! నువే మంచివే 96

నాజూకైన మొగాలె కాని సిలకా! నాకేమొ ఏమాత్తరం
మోజే కల్గిన సాయలే వులికి! అమ్మో సూపు కల్సిందొ నా
బూజంతా దులిపేసినట్టు నలిపే పోతారె, ఇంకేమి ఆ
రోజంతా ‘మడిసంతె’ మల్లి నడిసే రోకైన సూపింపదే! 97

(ఇంకావుంది)

ధారావాహిక ‘రాజా శతకం’:

## మాకందాల శీతం

- గిడుగు రాజేశ్వరరావు

(34 &35 సంచిక తరువాయి)

వచ్చే ఎన్నికలూ అవి
ఇచ్చే పెత్తనము తప్ప ఇంకోమాటే
మెచ్చుడు - ఆలోచించడు
చచ్చు వెధవ రాజకీయ చతురుడు - రాజా! 19

గొలుసులతో గొడ్డళ్ళతా
బలిసిన కండల బలాన పరిపాలించే
ఖలులకు రాజ్యాంగపు విలు
వలతో పనియేమి? నిజము పల్కర రాజా! 20

పరనిందలు ఆత్మస్తుతు
లరయగ వాణిజ్య ప్రకటనలలో చాలా
విరివిగ వినవస్తుంటే
అరకొరగా నాకు కూడ అబ్బెను రాజా! 21

బ్రేకులు-వార్తల మధ్యన
బ్రేకులు ఎపిసోడ్స్ మధ్య, బ్రేకులు టీ.వీ
బ్రేకులు కావవి అరిచే
కాకులు ఇక చెప్పనలవి కాదుర రాజా! 22

ఒకడికి కార్టూన్ చానెలు
ఒకడికి యాక్షన్ మువీలు ఉన్మాదము వా
రికి, పేచీలొచ్చేస్తే
ఇక టీవీ పగిలి ముక్కలెగురును రాజా! 23

సైకిల్ తొక్కే చిన్నది
మైకేల్ జాక్సన్‌కు ఫాను, మనవడు కొంచెం
మైకు టయిసన్‌కు పూర్వం
జైకొట్టిన వాడు కాస్త జాగ్రత రాజా! 24

రేడియొ వెలుగది తరిగెను
చూడగ టీ.వీ.లు ఇంట శోభిల్లంగా
నేడవి పక్కకు మళ్ళెను
వాడుకలో కంప్యుటర్లు వచ్చెను రాజా! 25

పూరీ ఇడ్లీ దోశల
పేరైనా తలపబోరు పిల్లల రుచులే

మారాయి నేడు చూడగ
ఫారిన్ పిజ్జాల రుచులె ప్రబలెను రాజా! 26

మెలమెల్లగ చిన్నారుల
మిలిటెన్సీ మోజు పెరిగి మితి మీరేనా?
తలపరు బొమ్మల ఆటలు
బులుపు తుపాకీలపైకి పోయెర రాజా! 27

ఉరుకుల పరుగుల రొదలో
అరనిముషము తనకుతాను ఆనందించే
ఎరగని పసివాడికి ఇక
చిరుత వయసు తీపిలేని చేదుర రాజా! 28

తెలిసీ తెలియని బాల్యము
అలవోకగ తలచితలచి ఆనందిస్తాం
వెలవేని మధుర ప్రాయము
ఇలలో ఈ నాటి పిల్ల లెరుగరు రాజా! 29

ఆరేళ్ళయినా పూర్తిగ
మీరని పసివాళ్ళ వీపు మీదను కసిగా
ఆరేసి కిలోగ్రాముల
భారము మోయించు బడులు బడులా? రాజా! 30

జూలో అరుదైన పులికి
తోలాలిచే దొంగలున్న దోపిడి వలలో
ఏలాగు బతక నేర్చును?
ఏలాటిది జంతువైన నేమిర రాజా! 31

'అదిగో పులి' అని మనిషిని
అదిరించే కాలమది ఒకప్పుడు కానీ
బెదరును బెబ్బులి చచ్చును
ఎదురు పడిన మనిషి చూచి ఇప్పుడు రాజా? 32

ఆకులు ద్వారాలకు, పెను
మ్రాకులు పల్లెలకు అందమారోగ్యమునూ
చేకూర్చుకొని ప్లాస్టికు
ఆకులతోరణములొచ్చె నేరా! రాజా! 33

(ఈ శతకం పుస్తకరూపంలో వచ్చింది. అందువల్ల దీని ముద్రణ ఇంతటితో నిలిపి వేస్తున్నాం -సంపాదకుడు)

# బి.వి.వి. ప్రసాద్ కవితలు

(34 &35 సంచిక తరువాయి)

## 4. రాత్రిని పలుకరిస్తూ

హాస్పిటల్ లో దీపాల వెలుతురు
బయట నక్షత్రాలు కురిసే చీకటి
చీకటికీ వెల్తురుకీ మధ్య ఆమె.

వెల్తురు కింద అక్కడక్కడి నీడల్నీ
చీకటి లోపలి అక్కడక్కడి వెలుతుర్లనీ చూస్తూ
నిద్రకీ మెలకువకీ మధ్య ఆమె.

రోగానికి, ఆరోగ్యానికి మధ్య
జీవితానికీ, మృత్యువుకీ మధ్య రోగులు
వారితో మాటలకీ, మౌనానికీ మధ్య ఆమె

అప్పుడప్పుడూ, ఎవరో
ఎడారి నిశ్శబ్దంతో
అడుగుల చప్పుడు ముద్రిస్తూ వెళిపోతారు

ఎవరో ఒకరు
ఆమె మౌనతీరంమీదికి
అలలాంటి మాటల్ని విడిచిపెడతారు

అల వెళ్ళి పోయాక
మాటలు నెమ్మదిగ మౌనంలోకి ఇంకిపోతాయి

అప్పుడప్పుడూ ఫోను మ్రోగిన చప్పుడు
ఎండిపోతున్న మెలకువ చుట్టూ
లతలా పచ్చగా చుట్టుకొంటుంది.

మరలా
రేపటికీ, నిన్నటికీ మధ్య కూర్చుని
తెగనీ, సాగనీ ఆలోచనల తీగలపై
చీకటిని మీటుతుంది

ఏ పత్రిక పుటలనో
కనురెప్పల్లా మూస్తూ, తెరుస్తూ
తూర్పూ, ఆమె కనులూ
ఎర్రబడే వరకూ ఎదురుచూస్తుంది.



## 5. మరొక మెలకువ కోసం

నాయకులను చూసి
నేనొక నాయకుడిని కావాలనుకోలేదు
ప్రతి మనిషి తన జీవితానికి
తానే నాయకుడినని గ్రహించినప్పుడు మానవులు అడుగుతారు
మాకు లేని ఏ భయాన్ని సృష్టించి
మాకు నాయకుడిగ ముందు నడవాలనుకొంటున్నావు అని.

శాస్త్రవేత్తలను చూసి
నేనొక శాస్త్ర వేత్త కావాలనుకోలేదు
ఏ మొక్కల నుండో కొంచెం ఆహారం సేకరించి
మిగిలిన కాలం మానవులు సంతోషంగా గడుపుతున్నపుడు
వారు అడుగుతారు
మాకు లేని ఏ బలహీనతలు కలిగించి
నీ ప్రయోగఫలాలు మా ముందు ఉంచాలనుకొంటున్నావు అని.

కవులను చూసి
నేనొక కవిని కావాలనుకోలేదు
జీవనానందమే కవిత్వ రహస్యమని
ప్రతి మనిషీ తానొక కావ్యాన్నని తెలుసుకొన్నప్పుడు
వారు అంటారు
మా పాట మేం పాడుకొంటున్నాం
మేమే మా పాటలమై ఉన్నాం
ఇక నా పాట వినే తీరిక లేదని

ఏ మానవుని చూసి
నేను అతనిలా కావాలనుకోలేదు
నేను చూసిన ప్రతిమనిషీ
తాను మరొకలా, మరొకరిలా కావాలనుకొంటున్నాడు.

కానీ
పూలను చూసి
నేనూ ఒక పూవు కావాలనుకొన్నాను
పూవుకి తన నెవరో చూడాలన్న లక్ష్యం లేదు
మరొక పూవులా ఉండాలన్న కోరిక లేదు
సాయంత్రానికి రాలిపోతానన్న దిగులు లేదు
ఒక రంగుల నవ్వులా వికసించి, నిశ్శబ్దంలో కలిసిపోతుంది

ఆకాశాన్ని చూసి
నేనూ ఆకాశాన్ని కావాలనుకొన్నాను
ఎన్ని రాత్రులు, పగళ్ళు వచ్చి వెళ్ళినా
ఆకాశం కొంచెం కూడా చలించలేదు
మబ్బులూ, సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ
ఎన్ని సార్లు నడిచి వెళ్ళినా దానికి ఏ మరకా కాలేదు
తెంపులేని ఆనందంలా ఆకాశం ఎప్పుడూ తెరచుకొని ఉంటుంది.

ఒక రాత్రి కలగన్నాను
కలలో నేను పూలనీ, ఆకాశాన్నీ చూసాను

మేలుకొన్నాక అవి నాలోని వనీ
అవి అన్నీ నేనే అయి వున్నాననీ తెలుసుకొన్నాను
ఇప్పుడు మేలుకొని పూలనీ, ఆకాశాన్నీ చూసి
ఇవి కూడా నాలోనివనీ నేనేఅనీ చేప్పే
మరొక మెలకువ కావాలనుకొంటున్నాను.

(సశేషం)

# గోపిరెడ్డి రామకృష్ణారావు కవితలు

(34 &35 సంచిక తరువాయి)



## 4. పద్యం

పాళీ రాయడం లేదు
ఏం చిక్కుకుందో
కిందికి విదిపాను
రెండు రెక్కలతో సీతాకోక చిలుక రాలింది
లేcబచ్చగా
ఇక ఎగురుతుందేమో చూడాలి!

## 5. వైఫల్యం

కాగితం కోసం తిరిగి తిరిగి దొరక్క
పడవ చేయమంటూ
పల్చటి ఇనుప రేకు పట్టు కొచ్చాడు బాబు
చేసి ఇచ్చాను
మెత్తగా చేయమన్నాడు
ఊది మంత్రం ఏసి ఇచ్చాను
నీటిలో వేసి
నెమ్మదిగా వెళ్తుంది ఎలా
స్పీడుగా పొమ్మని చెప్పు అన్నాడు

స్పీడుగా వెళ్ళూ అన్నాను
అది కదల్లేదు
నా మొహంలోకి తీక్షణంగా చూసి
ఇంట్లోకి వెళ్ళి ఏడుపు లంకించుకున్నాడు.

## 6. మంచు సంగీతం

మీదికి నూకలు జల్లిన చప్పుడు
చేపల గుంపులా అలా నీటిపొర కాగితం మీదికి వస్తాను
మూతి బిగించిన హృదయంలో
నిర్దాక్షిణ్యపు ప్రమాదానికి ప్రమాదానికి
సముద్రం అటూ ఇటూ గుంజు కుంటుందా

నిశ్చలతలో
రాతి రంగుల నీటి బుడగ బెదిరిస్తూ వుంటుందా పగిలి పోతానని
లోనీలం విచ్చుకొని తెల్లని మొగ్గలా
అమాయకత్వం హాయీ జ్వరంలా తిరగ బెడతాయి పదే పదే

ప్రభాత సమయాన మంచుసంగీతం లోకి
అగరులా నుసపుతూ దేహం పరేవాప్త మౌతుంది
కట్రాడు కుంచాను జల్లలో జనుము తింటూ
గడ్డి కుక్కిన కర్రకాళ్ళ దూడ పెయ్యని నాకుతూ
ఎర్రని రక్తాన్ని తెల్లగా పాలిస్తూ
కారుణ్యంలా కన్నీరు కారుతూ ..... ఆవులా.

## 7. ఏకాంతం

హాయైన వెన్నెల రాత్రి
లోపల ఓ చిన్ని కాలువ ప్రవహిస్తోంది... తీయతీయగా
చీమలా అంచున రుచి చూస్తూ చూస్తూ తూలాను
తీపి ప్రవాహంలో ప్రాణమే పోయిందా? (సశేషం)

# డా॥ రాజేశ్వరీ దివాకర్ల కవితలు

(34 &35 సంచిక తరువాయి)

## 5. క్రెష్

గర్భసంచిలో
పడినప్పటినుంచి
ప్రశ్నల ఒత్తిడికి నలిగి
కష్ట ప్రసవమై బయట పడినవాళ్ళు
ఉమ్మనీరు పడకుండానే
ఉంగా అంటూ కేకపెట్టి

అమ్మ పొట్టమీద
సిజేరియన్ కుట్టును
పుట్టు మచ్చగా గుర్తు పెట్టుకున్నవాళ్ళు

లాలిస్పర్శలేని
బేబీ క్రెష్ పొత్తిళ్ళలో
నేపీ తడి బరువుకు
పక్కలు ఒరిసిన వాళ్ళు

నగర సంస్కృతికి కారణం తెలియక పోయినా
వారసత్వానికి సంసిద్ధ పడినవాళ్ళు
మనం పెద్దలమని నమ్మిన
పర్యావరణంలో

ముళ్ళ అంచున విరిసిన గులాబీ మొగ్గలు
బాలల దినోత్సవానికి
ఉదయమిమ్మని
కిరణాలను గుప్పిళ్ళనిండా
పట్టుకొచ్చిన వాళ్ళు.

# 6. కొస మెరుపు

మనుషులందరూ
మామూలుగానే తిరుగుతున్నా
కనుపించని దుఃఖం
గొంతు దిగక నల్లబడింది
అడవి మబ్బు దాహానికి
రక్తపుచినుకు రాలి
ప్రకృతి గతిని తప్పింది
మానవహారం చేతులుకలువక
మతం అడ్డుతగిలింది
భద్రతలేని అభ్యుదయనగరంలో
మరలవచ్చిన గాంధీపుట్టినరోజు
మరొక సెలవుదినానికి ప్రరోచన
అగరుధూపం మల్లెలహారం
అలవాటు ఆనవాయితీ ఆవాహన
అహింస, సత్యం, ధర్మం
మైకు ముందు మనిషి
కొస మెరుపుగా
కనికట్టు కడుతున్న
ఆశల వంతెన! (సశేషం)

*"Painting is a silent poem, and a poem is a talking picture".. "Poetry and painting have always been closely linked. Images and symbols occur in both; whereas in a painting colours and their shades, brush-strokes and the texture of the medium (canvas, paper, glass, etc.,) determine sense through direct viewing, a poem in cold print demands all of one's imagination to recreate and experience it at the deepest level."*

-Lekshmi Rajeev, Poet of the world, Deccan Herald, May 30, 2004.

# స్మృతిగీత ద్వయి

-అత్తిలి వేంకటరమణ

## 1 అమృత హృదయుడు

సీ. సాహితీ స్రష్టయై సత్కృతుల్ నిర్మించె
కృతులను పోషించి కృతుల గొల్చె
ప్రబలి నాటక కళా పరిషదధ్యక్షత
నటరత్నముల తెల్గునాట నిలిపె
విద్యా ప్రదాతయై విజ్ఞాన దీధితుల్
విస్తరింపగ జేసి ప్రీతి గూర్చె
రాజకీయమ్ముల రణరంగమున తా న
జాతశత్రుండయి నీతి నెఱపె
తే. గీ. కడగి ఆధ్యాత్మికతయందు కడలు ముట్టి
పరమశాంతి నాస్వాదించె బ్రతుకునందు
పద్మనాయక మేకాన్వవాయ నృపతి
అమృత హృదయుడు శ్రీరంగయాప్పరావు!

(కీ.శే. మేకా రంగయ్యప్పారావుగారి దివ్య స్మృతికి....)

## 2 మాన్యులలో అసామాన్యుడు

సీ. శ్రీ సత్యసాయి సేవాసక్త చిత్తుడై
బహుభంగుల భజించె పర్తివిభుని
సంకీర్తనానంద చంద్రికల్ ప్రసరించె
భక్త చకోరముల్ పరవశింప
బాలవాక్కులు బ్రహ్మవాక్కులుగా దీర్చె
గురువర్యుడై మించి వరగుణండు
స్వాంతస్సుఖాప్తికై వ్రతములు పూజలున్
జేయించి కొల్చె జేజేల గమిని
తే. గీ. మహిత లంకాన్వయాబ్ధి సంభవు డనంత
పద్మనాభ శాస్త్రీందుడు పరిణతి గని
మాన్యులందున దా నసామాన్యుడగుచు
వెలిగి ధన్యాత్ముడై పుణ్యవితతి నెఱపె.

(కీ.శే. లంక అనంత పద్మనాభశాస్త్రిగారి దివ్యస్మృతికి)



# డా॥ పెన్నా శివరామకృష్ణ కవితలు

## గజల్

పేరుపెట్టి మనసారా పిలవాలని ఉంది
నా హృదయం చిరునామా అడగాలని ఉంది

క్షణమైనా నీ కిటికీ తెరను జరుపరాద
పగటివేళ జాబిల్లిని చూడాలని ఉంది

నీ ఉనికే లోకానికి ఒక కానుక, కాని
నీ వేలుకు ఒక తారను పొదగాలని ఉంది

ప్రతిరోజా వేలు కొసల నలా సోకనివ్వు
నీ ముంగిట పూమొక్కగ మొలవాలని ఉంది

మీ తలపుల వేసటతో ఇంక వేగలేను
నీలో చిరు జ్ఞాపకమై మిగలాలని ఉంది

చీరకొంగు కొంతసేపు పరచి ఉంచరాద
నీ సన్నిధిలో ప్రాణం వదలాలని ఉంది.

(ఇటీవల వెలువడిన 'సల్లాపం'
అనే గజల్ సంపుటి నుండి)

## హైకూలు

1. చీకటి పుట్టుపిరికి
వెలుతురొస్తే చాలు
వస్తువుల వెనుక దాక్కుంటుంది.

2. వెన్నెల్లో, ఏటిలోని
వెండి పళ్ళాన్ని మూతితో
జరుపుతోంది గుర్రం.

3. వర్షంలో బస్సు
కళ్లపై నుంచి ముంగురులను
సవరించుకుంటోంది.

4. బయట కొచ్చినా
లోపలి కెళ్ళినా, మనసు తలుపులు
లోపలికే తెరవాలి.

5. కొవ్వొత్తికి తీరని దుఃఖం
తన కన్నీటిలోనే
తనువు చాలించింది.

6. ఏటికి రెండు వంతెనలు
ఉదయం ఒకటి, సాయంత్రం -
మరోటి, ఇరువైపులా రెండు చెట్లు

7. ఈ నదికి కొస ఎక్కడో?
సముద్రుడు ఎంత లాగినా
నీటి చీర తరగడం లేదు.

8. యుగాలు గడిచినా
పర్వతానికి దుఃఖం వీడదు
సముద్రానికి దాహం తీరదు.

9. సముద్రం పారిపోదామనుకుంటే
చేతులకు పట్టు చిక్కడంలేదు
అనాది నుంచీ.

10. చీకట్లో నిప్పురవ్వల నాట్యం
మంట ఎక్కడా లేదు:
మిణుగురులు!

11. ప్రమిద వెలిగించాను
చీకటిని చిన్నముద్ద చేసి
పీఠంగా మార్చుకుంది.

12. నీటి తీగలను బిగించి
వాయులీనాన్ని వినిపిస్తోంది
ప్రవాహం మీదికి వాలిన కొమ్మ.

13. కన్నీళ్ళే లేకపోతే
ఈ బాధల్ని తుడిచేసుకోవటం
ఎంత కష్టం?

14. కాళ్ళులేని వ్యక్తి కూర్చుని
దారిని రెండు చేతులతో
వెనక్కు లాగుతున్నాడు.

15. ప్రవాహంలో
కొండ అడ్డంగా పడుకున్నా
నీరు పరుగు నాపలేదు.

16. కొండ తల వెనుక
సూర్య పరివేషం:
ధ్యానమగ్న బుద్ధుడికి ప్రణమిల్లాను.

17. ఒక చినుకు
బుడగై మొలకెత్తింది
మరోటి పిడుగై దానిమీద పడింది.

18. బస్సు స్టాండులో బిక్షుకులు
తమ నీడలు పరచుకొని
నిద్రిస్తున్నారు.

19. పెట్రోలు మరక
రోడ్డు మీద
ఎన్ని ఇంద్రధనుస్సులో!

20. వేసవి:
చెట్టుకు ఉక్కబోసి
ఆకులను విప్పేస్తున్నది.

21. అడవిలో - ఎవరిదో
నగ్నమృత దేహం-
వేళ్ళతో సహా కూలిన చెట్టు.

22. పట్టపగలు - కర్ఫ్యూ
తుపాకీ నీడలో
వీథి నిద్ర నటిస్తోంది.

23. సాయంత్రపు వానజల్లు
చీకటిని దిగబెట్టి
వెళ్ళిపోయింది!

24. చూచి చూసి విశ్రాంతి కోసం
కాసేపు నా కనురెప్పలను
జగత్తు మీద కప్పాను!
(''చినుకుల చిత్రాలు'' అనే
హైకూల సంపుటి నుండి)

1. ఎదగాలంటే
హృదయం ఎన్ని చీలికలు కావాలో
చెబుతోంది చెట్టు

2. ఇలావచ్చి అలా వెళ్ళింది
సీతాకోక చిలుక
గదిలోని శూన్యాన్ని తెలిపి

3. మసక చీకటిలో
తన నీడను నిలబెట్టి
ఎట్టు వెళ్ళిందో చెట్టు.
('సులోచనాలు' అనే హైకూల
సంపుటి నుండి)

అనువాద కవితలు

# పద్యమా? ఫ్రెంచి మద్యమా?

## వర్తమాన ఫ్రెంచి కవిత్వం

ఆంగ్లంనుండి అనువాదం

ప్రముఖకవి వేగుంట మోహన్‌ప్రసాద్ ('మో')

(34 &35 సంచిక తరువాయి)

## 4. ఓ విశిష్ట రూప చిత్రం

-మార్క్ చొలొడింకో

నా ప్రథమ వీక్షణంలో
నా మొహమ్మీద ఆకాశం
అంతెత్తునించి ఓ గాజుముక్కని పీకి పెట్టింది

నా ద్వితీయ దృక్షణంలో
నా మొహమ్మీద గాలి వేయివేల
మెత్తని నురగలు గక్కుతోన్న గులాబీల్నుంచింది

మూడోరోజునంటారా
నీచుట్టూరా పరిచింది గాలి ఓ
అందమైన గుంటనక్క చర్మ శేషాన్ని

మరునటి రోజున ఓ ఆందోళన భరిత
శునకం పాదరసంలాంటి గళం ఒణుకుతో
తన పెదవులూ పళ్ళూ పెట్టి మూచూసింది

నా ఐదోరోజు లోచనలో
నా మొహమ్మీద కాలం పెద్ద
గాటు గీచింది మెత్తని తీగల్తో తట్టూ

నా ఆరో దినాన దాని ఆవిష్కరణంలో
నక్షత్ర వీధి ప్రత్యక్ష వాక్కులకు
నా శ్రవణేంద్రియాలు ఊడి పడినయ్.

నా ఆఖరి దృశ్యంలో
నా ముఖమాగి మాగిపోయింది
నా మునివ్రేళ్ళ ప్రథమ చుంబనంలో

నాకు గుర్తున్నంత వరకూ
రెండు కక్ష్యల్లో అవిశ్రాంతంగా
నక్షత్రాల అంధవిశ్వాసం స్రవిస్తూనే ఘనీభవిస్తుంది.

(ఆంగ్లం: వి. జ్యోతిరెడ్డి)

## 5. రాత్రి బంతి
### (డెనిస్ లవెంట్ కి)

జేనో బియానూ

ఎప్పుడూ అంతే
పరమ అస్పష్ట
రాత్రి బంతి
నల్లటి జేబు

కన్పిస్తావు అట్టడుగున
అడుగే లేని భస్మరాశిలో
చావుచెట్టు తుమ్మబెరడులో

ఎప్పుడూ అంతే
మసక మసక మసిగా
దివ్యత్వాన్నే సందేహిస్తో

రాత్రి బంతి
ఎప్పుడూ అంతే
తన మసిని తానే పిసుక్కొంటో

అపకీర్తి బంతి దొర్లుతూ
ప్రమాదపుటంచున
వ్యథ వృత్తం
నువ్వెప్పుడో అలాగే
అరిగొస్తావు జీవించిస్తూన్నదాన్ని
నొక్కటానికి
ప్రేమిస్తోన్నదాన్ని
చీల్చటానికి

ఎప్పుడో నీచంగానే నీ
అగాధపు ఉండల్తో

ఎప్పుడూ
వొంగుతూనే
నీ కళ్ళ భీతాహతంలో

వెలుగు చల్లారి పోయేట్టు
నీ నిర్ణీత జాడలో
నీ గళం వెనుక బురద
జీవంతో చలిస్తోన్న దాని ముందు

ధూళి కణాల అవజ్ఞ మధ్య

నల్లబంతి
రాత్రి జేబు
అనంతంగా సాగుతూ

కార్చుకుంటూ
నీ ద్వేషపు బొగ్గుని
బిగించుకొంటూ
ఛాయల ఉరిని

రాత్రి బంతి
మసి జేబు
తిరగేసిన జీవితం

ఎంతో మసక మసక
చాల భయమంతం
దించకుండా తాగుతావు
అనంత యానాన్ని భయపెట్తో

మృత్యు బంతీ
నీ కెదురు నిలిచి
మేమ ప్రతిహతంగా పుట్టొంటాం.

* * *

అద్భుత క్షణమిది
పగలు కూలిపోతూ

దీర్ఘ దృష్టి శక్తి వెలుగు
సమస్తం అర్ధరాత్రిలో అస్తమిస్తుంది
శునకపు స్వప్నమూ తోడేలు మెలకువకీ
మధ్యన
నిదానంగా రాలి అదృశ్యమౌతుంది

ఘడియ ఆలస్యమయింది
నిర్మ్మాలమయింది సాయంసంధ్య

ఆత్మ శ్వాసిస్తోన్నపుడు
అగాధాల్ని పంచుకొంటున్నపుడు

సజీవ ప్రత్యక్ష సమయమిది
ఏకాంతపు నల్లసిరా

మాటలు వస్తువుల్ని మోస్తోన్నపుడు
ఎవడో ఒకడ్ని ఖాళీచేసి పారేసినపుడు

ఎవడో ఒకడు తన కత్తిగాటుని
మించిపోయినపుడు
ఒకడు జ్ఞానరాహిత్యాన్ని స్వీయసమర్పణ
చేసుకొన్నపుడు

మెరుపు తన స్పృహని
తళుక్కున చెప్తుంది
గాలి ఒలికించేసిన ప్రపంచపు మాటలు

ఒక హఠాత్ ప్రత్యక్ష క్షణం
పరిపూర్ణ గుప్తత్వం రాత్రి

మహోత్సాహాన్ని కొలిచినపుడు
పరమ పరవశత్వ లోలం!

(ఆంగ్లం: వి. జ్యోతిరెడ్డి)

(సశేషం)

# మేం పాపిష్టి ఆడవాళ్ళం!

పాకిస్థానీ స్త్రీవాద కవిత్వం

(34 &35 సంచిక తరువాయి)

ఆంగ్లంనుండి అనువాదం: **అంబికా అనంత్**

## 21. అసంపూర్తి పురుషునితో సంభాషణ

--ఇషరాత్ ఆఫ్రీన్

ఈ తుది ప్రయోగం నిరూపించింది
గొప్ప నేర్పు, పనితనం
శరీర సౌష్ఠవం, వ్యక్తిత్వం ఉన్నా నీకు,
నువ్వు ఒక కుర్రాడివి మాత్రమేనని!
నీకు,
దుఃఖిస్తున్న అమ్మాయిలు,
క్షతగాత్రులు, రెక్కలు లేని సీతాకోకచిలుకలు,
లంగరు వేసిన నావలు,
గుండె కోతతో వెక్కుతూ
విరిగిన రెక్కలమీద ఎగురుతున్నవాళ్ళు
నీ పైశాచిక ప్రవృత్తికి ఓదార్పునిస్తారు.
నీలాంటివాడికి,
ఆషామాషీ కోర్కెల కోసం
అభిమానాన్ని పణంగా పెట్టే నీకు .....

నీతో నా అనుభవాన్ని, అనుభూతిని ఎలా పంచుకోను?
అర్థాన్ని వెతికే నా అన్వేషణలో నాతో నిన్ను ఎలా తీసుకుపోను?

నువ్వు ఇంకా నా కన్నా చిన్నవాడివే
ఎప్పటికైనా చిన్నవాడివే
ఎందుకంటే, నేను నా పితరులకూ అమ్మనే!

## 22. అప్రదక్షిణం

-కిష్వర్ నహీద్

నా కళ్ళు నీ అరికాళ్ళుగా మారి నా కూడా
నీ భయం నిన్ను వదలదు
నేను చూడలేక పోయినా
ఒక సుగంధం లాగా
నేను శరీరాల్నీ, వాక్యాల్నీ గుర్తించగలుగుదునని.

నా వ్యక్తిగత రక్షణ కోసం
మురికిలో నా ముక్కుని మాయమయ్యేవరకు రుద్దినా
నీ భయం నిన్ను వదలదు
నేను ఆఘ్రాణించ లేకపోయినా
మాటల్లో ఏదన్నా చెప్పగలగుదునని
నా పెదవులు, నిన్ను, నీ దైవత్వాన్నీ స్తుతిస్తూ
ఎండిపోయి, ఆత్మను కోల్పోయినా
నీ భయం నిన్ను వదలదు
నేను మాట్లాడలేకపోయినా
నడవగలుగుదునని.
నా పాదాలకు ఇంటిపని, సిగ్గు, అభిమానం అనే
శృంఖలాలను చుట్టేసినా,
నన్ను నిస్తేజను చేసినా
నీ భయం నిన్ను వదలదు
నేను నడవలేక పోయినా,
పదునుగా ఆలోచించగలుగుదునని.
నేను స్వేచ్ఛగా ఉన్నానని, నేను బ్రతికే ఉన్నానని
నేను ఆలోచించగలననే నీ భయం
నిన్ను ఎలాంటి కష్టాల్లోకి తోస్తుందో
ఎవరికి తెలుసు?

# 23. సురాహ్ - ఎ - యాసీన్

-ఫహ్మీదా రియాజ్

ఈ నిశిరాత్రి, ఈ నిబిడ నిశబ్దం
ఈ మసక దారిలో
నా వైపే వస్తున్న అడుగుల సవ్వడిలో
నేను ఒంటరి ఆడదాన్ని
ఎంతకాలంగానో నన్ను వెంటాడే ఈ అడుగుల శబ్దాన్ని
నేను విన్నాను.
నా ఇంటి వరకు
నా ఇల్లు ... ?
ఎలా చేరుకోవాలి నా ఇంటిని?
పిడచకట్టిన గొంతుతో
జారిపోతున్న గుండెతో
ఆలోచిస్తాను నేను.
ఒకవేళ త్రోవ మర్చిపోయానేమో
ఇది నా దారికాదు
అన్ని సందులకీ గుర్తులున్నాయి
కానీ ఆ సందుకి పేరులేదు
మైళ్ళకు మైళ్ళు, అన్ని ఇళ్ళూ అపరిచితమైనవే
అదిగో! పగిలిన పసుపు పచ్చని చంద్రుణ్ణి
నల్లని ఆకులు కప్పేస్తున్నాయి
ఇప్పుడు అంతా శూన్యమే ....
నా నోటిలో తప్ప
అక్కడ బరువుగా, భయంతో పక్షవాతం వచ్చిన
నా నాలుక ఉంది, ఇంకా
నా అరికాళ్ళ నుండి పైకి ఎగుస్తూ
నా శరీరపు ప్రతి కణాన్నీ ఉక్కిరిబిక్కిరి చేస్తున్న
ఒక రక్తమైన చెమ్మ ఉంది ....

'సురాహ్ - ఎ - యాసీన్ = ఒక రకమైన మహమ్మదీయ ప్రార్థన

(సశేషం)

# ఆశ గుసగుస!

మూలం: అజర్ బైజానియన్ కవి రసూల్ రజా
- అనుసరణ: నిడమర్తి ఉమారాజేశ్వరరావు

మేం నలుగురమూ
కలుసుకున్నాం:
ఆశ
శంక
దుఃఖం
నేనూ
సమయం అర్ధరాత్రి
ఘోరున వర్షం కురుస్తోంది
హోరున గాలి వీస్తోంది.
* * *

ఆశ అంది:
ఈ వర్షం వెలుస్తుంది
హోరుగాలి నిలుస్తుంది
రాత్రి ముగుస్తుంది
పొద్దు పొడుస్తుంది
అరుణార్కుని బింబం
ఆకసాన ఎగుస్తుంది.
* * *

శంక అంది:
ఎప్పుడు ?
ఇంకెప్పుడంట?!
వర్షం తగ్గి జడిమంచు
పడుతుందేమో!
గాలి పెరిగి తుఫానుగా
మారుతుందేమో!
ఈ చీకటి ఇహ యిలాగే
ఉండిపోతుందేమో?!
* * *

దుఃఖం అంది:
అది సరేనయ్యా,
ఈ వర్షం వెలిసినా,
హోరుగాలి నిలిచినా,
పొద్దు పొడిచినా -
నా గుండె లోతుల్లోన కెరలే
విషాద భావం మలిగేనా? తొలగేనా?
* * *

అలా, ఏదేదో వాదించింది ఆశ -
అబ్బే, కాదన్నది శంక
ఏమేమో వాదించింది శంక -
కాదంటే కాదన్నది దుఃఖం,
మరి నేనో? ... నేను విన్నాను:
ఆశ అన్నదీ,
శంక చెప్పినదీ,
దుఃఖం వినిపించినదీ
చెవులొగ్గి విన్నాను.
* * *

వేకువ కోసం
ఎఱ్ఱని వేకువ కోసం
వేయి కన్నులతో వేచి చూశాను:

అదెప్పుడొస్తుందనీ
అదేం తెస్తుందనీ
నే నడగలే'.
* * *
ప్రగాఢ నిశ్శబ్దంలో
వినిపించింది నాకు
ఆశ గుసగుస:
''చెప్పవూ నేస్తం!
నాతో చెప్పవూ?''
* * *

# భాష

మూలం: విష్ణు డే
తెలుగు: నిడమర్తి ఉమారాజేశ్వరరావు

తడబాటు పడనేల
ఆశ వీడగనేల?
నింపుకో నీ మదిని
నిష్కళంక ప్రేమ!

నీకు వలసిన మాట
లభియించునేమొ!
గలగలా ప్రవహించు
సేలయేటి తీరాన
గర్వాన తలయెత్తు
సాల వృక్షాలపై
కువకువల రవళించు
పావురాలను చూడు!

ఏటి కెదురీదేటి
బాతుగుంపుల చూడు!
పురివిప్పి నర్తించు
బర్హిఅందము చూడు!

తడబాటు పడనేల
ఆశ వీడగనేల?
నెరనింపు నీ మదిని
నిష్కలంక ప్రేమ!

దినవృత్తిలో మనసు
మగ్నమ్ము చేసుకో
నది ప్రక్క చేలలో
కోతలూ నూర్పిళ్ళు
ముమ్మరముగా నేడు
సాగుచున్నవి చూడు!
పూలతోటల పైన
ముసురుకొను భ్రమరాల
ఝుంకార నాదాలు
చెవియొగ్గి విను నేడు!

మాసూళ్ళ రోజులే
శ్రామికుల పండుగలు
పగలు రేలను మరచి
ఆదమరచిన రీతి
సంతోష స్వాంతులై
సంచరింతురు అపుడు!

పనివేళ శ్రమజీవి
పలికేటి నుడులలో
నీకు వలసిన మాట
దొరకునేమో చూడు!

ఓ కవీ! ఓ కవీ!
తడబాటు పడనేల
కనుదెరిచి చూడు
అల్లదె ఆశారేఖ!

చకచకా పనిముట్లు
సృష్టించుచూ తాను
గిరగిరా తిరుగాడు
'లేతు' నల్లదె చూడు

వినువీథిలో చూడు
రాకాసి 'క్రేను' ! అది
విప్పుకొని రెక్కలను
విశ్వ నృత్యము చేసె

ఇటు చూడు పల్లెలో
సాగేటి నృత్యాలు
రాసిక్య మొనరించు
రాగలయ తాళాలు!

సోంబేరి ధనికుల
భజన చేయగబోకు
ప్రజల సంపద దోచి
పట్నాలలో నుండు

సరికొత్త ధనికుల
కృతక భాషను నీవు
మృత భాషవలె వీడు!

కొండ జాతుల వారు
తాటించు శింజినీ
టంకార ధ్వనులు నీ
మదిలోన మ్రోగనీ!

భూమాత ఎదపైన
జీరాడుచూ పోవు
సీరమ్ము సేయు మృదు
నాదమ్ము గ్రహియించు!

పల్లె సీమలలోన
పట్న వాసాలలో
ఆనాటి యీనాటి
జానపద నృత్యాల
కనువైన బాణీల
నాలించి శ్రద్ధగా
అలవరచుకోవోయి!

ఆనాడె నీ కవిత
అనుపమ శైలిలో
జాతి జనుల నోట
ధ్వనియించు నిరతమ్ము!

('స్మృతి - సత్తా - భవిష్యత్' నుంచి)

# సహజీవన సౌభాగ్యం

మూలం : ఖలీల్ జిబ్రాన్ తెలుగు: దాసరి అమరేంద్ర

బాగా దగ్గరి మనుషులు కదూ మీరూ!!
అయినా మీ మధ్య కాస్తంత జాగా ఉండనివ్వండి
సుర సమీరాలను మీ నడుమ నడయాడనివ్వండి.

వలపుల ఊయలలో ఇల మరచి పోతున్నారా!!
ఆ ఉయ్యాల తాళ్లు మీ మెడలకు ముడిపడకుండా చూసుకోండి.
ఆత్మల ఇరుతీరాలనడుమ కదలాడే సాగరమవ్వాలి మీ ప్రేమ.

ఒకరి చషకాన్ని మరొకరు ప్రేమగా నింపుకొంటున్నారా!!
ఒకే పాత్రలోంచి తాగే ప్రయత్నంమాత్రం చెయ్యకండి.
పళ్లూ ఫలాలూ పరస్పరం సమర్పించుకోవడం మంచిదే
ఒకపండును ఇద్దరూ తినే ప్రయత్నం మాత్రం వద్దనేవద్దు.

కలసి పాడండి... ఆడండి... పరవశించండి!!
కానీ అవతల మనిషి ఏకాంతాన్ని గౌరవించండి
వీణపాడేపాట ఒకటే అయినా
పలికే తీగలు వేటికవి వేరువేరుగదా!

హృదయాలను ఇచ్చి పుచ్చుకొంటున్నారా? మంచిదే
అందిన హృదయాన్ని మీ ఉక్కు పిడికిట ఉక్కిరి బిక్కిరి చెయ్యకండి.

కలసి నిలవండి - కానీ ఒరుసుకొంటూకాదు...
సరిదూరపు స్తంభాలేకదా మండపాన్ని నిలబెట్టేదీ ...
మర్రీ రావీ ఒకదాని నీడన మరొకటి మనలేవుగదా!!

# రాచకొండ నరసింహశర్మగారి కవితలు

## 1. షెల్లీ స్కైలార్కు

ఇచటనే ఈ సమీపంబు నెచటొ గలదు
అంధకార విస్మృతమైన అవని వశము,
దివ్య గీతికా రచన నుత్తేజపరచి
నట్టి, కానరాని యొకింత మట్టి పిసరు!

నాడు ''షెల్లి'' వీనుల విందొనర్చియుండి
ఆ కవీశ్వరు గీతమ్మునంద నశ్వ
రతను గాంచు స్కైలార్కు మృద్రజము నెచట?
ఇతరమగు పక్షులట్లనే ఇదియు బ్రతికె.

ఆ మహాకవి గీతమునందు నిల్చి
తాను అమరత్వ మొందిన తలపు లేక
తన నిరాడంబరమగు జీవనము ముగియ
తూలికా శల్యముల చెండు పోలియుండి,

తోడి పక్షులు వీడ్కోలు పాడుచుండ
నేలపై రాలె నొకనాడు నింగినుండి;
ఎటు నశించి మాయమయెనో ఎరుకలేదు
జీర్ణమయినదో కనిపించు జిగట మట్టి?

కరగెనో సమీప కదంబ హరితమందు
దరిని, వనమందు రాబోవు ద్రాక్షతీగ
రంగులందు నిద్రించు తెరంగు దోచు
ఓయి యక్ష కిన్నరులార! పోయి తెండు.

చిటికెడైన ఆ వెలలేని చిత్ర మృత్తు
మరియు కొనితెండు కాంచన భరణి నొకటి
రజత లేఖాన్వితమ్మును రత్నఖచిత
మంకితము చేయుద మనంత కాలములకు!

భావ శబ్దము లేకమ్మై బహుళమ్మైన
పారవశ్య మహోన్నతి బడయునట్లు
విశ్వకవులలో నొకరి నావేశపరచె
నీ విహంగమే అనుమాట నేడెరింగి!

(మూలము: THOMAS HARDY (1840-1928) విరచితమ్మైన
"Shelley's Skylark" అన్న గీతము)

## 2. నిజమ్మైన ప్రేమ

సత్య విమలమౌ హృదయ దాంపత్యమునకు
అంతరాయము కల్గించ నది యఘమ్ము
మార్పు లభ్యమైనంతనే మార్పుచెంది
అపహరించు హర్త కనుకూలపడియుండు

నట్టిదౌ ప్రేమ, ప్రేమకాదరసిచూడ
గాలివానల నెదిరించి కదలకుండు
స్థిరము, శాశ్వతంబైనట్టి గురుతు ప్రేమ
తిరుగు నావలన్నింటికి తార యిదియె-

ఎత్తు తెలిసినను విలువ నరయలేము-
పాటల కపోలములు, పల్లవాధరములు
కాలపుకొడవలి పరిధిన్ కదలుచుండు
ఆతని పరాచికముకాదు అసలుప్రేమ

స్వల్పకాలములో నెట్లు మార్పుచెందు?
యుగయుగాంతములకు వేచియుండి తీరు
నిజము కాదిది యనుమాట రుజువుచేయ
మిథ్య నా కైత-నరుని ప్రేమింపు మిథ్య!*

(మూలము: William Shakespeare విరచిత సానెట్ "Let me not to the marriage of true minds admit impediments")

## 3. దృష్టిలేమి

వెలుగులేని ఈ సువిశాల విశ్వమందు
సగము జీవితమైనను సాగకుండ
నష్టపోతి నాకుండెడి దృష్టిననియు,
తనను సేవింప ననుకూల తరము నొప్పు
ప్రాణతుల్యమగు మదీయ ప్రజ్ఞ యొకటి
నిరుపయోగమై పడియుండె ననియు -మదిని
దేవుడిక నన్ను తిరిగి నిందింపకుండ
నాదు వృత్తాంతమును నేను నచ్చచెప్ప
దలచి దైవమ్ము నడిగితి బులుపుమీర
''కండ్లు లేని కబోదియు కష్టమాచ
రించి మనుటయె దేవుని యిచ్ఛయగునా?''
అస్మదీయ సహనశైలి అంతలోన

తిరుగు పల్కె నీ విధమున తృప్తిమీర
''నరుని కష్టముకాని, కాన్కలెవిగాని
అవసరము లేని మహారాజు అతడు-నిజము;
సత్యమైన ఆతని ఆధిపత్య మొప్పి

స్వీకరించుటే శ్రేష్ఠమౌ సేవ యగును!
అవని సంద్రములను తన ఆజ్ఞనంది
విశ్రమింపరు పరుగులో వేనవేలు
నిలిచి వేచియుండుట కూడ కొలువె యగును''.

(మూలము: JOHN MILTON (1608-74) విరచిత
"On his Blindness")

# అమ్మ

-ఆంగ్ల మూలం: ఆచార్య కొలకలూరి ఇనాక్

అనువాదం: డా॥ కె. ఆశాజ్యోతి

ప్రేమను త్వరితంగా
అయిష్టాన్ని నిదానంగా
తెలిపే నా తల్లి
కరుణామయి - దయాళువు

అమ్మ నమ్మకాలు
పర్వత శిఖరాలు
నిలువెత్తు స్థైర్యాలు,
అమ్మ ప్రేమ
సున్నితమైన పూవు
మృదు మధురం

అమృత ధారలు
కురిపించే కళ్ళు
దేవతల సంగీతం
వినదించే పలుకులు
నా తల్లివి
అమ్మ ప్రేమ
అసాధ్యాలను సాధించగల
స్వర్గలోకపు ఉత్సాహం
అనావిష్కృత
మానవ హృదయపు లోతులను
ఆవిష్కరించే మూర్తిమత్వం.

నేను ప్రేమించే,
అమ్మ కనుబొమలపై
పొటమరించే
స్తవనీయ స్వేద బిందువు
శాఖా చంక్రమణం
చేసే కోతిపిల్ల

అమ్మ బలశాలి
అయినా
మృదు స్వభావి
అమ్మ కళ్ళు
బంగరు భవిష్యత్తులో
తనదైన వసంతానికై
నిరంతరం
కలలు కంటూనే ఉంటాయి.

ఆడ సింహంలా
నన్ను రక్షిస్తూ
గొర్రె పిల్లనైన
నన్ను ప్రేమిస్తూ
నా జీవితాంతం
నన్ను కాపాడుతూనే ఉంటుంది.

అమ్మ గర్భంలో
అమ్మ సహవాసంలో
నేను చిరంజీవిని.
పోరు సలిపే
కోడిపెట్టలా
నిరంతరం నన్ను

గ్రద్దల నుండి
కాపాడుతూనే ఉంది.

అమ్మ రక్షణ
కవచాల్లాంటి చేతుల్లో
నా భవిష్యత్తును
స్వప్నించగల
స్వేచ్ఛను పొందాను
నన్ను తన కలల
సాకారానికి
సిద్ధం చేసుకుంది.

అనందానికి ఆశను
వడ్డించింది
మానవ మేధో
మథనానికి
ఓనమాలు దిద్దించింది.
సుదూర భవిష్యద్దర్శనం
అలవరచింది.

నా పుస్తకాల సంచిలో
అన్నమే కాదు
అభ్యుదయేచ్ఛ, అభిలాషలను
నింపి పంపింది
అమ్మ హృదయగీతం
నా జీవితానికి
ఓ దార్పునిచ్చింది.

అమ్మ చిటికెన వ్రేలు
నా పిడికిలిలో బిగిసాక
అగ్నికీలలపై నడవగలను
ఎడారులలో పరుగెత్తగలను.

అమ్మ ఆలంబన
నాకు అవసరమనుకున్నప్పుడు
కఠినశిలై - అచంచలమై
నిలిచి రక్షించింది.

అమ్మ ప్రేమ
అవధులు లేనిది
అది పుష్కలంగా
నా హృదయ దఘ్నమైంది.
అందుకే
మెరుగైన భవిష్యత్తుకై
కలిసి
పోరాడేవాళ్ళం.

గెలవడం కోసమే
కాలాన్ని సవాలు
చేయడం నేర్పింది
తీవ్రమైన ఎండల నుండి
కుండపోత వానల నుండి
నన్ను కాపాడడానికి
గొడుగై మిగిలింది.

బాధలోనూ, ఆనందంలోనూ
నన్ను అక్కున చేర్చుకుంది
అమ్మ కాకుండా
దేవతలు మాత్రమే
ఇవ్వగల బహుమతి అది.

అమ్మ జ్ఞాపకం
నా వారసత్వపు సంపద
ఆ సంపదను నమస్కరించే
చేతులతో కాపలా కాస్తాను

తియ్యటి పాట కన్నా
అది మధురమైనది
ఆ జ్ఞాపకం కేవలం
దేవలోకపు రహస్యం.

సంతోషమనే ఓడను
తన చేతి స్పర్శ చేత
నా రక్తంతో నడిపించగల
శక్తురాలు నా తల్లి.

అమ్మ సాక్షాత్కారం
ఓ అందమైన చిత్రపటం
అమ్మ కదలికలు
స్వర నాదాలు
అమ్మ ప్రేమ అలౌకికం
అమ్మే ఓ దివ్యానుగ్రహం.

అమ్మ ఆధ్యాత్మిక జీవి
భూలోకపు లోతుల్లోంచి
స్వర్గలోకపు ఔన్నత్యాల్లోంచి
ధైర్య సముద్రాలు
నమ్మకపు పర్వతాలు
తన సాక్షాత్కారంతో
సృష్టింపబడతాయి.

అమ్మ నా నావికురాలైనపుడు
అల్లకల్లోలపు సముద్రంలో
నా యానం సురక్షితం
గాలివానలోనూ
నన్ను ధైర్యపరుస్తుంది
అందుకే పక్కదారి పట్టకుండా
ఆటుపోటులను
పడవ తట్టుకుంటుంది
అప్పుడు
సముద్ర పర్వతాలు
నన్ను బెదరించలేవు
పడవను తాకనూ లేవు
పడవ దెబ్బ తినదూ-మునిగిపోదు.

అమ్మ విశ్వాసం
నా భయాన్ని
వశపరచుకుంది
తన సహవాసం
నా అస్తిత్వంలో
చైతన్యం నింపింది.

చీకటిని దిగంతాలకు
పారద్రోలే
సూర్య చంద్రుల కాంతిలా
అమ్మ జ్ఞాపకం
నా ఆత్మలోని తమస్సును
తరిమివేసే
ఓ చైతన్య ప్రవాహం.

తన గర్భంలో తిరిగి
చేర్చుకొని
నన్ను పరిరక్షించమని
నన్ను భద్రపరచమని
నన్ను భరించమని
నిరంతరం అమ్మను
ప్రార్థిస్తానే ఉంటాను.

కాళిదాస ప్రణీత

# శృంగార తిలకం

అనుసృజనం: డా॥ కోడూరు ప్రభాకరరెడ్డి

1. కరయుగళ మది యగు కోరక ద్వయంబు
నెలత ముఖకమలము శోభ నీరమౌను
పిరుదులవి పుణ్యతీర్థ పవిత్ర శిలలు
చెలువ విస్ఫారనేత్రాలు చేపలగును
మంజు మంజుల వేనలి మంజులమ్ము
గబ్బిగుబ్బలు చక్రవాకమ్ము తార
పుష్పశర దగ్ధ జీవుల మున్క కొలకు
ధాత చేసిన సరసి యీ తరుణి సుమ్ము!

2. రమ్య రసమయ వాసంత రాత్రి వచ్చె
తిరిగి యేలనో కాంతు డేతెంచడాయె
మరణ మాసన్నమైనచో మరల పుట్టి
చంద్రు గరచెడు రాహువు చందముగను
స్మరుని ముక్కంట గాల్చెడు హరుని పగిది
జాలమును వేసి యెరగ గింజలను చల్లి
కోకిలను బట్టు యాపకుని విధాన
మన్మథుండనై కసదీర మగని వేతు!

3. అక్షు లిందీవరము లాస్య మంబుజమ్ము
పల్లవ మధరమ్ము రదాలు మొల్లపూలు
స్తాపనమ్ము చంపకదళ సంచయమ్ము
కాని చెలిహృది శిలజేసె కమలజుండు!

4. జలజ దళముపై నొక్క ఖంజనము గన్న
అమరు చతురంగ బలగమ్ము లంద్రు జనులు
నేత్ర ఖంజన యుగళమ్ము నేడు కంటి
నాదు భాగ్య మెట్లుండునో నలువ కెరుక!

5. కమల ముఖమున నొంటరి ఖంజనమును
కాంచ నిద్దర నగునంద్రు కవియొ, రాజొ
ఖంజన యుగమ్ము నీ కళ్ళు గాంచువాడు
విషమశర బాధచే (మగ్గు వింతగాదె!

6. గృహములోనికి రారమ్ము (గహణ మదిగొ
చనెను రాహువు వేగమే శశిని (మింగ
చంద్రుడని యెంచి రాహువు చక్కనైన
నీదు మోమును పట్టును నిజము నెలత!

7. సిగ్గుబుగ్గల కస్తురి చెదరలేదు
మకరికాపత్రరేఖలు మాయలేదు
చనుల చందనచ్ఛాయలు సమయలేదు
కనుల కాటుక సుంతయు కరుగలేదు
దంతవస్త్రంపుటరుణిమ తగ్గలేదు
అసహన మదేల? చిట్టి బుట్టి లాడెదీవు
నెలత! ఏలనే మరికిన్క? నీదు మగడు
పాలు (దావెడు లేలేత బాలకుండ?

8. ''కాంతు డింట కోపించెనా?'' - ''కాదు కాదు!''
''అలసి నిద్రించెనా యేమి?'' - ''అదియు కాదు!''
''వృద్ధుడా? రోగియా?'' - ''అదియేమి కాదు!''
''అతగుడా? బాలుడా?'' - ''కాదు అందగాడె!''
''కత మదేమె నీ విట్లుండ? కలికి మిన్న!''
''చెప్ప నేటికి నెచ్చెలీ! సిగ్గు గల్గు
సుందరిని, జవ్వనిని నను చూచి నంత
స్మర శరాహతి స్ఖలియించి స్తబ్ధుడగును.'' (సశేషం)

గీటురాయి 1:

# అస్తిత్వ జిజ్ఞాస
## ('మరో మజిలీకి ముందు')

శ్రీ వై. ముకుంద రామారావు గారి కవితా సంపుటి పేరు ''మరో మజిలీకి ముందు''. వివిధ దశల్లో మరో మజిలీకి ముందరిస్థితి జీవితం. జీవితానికి విశ్లేషణగా కనిపించే ఈ కావ్య శీర్షిక ఈ పుస్తక స్వభావం గంభీరమైనదని ముందే మనకి చెప్తుంది. ముఖం దర్పణం లాంటిదన్న లోకోక్తి ననుసరించి ఈ కవితలకున్న ముఖచిత్రం వాటి హృదయాన్ని అద్దంలా ప్రతిఫలిస్తుంది. అట్టమీద కనిపించే భాషాభిన్న అక్షరాలు కదిలిపోయిన జ్ఞాపకాలకు తోరణాలుగా కనిపిస్తాయి. ఒకస్థితి నుండి మరొకస్థితికి అడుగువేసే పాదాలు ఎదురుబదురుగా నిల్చి సాపేక్షతను వ్యక్తం చేస్తాయి. ఈ పాదాలు జాడల్లోకి తొంగిచూస్తున్న వృక్ష ముకుపుటం ప్రశ్నార్థకంగా నిలుస్తుంది. అట్ట అంచున స్త్రీ పురుషులు సాలోచనగా చూచే దీర్ఘమైన చూపులు గాఢతను ప్రకటిస్తాయి. మరో మజిలీకి ముందు కలిగే అనంతమైన అస్తిత్వ జిజ్ఞాసలా ఈ పుస్తకరూపం పొడవైనది. పొంతనగా వేసే అడుగుల్లా ఈ పుస్తకం కుదురైనది.

ముకుందరామారావు బెంగాలులో ఉండి ఆంధ్రప్రదేశ్ వచ్చినట్లు వారి మాటలవల్ల తెలుస్తుంది. అందుకనే వీరి కవితల్లో ఒక 'ఆర్ట్' కనిపిస్తుంది. ఈ ఆర్ట్ హార్ట్‌కు సంబంధించింది. వీరిది హృదయకవిత్వం. ఈ హృదయం మృదువైనది. ఆలోచనలతో మగ్నమవుతుంది. ఈ ఆలోచన హేతువును ప్రశ్నార్థకంగా మిగుల్చుతుంది. ఈ ప్రశ్న అనుభవ పరిణతిగా రూపొందుతుంది కాబట్టి అందుకు సమాధానం తిరిగి ఆలోచనగానే మిగిలిపోతుంది.

ముకుంద రామారావుగారి కవిత్వంలో ఏకాంతం, అలజడి, అన్వేషణ అనేవి మూడంశాలు. ఈ మూడు గుణాలు తనను తాను తెలుసుకునే సంశోధనలో అంతర్లీనమౌతాయి. ప్రతిపుటలో కవి ఆవేదన వ్యక్తమౌతుంది. తనను తాను వెతుక్కునే ఒంటరితనం చాలా విశాలమైంది. అందుకనే వీరి కవిత ప్రత్యేకంగా ఉంటుంది. కుటుంబమూ, సంఘమూ, ప్రపంచమూ అనే నిత్య జీవనయానంలోని అంశాలన్నింటితో కవి గాఢమైన సంబంధాన్ని కలిగి ఉంటూనే అందుకు దూరంగా తన మస్తిష్కాన్ని పదును పెట్టుకుంటాడు. బహుళత్వంతో సంఘటిస్తూనే విరక్తతను వాంఛించే కవి వీరు.

శ్రీ ముకుందరామారావుగారి మొదటి కవిత అలలు ఇలా ఆరంభం అవుతుంది.

**''రెండు తీరాల మధ్య ప్రయాణం**
**ఏకాంతం నుండి**
**ఏకాంతానికేనా**
**ఒంటరిగా ఒడ్డునున్న నావని అడగాలి''** (పుట - 20)

నావ జీవితం. నావ పయనించక తప్పదు. ఒడ్డున ఏకాంతంగా ఉన్న నావ పయనంలో యాత్రికుల సహవాసం అనుభవిస్తుంది. తీరానికి చేరాక తిరిగి ఒక్కటిగా మిగులుతుంది. ఈ ఒంటరి పరిచ్ఛేదమే కవి ఉపాసన.

ఈ కవి కేవలం సంవేదనా శీలుడు కాదు. వ్యక్తిగతంగా శాస్త్ర విజ్ఞాని. అందుకనే సత్యాన్నెప్పుడూ వదలడు. జీవితాన్ని ఉత్ప్రేక్షగా తిలకించడం కవి స్వభావం కాదు. ఉన్నదున్నట్టుగా నిరూపించుకోవడమే ఇతని తత్వం. ఈయన Practical కవి. వీరికి బ్రతుకు రసనిధానం కాదు, ఆలోచనామార్గం. కవి ఈ కవితల్లో ఎక్కడా మనతో మాట్లాడినట్లుగా ఉండదు. ఇతరులకోసం రాసినట్టుగా కూడా కనబడదు. తనలో తాను మాట్లాడుకుంటున్న స్వగతంవలె ఉంటుంది. కాని సంవేదనల రాపిడితో తలఎత్తే ప్రశ్న మన అందరి జీవితాలకు సంబంధించినదే. అందుకని ఒంటరి కవి మనస్సుతో మన అందరి హృదయాలనే కలుపుకుంటాం. కవి అనుభవ వేగమే మనకు కూడా కలిగి జీవితగర్భాన ఒక జవాబును వెతుక్కునేందుకు ప్రేరణనిస్తుంది. అదే ఈ కవితా ప్రయోజనం.

**''నదిలో వదిలేసిన రికామీ పడవలా నేను**
**ప్రశ్నల అలలూగుతూ''** (పుట 21)- అన్న ముగింపు కవిత ఆరంభంలా అనిపిస్తుంది. సంఘర్షణకు లోనవుతూ ఆత్మగత నిర్దేశనంగా పాడమే అక్షరమే వీరి కవిత్వం.

**''జ్ఞాపకాల తుంపర్లని తుడిచేసుకుంటూ**
**బయటికి, నాలోకి''** (పుట 23)- అన్న భావావేగం వీరి సొంతం. బయటి దృశ్యాలతో సంబంధం స్థాపించుకుంటూ అంతర్గతంగా మిగిలిపోవడం వీరి కవిత్వ వైశిష్ట్యం.

**''చీకటిలో నీ తర్జుమాని**
**వెలుగులో చూద్దాం''** (పుట 35)- అనే వెలుగునీడల ప్రత్యయం వీరి ఉత్కర్ష. చీకటిలో ప్రతి మనిషీ తనను తాను తవ్వుకుంటాడు. ఒంటరితనం ఆ వేళలో ఎంతో బాగా అనువదింపబడుతుంది. ఆ అనువాదమే వెలుగులో కూడా కనబడాలి. **''నేను కనిపిస్తానా అందులో''** అన్న సందేహం వెలుగులో ఆత్మప్రశస్తి కలగాలన్న ఆశంసను వ్యక్తం చేస్తుంది.

**''అందరికీ/నాకు నేనుగానే పరిచయమవుతాను''** (పుట 47)- అని అన్నప్పుడూ, **''ఏ అన్వేషణలో ఉన్నా / నన్ను నేనన్నివైపులా తిప్పుకొని''** (పుట 47)- అని పలికినప్పుడూ సహజమైన స్వభావాన్ని ఎప్పుడూ విడనాడని వ్యక్తిగత ఆకాంక్ష ప్రకటమౌతుంది.

ఈ ప్రకృతి నైర్మల్యం

> **''ఏమీ తెలియనితనం నుంచి**
> **ఏదో తెలుస్తున్నతనంలోకి''** కలిగిన పరిణామాన్ని

కూడా తెలివి మీరనీక ''పద్యంలాంటి పసితనం'' (పుట 27) తో వ్యక్తమౌతుంది.

వీరికి కలిగిన పసితనంలాంటి అనుభవజ్ఞానం అలజడికి లలితంగా పొత్తిళ్ళు వేస్తుంది. కవి అంతరంగమెప్పుడూ 'గుండెగువ్వ' లా ఒదిగిపోతుంది తప్ప కిలకిల పక్షిలా సవ్వడి చేయదు. ఆరాటం కూడా ఆర్భాటం లేకుండా మృదువుగా సూచింపబడుతుంది.

వీరి కవితల్లో **'యంత్రశాల'** అభివ్యక్తికి ఉదాహరణగా నిలిచిపోయే కవిత. శరీరం వాహనం. వాహనాన్ని పరీక్షకు తీసుకెళ్తే అనేకానేక పరిశోధనలకు గురిచేస్తే కాని రోగం ఏమిటో పరీక్షించే వాడికి కూడా తెలియదు. సంధించగా సంధించగా అంబుల పొదిలో ఔషధబాణం దొరికినా, ఈలోగా పైసలు పైసలుగా ఆవిరవుతుంది ప్రాణం. ఇంతా చేస్తే-

> **''ఒళ్ళంతా తడిమి చూసుకుంటే**
> **ఆత్మ అంతరాత్మల సంగతేమో తెలీదు**
> **పోల్చుకోగల్గుతున్నది ముఖచిత్రమే.''** (పుట-45)

కేవలం ముఖాన్ని మాత్రమే గుర్తించగలం. ఆత్మను గుర్తించడం ఎవరికి సాధ్యం? ఆధునిక జీవితంలో అస్తిత్వసంవేదన సంక్లిష్టమైంది. జటిలమైన ఈ విషయాన్ని సమకాలానికన్వయించి సులభంగా చెప్తారు కవి.

> **''వాడాగినా**
> **వీడాగినా**
> **ఒక్క క్షణం**
> **బతికిపోయేవారు**
> **ఇరువురికీ వ్యవధి లేదు''** (పుట-68) అని జనారణ్య

సంకులంలో జరిగిన అపఘాతాన్ని అల్పాక్షరాలలోనే ఉద్వేలం కావిస్తారు. వీరి **'బ్లాక్ కాల్'** కవిత ఆధునిక నిర్వేదాన్నెంతో మృదులంగా చెప్తుంది. మౌనం చేసే మోసాన్ని కూడా గుర్తించడం వీరి గాఢతను మరింత పదిలం చేస్తుంది. ఈ గాఢత్వమే క్షమతను కూడా కల్గించినట్లు గోచరించి జీవితంలోని 'మరకల్ని' సరదాగా తుడిచి వేయగల ఔదర్యాన్ని కలిగిస్తుంది (పుట 77).

వీరికి ఏకాంతంలోని పరిణతి మానవ సంబంధాల ప్రకృష్టత వల్ల ఏర్పడింది. వీరు కుటుంబ అనుబంధాలను ఆలోచనలకు భారమితిగా స్వీకరిస్తారు. వీరు మమతకు వివశులౌతూనే వాటిల్లోని వాస్తవాలను గ్రహించి 'తనత్వం' తో సమీక్షిస్తారు. దాంపత్యంలో కూడా వీరు ఏకాంత విరహితులే -

''రైలు రాకముందు
నన్నొదలని చిన్నారి
ఇలా వచ్చేసరికల్లా
వాళ్ళ అమ్మానాన్నల్ని అతుక్కుపోయినట్టు
నేనొక్కడ్నే'' (పుట-23) - అంటూ చిన్నారి వలపులో

తన అస్తిత్వాన్ని పరిగ్రహిస్తారు. **'సాయంసంధ్య'**లో **''ఎదురెదురున్నా/ ఏకాంతానికి/ అటువేపు ఆమె/ ఇటువేపు నేను''** అనిచెప్పి **''నాలుగు పదుల వాతావరణం బాగా బరువెక్కుతోంది''** అని ముగిస్తారు. నడివయస్సులో పిల్లలు పడవలై వారిదారిన వాళ్ళు వెళ్ళారు. నాలుగ్గోడల్లో మిగిలింది ఇద్దరు - మళ్ళీ ఏకాంతం.

కవికి జీవితంలో ఆశ లేకపోలేదు. అమ్మా, నాన్నా అనిపించుకోవాలని పడిన ఆరాటం ఎంతో హృద్యంగా తెలుపుతారు. పిల్లల్ని ప్రపంచానికి అనువుగా మలచుకోవాలన్న తపనను తెలుపుతారు. **''జీవితమంతటి కవిత్వంలో/ పిల్లలు మనం రాసుకున్న పద్యాలేనేమో''** అనుకుంటూ మధురమైన అనురాగాన్ని కలిగి ఉంటారు. **''అపుడెపుడో/ ఫోటోలోని / నేను నేనే / కాదంటున్న / పిల్లలు''** అంటూ పిల్లల సైకాలజీని, తండ్రిగా మారిపోయిన తన రూపాన్ని తనలో తానే వింగడించుకుంటారు. చలద్భుశ్యాలను మనోగతం కావించుకుంటారు. మిలీనియం పిల్లల్లో కనబడే గడసరితనానికప్పుడప్పుడు విచలితులౌతూ ఉంటారు.

దాంపత్యాన్ని అద్వితీయంగా భావించక పోవడం వీరి తాత్త్విక దృష్టికి నిదర్శనం. దంపతులు ఎంతకాలం కలిసి నడిచినా ఎవరితీరం వారిదే.

''ఎంత నడచినా
ఎవరి నడకవారిదే
కలలూ కన్నీళ్ళే
కలిసి పంచుకోలేదు
నడక మాత్రం ఎందుకూ?'' (పుట-56)

అని నిక్కచ్చిగా అనుకుంటారు. **''ఆకర్షణై కొన్నాళ్ళూ / పిల్లల వారధితో ఇంకొన్నాళ్ళూ''** (పుట 56) తెలియకనేగడచిన ఇరువురి జీవితం ఎవరి నడక వారిదిగా మిగిలిపోవడం ఆశ్చర్య జనకం కాదు. అది సంసార జీవితంలోని వాస్తవం.

వక్రరేఖలు కొన్ని కవి సజీవ చిత్రాన్ని అసంపూర్ణంగా ఉంచినా, పూర్వీకుల ఛాయను మాత్రం నేపథ్యంగా ఉంచుకుంటాడు. చెదురుమదురుగా మనసు వికలమైనా ఆత్మీయబంధాలను స్మృతిచిత్రాలుగా హృదయకుడ్యాన వ్రేలాడ దీస్తాడు. వీరి 'నాన్న' కవిత మితాక్షరాలతో వందల పుటలు చూపలేని ఆత్మీయ సంపుటాన్ని ఆవిష్కరిస్తుంది. వృద్ధాప్యంలో ఉన్న నాన్న దశని తరతరాలుగా ఇంట ఉన్న కుర్చీ అనుబంధంతో ముడివేసి **'ఆ కుర్చీ / బహుశా రేపు నాది'** అంటూ నాన్నలో రేపటి తనను చూచుకుంటారు.

''నేడు నీరాజనం/ రేపోమాపో నిమజ్జనం/'' అన్న జీవిత సారాన్ని సలలితంగా చెప్పగల సామర్థ్యం ముకుంద రామారావుగారిది.

**'నా వేర్లను తెలుసుకుందు కిప్పుడు**
**నన్ను నేనే తవ్వుకోవాల్సొస్తోంది'** (పుట-49)

- అన్న అస్తిత్వజిజ్ఞాస వీరి కవిత్వ ప్రధానసూత్రం.

**''పెరిగిపోతున్న ట్రాఫిక్ రద్దీలోలా**
**ఆ కొసకెలా చేరాలన్నది**
**ఎపుడూ తలెత్తే ప్రశ్నే।''** (పుట-48)

- అన్న ఆత్మ సంవాహనమే వీరి కవిత్వ సారాంశం.

''మోనికా । మోనికా !'' వెబ్‌సైట్, ''$Y_2K$ హంగామా'' వంటి రచనలు మరో మజిలీకి ముందు కాలానుగతమైన ప్రతిస్పందనతో వేసిన అడుగులు.

సూక్ష్మంగా చెప్పాలంటే శ్రీ ముకుంద రామారావు కవిత్వయాత్రలో సమగ్ర అభివ్యక్తిని సాధించిన కవి. సంక్లిష్టతను సరళత్వంతో స్వానుభవం కావించుకో గలిగిన కవి.

- దివాకర్ల

**మరో మజిలీకి ముందు (వచనకవితా సంపుటి):**

**వై. ముకుందరామారావు,** నిశిత పబ్లికేషన్స్, 7-23/1,
8వవీధి, హబ్సిగూడ, హైదరాబాదు - 500 007,

వెల: 40/-

గీటురాయి- 2

# చల్లకవ్వం

'లోయలోమనిషి', 'తొలకరి చినుకులు' తో లబ్ధప్రతిష్ఠుడైన కవి సోమేపల్లి వెంకటసుబ్బయ్యగారు ఈ సారి 'చల్లకవ్వం'తో కవితామృతాన్ని మథించేందుకు మన ముందుకొచ్చారు. అయితే ఈ 'చల్లకవ్వం' చల్లని చల్ల చిలికివ్వదు - వస్తుపరంగా - చేదువిషంలాంటి నిజాలను తప్ప. భుజ్ భూకంపమూ, ఎయిడ్స్ బాధితులూ, చేనేత కార్మికులూ, బాడుగ జీపీ, ఆడ శిశువుల అమ్మకాలూ ఇందులో కవితా వస్తువులు. చెలిమి చిరునామా, పల్లె పాదాలు, అక్షర శిల్పి, దిగవిడచిన దిష్టిబొమ్మగా వగైరా వగైరా వంటి ఆత్మాశ్రయ రీతిలో సాగిన కవితలూ ఇందులో ఉన్నాయి. కొన్ని కవితలు ఆత్మాశ్రయ రీతిలో సాగి చివరకు Generalise చేయబడి ప్రశ్నతో ముగిసాయి. ఉదాహరణకు ఊటబావి గట్టున - వంటివి. మొత్తానికి సినారె గారు అభినందన పత్రంలో చెప్పినట్లు 'చల్లకవ్వం' (ఆ పేరుతో ఏకవితా ఇందులో లేకపోయినా) అనే పేరు ఈ కవితా సంపుటికి ఉంచడంతోనే దీని దేశీయత - ఇంకా చెప్పాలంటే 'పల్లీయత' ఉట్టిపడుతుంది.

సహజంగానే పర్యావరణ పరిరక్షణ కవిగారికి నచ్చిన అంశమైంది. **'ప్లాస్టిక్ వాడకమంటే/ మనపాడెని మనం/ బతికుండగానే సిద్ధపరచుకోవడమే....' (పాడెసంచీ)** - అనీ;

**'క్లోరోఫ్లోరో కార్బన్లు/ ఓజోన్ గొడుగును రంధ్రీకరిస్తుంటే/ ..... మట్టి మనిషి మసి కావడానికి/ అట్టే సేపు పట్టదు గాక పట్టదు'.... (హరితశ్వాస)** అనీ;

**'కాంక్రీటు వనంలో/ కార్బన్ మోనాక్సైడు కౌగిలిలో/ ప్రాణవాయువు గిలగిల లాడుతుంది.... (ఊట బావిగట్టున)** - అనీ తనవంతు ప్రచారం సాగిస్తాడు.

అయితే పరిస్థితులను కవితాత్మకంగా 'రికార్డు' చేయడం తప్ప ప్రశ్నించే తత్త్వం చాలాతక్కువ ఈసంపుటిలో. అసలు లేదని కాదు. ఉదాహరణకు

**'మీ పిక్కల్ని నొక్కేందుకు/ రెక్కలు ముక్కలు చేసుకునేది/ మేమే.... మేమే.... మేమే/ లెక్క కొద్దిగా తప్పిందంటే/ మరణ శాసనం రాసేది/ మీరే.... మీరే.... మీరే...' (ఎపుడూ మీరేనా) -**

అని నిలదీసినా That is an exception that proved the rule అన్నట్టు అటువంటి సందర్భాలు తక్కువ.

As a rule `కవి-

**'అరటావు కాగితం మీద/ అంగుళం సంతకంతోటి/**
**బతుకు అటో... ఇటో.....' (ఫైలు కదలాలంటే) -**

-అని ఆవేదన వ్యక్తంచేయడంతోనూ;

**'అతని జీవనకాగితపు నౌక। సహానుభూతి తీరంవైపు/ నిరంతరం సాగుతూనే వుంటుంది' (కాగితపు బతుకు) -**

-అని Paper boyకి సహానుభూతి వ్యక్తం చేయడంతోనూ;

**'జీవన వనంలో గిడసబారిన పిందెలు వీళ్ళు' (బుడత బాల్యం)**

-అని బాలకార్మికులను గురించి నిష్ఠుర సత్యాన్ని ఆవిష్కరించడంతోనూ ఆగిపోతాడు.

అక్కడక్కడా 'జీవన కాగితం'లాంటి దుష్ట సమాసాలూ, మామూలు ప్రకటనలను కవిత్వమనే తీరూ కనబడినా, ఇప్పుడొస్తున్న ఇతర కవితా సంపుటులతో పోలిస్తే అటువంటివి తక్కువే ఈ పుస్తకంలో.

ముందుముందు వెంకటసుబ్బయ్యగారు మరింత చిక్కని కవిత్వంతో, మరింత బిగితో మరిన్ని కవితా సంపుటులు వెలువరిస్తారని ఆశించవచ్చు- ఈ పుస్తకానికి 'అమృత మథనం' పేరుతో ముందుమాట రాసిన డా॥ నాగభైరవ కోటేశ్వర రావుగారితోపాటు మనమూనూ.....

- పినాకపాణి

**చల్లకవ్వం (వచన కవితా సంపుటి)-**
**సోమేపల్లి వెంకటసుబ్బయ్య, రూ.30/-**
**ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్,**
**హైదరాబాదు మరియు ఇతర శాఖలు**

గీటురాయి -3

# చీకటి వెలుగులు

A Review on the book "Dusk and Dawn", a collection of poems written by Dr. Palvai (Kodur) Padma, USA)

నాలుగేళ్ళ క్రిందట కవి మిత్రులు, ప్రముఖ శిశువైద్యులు అయిన డా॥ కోడూరు ప్రభాకరరెడ్డిగారు ( ప్రొద్దుటూరు) కొన్ని ఆంగ్లకవితలు నాకు పంపారు. ఆ కవితలతో పాటు ఒక లేఖ కూడా వ్రాశారు: 'ఈ కవితలు మా అన్నయ్యగారి అమ్మాయి చి॥ పద్మ 1989, 1990 సంవత్సరాలలో కర్నూలు మెడికల్ కాలేజిలో I & II M. B., B. S., చదువుతున్నప్పుడు వ్రాసిన కవితలు. మీకు నచ్చితే 'చైతన్యకవిత' లో ప్రచురించవలసిందిగా కోరుతున్నాను'. నేను ఆ కవితలు చదివాను. ఆశ్చర్యపోయాను. 18, 19 సంవత్సరాల అమ్మాయి ఇంత సాంద్రమైన భావాలతో కవితలు ఎలా వ్రాయగలిగిందా అని నివ్వెరపోతూ, ఇప్పుడు ఇంకా గొప్ప కవయిత్రిగా ఎదిగి ఉంటుందని అనుకున్నాను. కాని ఈ పద్మ 'క్షణమాత్ర కృష్ణశాస్త్రి'లా అప్పుడు కవితలు వ్రాసిందనీ, తరువాత కవితావ్యాసంగం జోలికి పోకుండా పెద్ద డాక్టరుగా ఎదిగి, గృహిణిగా మారి, అమెరికాలో స్థిరపడిందనీ, ఆమె తండ్రియైన నా మిత్రులు శ్రీ కోడూరు పుల్లారెడ్డిగారి ద్వారా విన్నాను. ప్రోత్సహించేవారు లేక పోతే స్త్రీలు ఇలాగే తమ శక్తియుక్తుల్ని పోగొట్టుకుంటారు కాబోలు!

ఈ సంపుటిలో 17 కవితలు మాత్రమే ఉన్నాయి. వీటినన్నింటినీ నేను మా 'చైతన్యకవిత' లో 1999 నుండి 2002 వరకు ధారావాహికంగా ప్రచురించాను. చి॥ పద్మ ఈనాటి ఫోటో కూడా ప్రచురించాను. కవితావ్యాసంగం కొనసాగించవలసిందిగా కోరుతూ ఆమెకు లేఖ కూడా వ్రాశాను. సమాధానం రాలేదు. అమెరికాలో జీవితం మనకన్నా వేయిరెట్లు వేగంగా పరుగెడుతూ ఉంటుంది కదా!

ఈ కావ్యానికి శీర్షిక కూడా నేనే పెట్టాను. ఈ పేరు నేను సొంతంగా ఆలోచించి పెట్టిందికాదు. ఈ 17 కవితల్లో ఒక శీర్షికను ఎన్నుకొని ఈ నామకరణం చేశాను. ఈ 17 కవితలలో రకరకాల భావాలు ఎంతో సున్నితంగా, అందంగా, రమణీయార్థ ప్రతిపాదకంగా వ్యక్తంచేసింది కవయిత్రి: -

**కవిత:**

1. మన జీవితంలో మానవత్వం, ప్రేమ, స్నేహం చాలా ముఖ్యమైనవి.

2. సుందర స్వప్నలోకాలలో విహరించడం ఆనందదాయకం.

3. స్నేహమే మన జీవితంలో మధుమాసం.

4. జీవితంలో సుఖదుఃఖాలు కలగలుపుగానే ఉంటాయి. సూర్యుడు అస్తమిస్తే చంద్రుడు ఉదయిస్తాడు కదా! చీకటి పడిందని విచారించకుండా, మర్నాడు ప్రపంచ ప్రేమ ఒక దేవతలా ఉదయ సంధ్యారూపంలో తెస్తుందని ఆనందించాలి.

5. ప్రియసఖిని దీవిస్తూ ప్రకృతియే ఆమెకు రక్షగా ఉంటుందని భావించడం చాలా రమ్యంగాఉంది.

6. స్వార్థం లేని వాత్సల్యం, మానవత్వానికి హాని చేయని స్నేహం, కృతజ్ఞతను కోరని ఉపకారం, నమ్మిన విశ్వాసం కోసం త్యాగాలు చేయడం మొదలైనవన్నీ జీవితసారంగా కవయిత్రి చిత్రించింది.

7. మూర్తిభవించిన సేవాత్యాగాలే మాతృదేవత (తల్లి).

8. మహావేగంగా పరుగెత్తే కాలాన్ని సకాలంలో అందుకొని జీవిత ధ్యేయాన్ని సాధించాలి.

9. తన స్నేహితురాలు నక్షత్రాల తళుకులో నుండి తొంగిచూస్తుంది. మెరిసే చంద్రకాంతిలో నుండి నవ్వుతుంది. జలధి తరంగ ప్రచండ ఘోషలో నుండి గుసగుసలాడుతుంది. మండుతున్న సూర్యునిలో నుండి కన్నీరు కారుస్తుంది. వెంటనే కవయిత్రి తన సఖి క్షేమం కోరి ఇలా చేస్తుంది.

' I fly to the stars on the floating clouds,
I cajole the Moon to come down the earth,
I beseech the roaring waves to make way,
I pray to the Sun to cool down'

ఈ సంపుటిలోని అందమైన కవితల్లో ఇది ఒకటి.

10. దుఃఖాన్ని చిరునవ్వుతో గెలవాలి.

11. ఇది స్నేహం గొప్పతనాన్ని చెప్పే కవిత. కవయిత్రి తన మిత్రురాలి స్నేహాన్ని ఎంతో ఆర్ద్రంగా కృతజ్ఞతతో తలచుకుంటుంది. ఆమెయే తన ఉన్నతికి కారణమని భావిస్తుంది. ఆమె స్నేహం కనుక లేకపోతే తాను వాసనలేని పూవుననీ, ఒయాసిస్సులేని ఎడారిననీ, గమ్యంలేని యాత్రికురాలిననీ చెబుతూ **'But for her radiant smile/What was my life? A barren field'** అని అంటుంది. మిత్రురాలి జ్ఞాపకాల గులాబీలతో తాను ఒక దివ్యానుభూతిలో ఎలా తేలియాడుతోందో చూడండి:

'The smile of my life sparkles
When thy rosy memories flow in;
My heavy heart, with tears is flooded,
Of anguish or elation I know not,
For it is above all expression of my ignorant self'.

పవిత్రమైన స్నేహం ద్వారా మోక్షాన్ని సాధించాలనే ఆత్మఘోష వినబడుతుంది. ఈ కవితలో:

'Even the loveliest rose does not attract me
Without thy looks assuring'.

'Reminiscences' అనే ఈ కవిత ఈ కావ్యానికి మకుటాయమానమైన కవిత. కవయిత్రి శక్తిని తెలుసుకొనేందుకు ఈ ఒక్క కవిత చదివితే చాలు.

12. ప్రకృతిలో వైపరీత్యాలు సంభవించినప్పుడు కూడా ప్రకృతిని ప్రేమించాలి. ప్రకృతియే మనకు గురువు.

13. భగవంతుడు సృష్టించిన ప్రకృతి సౌందర్య వర్ణన. ప్రకృతి సౌందర్యాన్ని యువతీ సౌందర్యంతో పోల్చి వర్ణించడం చిత్రంగా ఉంది:

'Sleeping petals of the blushing buds awake drowsily
Like the quivering lips of a bride hesitatingly;
Sun soaked waters of flowing rivulet in their regality have run
Like the golden tress of a maiden in the evening breeze undone';

14. తన మనస్సులోని 'నేను' అనే అహంకారాన్ని గయ్యాళి స్త్రీతో పోల్చి ఆమెను వశంచేసుకొనే శక్తిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించటం.

15. మిత్రురాలి అమోఘమైన, స్వచ్ఛమైన, పవిత్రమైన ప్రేమను తాను భరించలేనని వాపోవడం, తన దురదృష్టం స్నేహితురాలిని వెంటాడకూడదని కోరుకోవడం.

16. ఇది దేశభక్తి పూరితమైన కవిత. కటిక దరిద్రంతో, ఆకలితో బాధపడుతున్న దేశప్రజల భావిని గూర్చి చింతిస్తూ వ్రాసిన కవిత. రవీంద్రనాథ టాగూరు 'గీతాంజలి' లోని ఒక కవితను ప్రేరణగా తీసికొని వ్రాసినట్లు కనబడుతుంది.

17. ఇది కేవలం వైయక్తికమైన, ఆత్మకథానుభూతితో వ్రాసిని కవిత. తనను అతి గారాబంగా పెంచిన తండ్రికి కృతజ్ఞతలు తెలుపుకుంటుంది కవయిత్రి.

ఈ విధంగా ఈ కవితాసంపుటిలో కవయిత్రి ఎక్కువగా స్నేహం గొప్పతనాన్ని, ప్రకృతి రామణీయకతనూ చెప్పింది. తన తలిదండ్రుల వాత్సల్యంతో మొదలు పెట్టి, క్రమక్రమంగా పరిధిని విస్తృతం చేసుకుంటూ-స్నేహితురాండ్ర స్వచ్ఛమైన మైత్రినీ, దేశభవిష్యత్తును,

మానవత్వంతోను పవిత్రప్రేమతోను నిండిన ప్రపంచాన్ని కలలు కంటుంది కవయిత్రి. ఈమె ఆత్మీయమైన అనుభూతి మానవతారూపంలో ప్రపంచమంతటా పరిమళించింది. ఇంకో రకంగా చెప్పాలంటే- స్నేహమూ, ప్రకృతి అనే రెండు అంశాలతో ఈ కవయిత్రి తన ఆత్మ లోతుల్లోకి త్రవ్వుకుంటూ ప్రయాణం చేసింది. తన చుట్టూ ప్రేమ, మానవత్వం విరబూసిన ఒక నందనవనాన్ని సృష్టించుకొని, దాని నుండి కవిత్వమనే మధుర ఫలాలను మనకు అందించింది. అందుకు మనమంతా ఈమెకు కృతజ్ఞులమై ఉండాలి.

18-19 సంవత్సరాల యువతి వ్రాసిన లేలేత ఆంగ్లకవితల్ని, 70 సంవత్సరాలు నిండిన ప్రౌఢ కవిమిత్రులు డా॥ వి.వి.యల్.నరసింహారావుగారు తెలుగులోకి అనువదించడం, బంగారానికి తావి అబ్బినట్టుగా ఉంది!

డా॥ పద్మ బాల్యంలో కడప (ఆం. ప్ర)లోని 'నిర్మల ఇంగ్లీషు మీడియం స్కూల్'లో, కర్ణాటక రాష్ట్రంలోని 'కిత్తూరు రాణి చెన్నమ్మ బాలికల రెసిడెన్షియల్ స్కూల్'లో ఆంగ్ల మాధ్యమంలో చదివింది. కాబట్టి ఆంగ్లంలో అందమైన భావాలతో కవితలు అల్లగలిగిందని నేను నిన్న మొన్నటి వరకు భావిస్తూ వచ్చాను. అయితే ఇటీవల ఆమె తెలుగులో వ్రాసిన మూడు కవితలను చూశాక, డా॥ పద్మ తెలుగులో కూడా చక్కటి కవితలు వ్రాయగలదని గ్రహించాను. 1992-93వ సంవత్సరంలో కర్నూలు వైద్యకళాశాలలో యం.బి.,బి.యస్., నాల్గవ సంవత్సరం చదువుతున్నప్పుడు చి॥ పద్మ 'ప్రేమపూజారి', 'ఎందుకో..... ఏమో....', 'శిశిర జీవితం' అనే మూడు కవితలు వ్రాసింది. ఆంగ్లకవితలలో లాగే వీటిలో కూడా ప్రేమ, స్నేహమాధుర్యం నిండుగా తొణికిసలాడుతున్నాయి. ఈ సౌందర్య భావాలకు తగినట్లుగానే శైలి కూడా ఎంతో మనోజ్ఞంగా మధుర మంజులంగా కొనసాగింది. 'చిందరవందరైన పొగడపూల'లా, 'సన్నజాజి పందిరి క్రిందికి దూరాన్నుంచి వినవచ్చే కమ్మని సైగల్ పాటలా, 'ఆకాశాన్నుంచి నక్షత్రాలన్నీ ఒక్కసారి ఒడిలో రాలినట్లు'గా, 'వెన్నెల్లో కురులారబోసికొనే సౌందర్య సామ్రాజ్ఞి'లా ఉంది ఈమె తెలుగు కవితాశైలి. ప్రేయసిని 'సుమనోహర స్వప్నం'గా, 'స్నిగ్ధ సౌందర్యం'గా, 'కాళిదాసు శకుంతల'గా, ముక్కుతిమ్మన్నగారి సత్యభామ ('అరాళ కుంతల')గా భావించడం ఈ కవయిత్రి సాహిత్య సంస్కారానికి నిదర్శనం. 'తరిగిపోని ఊహల సాయంసంధ్య' - 'రిక్కలు పొదిగిన రత్నాంబరం' - 'శీతల మలయ మారుత సాయంకాలాలు' -'కౌముదీ విలసిత సౌందర్య విలాసాలు' -'సుప్త వాసంత సుగంధచ్ఛాయలు' -'కలల పలవరింతల కలత నిదుర' - ఇత్యాదులు డా॥ పద్మ భావనాశక్తికి ముచ్చుతునకలు. ముఖ్యంగా 'శిశిర జీవితం' అనే కవిత తిలక్ అమృతం కురిసిన రాత్రి' ని జ్ఞప్తికి తెస్తోంది. ఈమె ఆంగ్లంలోనే కాదు, ఆంధ్రంలో కూడా అలవోక గా కవితలల్లగలిగిన 'ఉభయభారతి' అని ఈ మూడు కవితలూ స్పష్టం చేస్తున్నాయి.

డా॥ పద్మ రచించిన పై వనూడు తెలుగు కవిత ల్నీచదివి, ఆనందపరవశులైన ప్రియమిత్రులు, ప్రసిద్ధ పరిశోధకులు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు (కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పుత్రుడు) వీటిని ఆంగ్లంలోకి అనువదించారు. కవయిత్రి తండ్రి శ్రీ కోడూరు పుల్లారెడ్డిగారు వీటిని కూడా చేర్చి ముద్రించడం ముదావహం. ఏది ఏమైనా తన కుమారీదశ (Teenage)లో ఇంత గొప్ప కవితాశక్తిని ప్రదర్శించిన డా॥ పాల్వాయి (కోడూరు) పద్మ తరువాతి కాలంలో కవిత్వ రచనను పూర్తిగా వర్జించడం నాలాంటి కవితాప్రియులకూ, ఆమె తండ్రిగారికీ, ప్రముఖ కవియైన ఆమె పినతండ్రి డా॥ కోడూరు ప్రభాకరరెడ్డిగారికీ మిక్కిలి దుఃఖాన్ని కలిగించే విషయమని ఇప్పటికైనా ఆమె గుర్తిస్తే బాగుండును.

**-ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**గీటురాయి- 4**

# శ్రీకృష్ణ భారతము

## (వీర మహాకావ్యము) (గత సంచిక తరువాయి)

శ్రీకృష్ణభారతంలోని తృతీయాశ్వాసం తుళువ నరసరాయల దిగ్విజయ పరంపరలతో ప్రారంభమై కృష్ణరాయల పట్టాభిషేకంతో ముగిసింది. నరసరాయలు శ్రీరంగపట్టణం ఉమ్మత్తూరు శివసముద్రాది ప్రాంతాలను కైవసం గావించుకోవడం -ఇందుకు అనుబంధంగా శ్రీరంగపట్టణ రాజప్రతినిధిగా నరసరాయలచే నియమింపబడ్డ శ్యామరాయలు తన కుమార్తె తిరుమలాంబను కృష్ణరాయలకు ఈయడానికి పూనుకోవడం- తిరుమలాంబా కృష్ణరాయల వివాహం శ్రీరంగ పట్టణంలో అద్వితీయ వైభవంతో నిర్వహింపబడడం -అనంతరం వధూవరుల రహోవిహారాలు -వారికి మోహనాంగి జన్మించడం. ఇంతలో వ్యాధి పీడితుడై నరసరాయలు మరణించగా వీరనరసింహరాయలు పట్టాభిషిక్తుడు కావడం. అతని అసమర్థతను గుర్తించి ఆదోని ఉమ్మత్తూరు నాయకులు తిరుగుబాటు చేయడం, ఆ సందర్భంలో ఆరవీటి రామరాజు తిమ్మరాజులు కందనవోలు దగ్గర ఆదిల్‌షాను ని ఓడించడం. వీరనరసింహరాయలు రామరాజు తిమ్మరాజులకు స్వామి ద్రోహర గండపెండేరాలు ఈయడం. అచ్యుతరాయ రంగరాయలు కొంకణాన్ని జయించి కర్ణాటంలో ఓడిపోవడం. వెంటనే వీరనరసింహరాయలు కర్ణాటక పై దండెత్తి

మంగళపురాన్ని జయించి, ఉమ్మత్తూరు శ్రీరంగపట్టణాలు జయించలేక పుణ్యస్థలాలు తిరిగి విజయనగరానికి విజయం చేయడం, పిమ్మట వ్యాధిగ్రస్తుడైన వీరనరసింహరాయలు పిన్నవాడైన తన కుమారునికే పట్టం కట్టి పెట్టాలనే పట్టుదలతో తిమ్మరుసును పిలిపించి, కృష్ణరాయల కన్నులు పీకించి తెచ్చి చూపవలసిందిగా కోరడం. వ్యాధి ముదిరి వీరనరసింహరాయలు మరణించగానే సామ్రాజ్యంలో నెలకొన్న విషమ పరిస్థితుల్ని చక్కపెట్టడానికి సర్వ సమర్థుడు శ్రీకృష్ణరాయలే అని పట్టాభిషిక్తుని గావించడం వంటి విషయాలను సాధారణ ఛందస్సులోనే అసాధారణ శేముషీ వైభవంతో, ప్రతిభా సుందరంగా, రసరమ్యబంధురంగా భూతపురి సుబ్రహ్మణ్య శర్మ శతావధానిగారు నిబంధించారు.

ఇక చతుర్థాశ్వాసంలోని విషయాన్ని పరిశీలిద్దాం. ఇది సూర్యాస్తమయ సూర్యోదయాది వర్ణనలతో ప్రారంభమైంది. సూర్యుడు శ్రీకృష్ణరాయల పట్టాభిషేక వార్తను పడమటి దేశాలకు తెలియచేయడానికై బిరబిరా వెళ్లినట్లు తెలిపి, వెంటనే వెన్నెలలు ఆ చంద్రవంశ్యుని రాజ్యం చల్లగా ఉండేటట్లు కురిసాయి అనడం నిజంగా కువలయాహ్లాదకరంగా ఉంది. బహమనీ సుల్తానుల్ని కృష్ణరాయలు ఎదిరించే సమయం ఆసన్నమయింది అనే విషయాన్ని సూచిస్తూ, హరి సమానుడైన ప్రభువు రాజ్యాన్ని స్వీకరింపగా, దైత్యసములైన బహ్మనీశ్వర దంతి నృపుల బెడదలేదంటూ, అమరకాంతలు దీపాలు వెలిగించిన విధంగా తారకా సముదాయం ఒప్పారినదట. సప్తాశ్వుడు మందేహాసురుల్ని వ్రయందించి మహోల్లాసంతో ప్రకాశిస్తూ పూర్వదిక్కులో కనిపించడం, కృష్ణరాయలు బహమనీ సుల్తానుల మదమణచే సన్నివేశానికి చక్కని సమన్వయం. కథా సందర్భాలను బట్టి ప్రకృతి వర్ణనలు చేయడంలో భూతపురి సుబ్రహ్మణ్యంగారి నైపుణ్యం అగణ్యం అనడానికి ఈ ఒక్క వర్ణన చాలు. ముఖ్యంగా చతుర్థాశ్వాసం నుండి షష్ఠాశ్వాసం వరకూ ఉందే ఇతివృత్తంలో కృష్ణరాయల విజయ పరంపరలకే ప్రాముఖ్యం. రాయలు పట్టాభిషిక్తుడైన వెంటనే తిమ్మరుసు వివిధ రాజనీతి విశేషాలను రాయలకు సవిస్తరంగా వివరించాడు. అటుపై నాగాంబ ఆశీస్సులతో ప్రథమ దండయాత్ర. మొట్టమొదట బహమనీ సుల్తానుల బెడదలేకుండా ఆదిల్‌ఖానుని వధించి, బీజాపురం బెల్గాం ప్రజల సంక్షోభాన్ని రాయలు నివారించాడు. వరుసగా రాయచూరు బీజాపూరు, బెల్గాం గుల్బర్గాలు జయించి బెడందకోటను రాయలు ముట్టడించాడు. మహమ్మదుశాహు శ్రీకృష్ణరాయల్ని 'యవనస్థాపనాచార్య' బిరుదంతో సత్కరించాడు. అప్పటి వీరసన్మానాలలో కవిరాజుల ప్రశంసలు చోటు

చేసికొన్నాయి. బెడంద కోట దండయాత్రా సందర్భాన్ని నందితిమ్మన పెద్దనలు అభివర్ణించిన సన్నివేశాన్ని భూతపురిగారు యథాతథంగానే స్వీకరించారు. పిమ్మట రాయలు ఉమ్మత్తూరుపై దండెత్తి, శ్రీరంగ పురాధీశుడైన చిక్కరాయలను చేరదీసి, శివసముద్రానికి పారిపోయిన గంగరాజుపై దండెత్తగా, అతడు రాయలకు ఓడి, అవమానంతో కావేరీ నదిలో పడి మరణించాడు. ఈ సందర్భంలోనే రాయలకు చిన్నాదేవిపై ప్రణయం ఏర్పడింది. ఆమె చిక్కరాయలకు కల్పిత తనయ అని తెలిసిన తిమ్మరుసు మొదట రాయలను వలదని వారించినప్పటికీ- చివరకు సమ్మతించడంతో వివాహం వైభవంగా జరిగిపోయింది. ఆశ్వాసాంతంలో రాయలు తిరుపతి యాత్ర సాగించి, అచ్చట కాంస్య విగ్రహ స్థాపనగావించినట్లు భూతపురి సుబ్రహ్మణ్యశర్మగారు వివరించారు. ఇతివృత్త మధ్యంలో మంగళ మధ్యాని అనే లక్షణానికి ఈ ఘట్టం ఎంతో సముచితంగా ఉంది.

శ్రీకృష్ణభారతంలోని పంచమాశ్వాసం తిమ్మరుసుకు సర్వసైన్యాధ్యక్ష పట్టం కట్టడంలో ఆరంభమైంది. అటుపై తిమ్మరుసు దండనాథుల్ని యోధుల్ని సమర సన్నద్ధుల్ని గావించాడు. రాయలు పూర్వదిగ్విజయయాత్రకు పూనుకొన్నాడు. మొదట ఉదయగిరి తిరుమల కాంతరాయల్ని పాదాక్రాంతుని గావించాడు. ఎక్కడా విశేషవృత్తాలను అంతగా ప్రయోగించని ఈ మహాకవి ఇచ్చట మూడుచోట్ల సుగంధి, ఉత్సాహ, మత్తకోకిలా వృత్తాలను ప్రయోగించారు. పిమ్మట రాయలు కొండవీడు ముట్టడించి, కృష్ణదాటి గజపతిని జయించి తఱిమిన సందర్భంలో స్రగ్ధరా- మహాస్రగ్ధరా వృత్తాలను నిబంధించారు. తిమ్మరుసు కేవలం బుద్ధిచాతుర్యంలోనేకాదు యుద్ధ నైపుణ్యం తెలిసిన మహావీరుడనే విషయం ఆయన నరహరిదేవుని లక్ష్మీపతిరాజును ఓడించిన సందర్భంలో ప్రస్ఫుటం చేయబడింది. వీరభద్ర గజపతితో కృష్ణరాయలు ఎదుర్కొన్నప్పుడు వరుసగా ఉత్సాహ మత్తకోకిలలను భూతపురిగారు ప్రయోగించారు. జీవగ్రాహంగా వీరభద్ర గజపతిని రాయలు పట్టుకొని పాశబద్ధుని గావించాడు. ఎందరో ఖానులు మహాపాత్రులు బందీలైనారు. ఈ సందర్భంలో వసంత వర్ణన కృష్ణరాయలకు స్వాగత పూర్వకంగా తెలుపబడింది. అప్పుడే రాయలు కృష్ణ-రామ-పాండురంగ దేవాలయాలను నిర్మించడానికి విట్టప్ప సింగప్పలకు ఆజ్ఞాపించినట్లు పేర్కొనబడింది. కృష్ణరాయలు వ్యాసరాయలను రంగనాథ దీక్షితుల ద్వారా సందర్శించి వారి ఆశీస్సులతో కుహూ గండ దోషాన్ని తొలగించుకోవడం -పిమ్మట తిరుమలాంబ ఆరవీటి రామరాజుల వివాహం -రాయలు చిత్తాపఖానుని, విలుకాండ్రను చెల్లాచెదరు చేసి

జమ్మిలోయ కాల్చి వేయడం. శ్రీ కాకుళాంధ్ర దేవుని దర్శించిన రాయలకు మహావిష్ణువు స్వప్నంలో సాక్షాత్కరించి ఆముక్త మాల్యదా రచనకు ఆజ్ఞాపించడం. నంది తిమ్మన రాయల సభలో పారిజాతాపహరణ ప్రబంధ రచనను గురించి తెలియబఱచడం. కెంబావి నైరాయు నగరాల ముట్టడితో పంచమాశ్వాసం పూర్తిచేయబడింది. ఆరవీటి రాయరాజు వివాహ సందర్భంలో భూతపురిగారు పండ్రెండు ద్విపద పాదాలను ప్రయోగించడం ఒక విశేషం.

షష్ఠాశ్వాసంలోని విషయం సంగ్రహంగా ఈ విధంగా ఉంది. కృష్ణరాయలు కటకం పైకి దండెత్తిన సందర్భంలో తిమ్మరుసు పదార్గురు పాత్ర సామంతులకు కృష్ణరాయల చేత లేఖలు వ్రాయించగా, ఆ లేఖలు చూచి భయపడిన గజపతి వింధ్యారణ్యాలకు పారిపోవడం, చిట్టచివరకు గజపతి రాయలతో సంధిచేసికొని తన కుమార్తెనిచ్చి వివాహం చేయడం, - భువన విజయ సభాభవన నిర్మాణానికి శిల్పుల్ని ఆదేశించడం, రాయచూరును కైవసం గావించుకొని గొబ్బూరు దగ్గర ఆదిల్షాను ఓడించడం- షష్ఠాశ్వాసంలో అభివర్ణింపబడ్డ ప్రధానాంశాలు. ఇందు శ్రీకృష్ణరామ విఠలదేవ ప్రతిష్ఠా సందర్భంలో తిరుమలాంబా చిన్నా భద్రా గానాలు, తాతాచార్యులు ఆలయశిల్ప కళా వైభవాన్ని సభ్యులకు వివరించడం వంటి రాయల కళాపోషణకు సంబంధించిన విషయాలు కూడా చక్కగా వివరింపబడ్డాయి. ఇచ్చట సందర్భ సముచితంగా మూడు శ్లోకాలు పండ్రెండు సీసపాదాలు కల మాలిక కూర్పబడింది. గజ-పతి శబ్దాలకు ఎన్ని పర్యాయ పదాలను ప్రయోగించవచ్చునో అన్నింటిని ఆయాపద్యాల సౌందర్యం ఇనుమడించే రీతిలో మహాకవి ప్రయోగించారు. కర్ణాటక స్థానాపతి కమలనాభయ్య గజపతి యుద్ధ ప్రయత్నాన్ని రాయలకు తెలిపే సందర్భంలో పదార్గురు పాత్ర సామంతులకు కృష్ణరాయల పేరుతో తిమ్మరుసు లేఖలు వ్రాసి పంపే సన్నివేశంలో భూతపురిగారు తేటగీతి పద్యాలను కూర్చిన తీరు ప్రశంసార్హం॥. గజపతి తన కుమార్తెకు గల వివిధ నామధేయాలను స్వయంగా తిమ్మరుసుకు తెలుపుతూ ''తుక్కానామధేయంబేకాక, భద్ర, జగన్మోహిని, అన్నపూర్ణ'' యను నామంబులు గలవన్నాడు. కవి అన్నపూర్ణ సౌందర్యాన్ని అభివర్ణించిన విధానం అప్రతిమానం. ఈ వివాహ సందర్భంలోనే వసంత వర్ణన కల్పింపబడింది. ఇది రాఘవ పాండవీయములోని పింగళి సూరన పద్యపుటెత్తుగడతో ఆరంభమైంది. 'పల్లవాళిచూత వృక్ష పక్ష శాఖ'లేవిధంగా శోభించాయో సుగంధి వృత్తంలో ప్రయుక్తం. కమలనాభమంత్రి రాయలకు లేఖ వ్రాసి పంపడానికి ముందు సూర్యాస్తమయ - అంధకార వర్ణనలు గజపతి

భావి జీవితాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి. 'గజవిభు నభీష్టముల్ కావు కావటంచు' కాకులు గూళ్లుచేరగా, 'కుంజరేశున కపకీర్తి కూడునన్నట్లు'గా చీకటి వ్యాపించిందట. ఇట్టి కవితా విలాసా లెన్నో షష్ఠాశ్వాసంలో చక్కగా ఆవిష్కరింపబడ్డాయి.

సప్తమాశ్వాసంలో ఆదిల్షా రాయల శరణు కోరగా అతనిని అనుగ్రహించడం, కాని అంతకు మునుపే ఆదిల్షాతో సంధిచెడి, అసత్ఖాను దౌత్యం విఫలం కావడం, కృష్ణరాయలు గుల్బర్గా జయించి మహ్మదుశాహు ముగ్గురు కుమారుల్ని చెఱ విడిపించడం, మహ్మదు శాహి పెద్ద కుమారునితో రాయలు సగరపురికి దండెత్తగా ఆదిల్షా సేనలు రాయల సేనలకు ఓడిపోవడం, అటుపై గత్యంతరం లేక ఆదిల్షా రాయలకు పాదాక్రాంతుడైన విషయాలు సవిస్తరంగా వివరింపబడ్డాయి. పిమ్మట రాయలు పౌరుల స్వాగత వచనాలతో విజయనగరాన్ని ప్రవేశింపగా రాయల రాజసానికి అనుగుణంగా రచన కొంత ప్రౌఢ ప్రబంధరీతిలో సాగింది. వీరసత్కార సందర్భంలో రాయలు తిమ్మరుసుకు 'ఆంధ్ర సామ్రాజ్య స్థాపనాచార్య' బిరుదాన్ని ప్రసాదించి సత్కరించగా, తిమ్మరుసు రాయలకు 'సాహితీ సమరాంగణ సార్వభౌమ' బిరుదమిచ్చి ఆశీర్వదించాడు. అటుపై కృష్ణరాయల సభాభువన ప్రవేశం అభివర్ణితం. ఈ సందర్భంలో భూతపురిగారు సాధారణంగా ప్రచారంలో ఉన్న అష్టదిగ్గజాల ప్రసక్తిని ప్రవేశపెట్టారు. ఒక్కొక్కకవి స్వపరిచయం, వారు తమకు, తామై పేర్కొన్న కావ్య లక్షణాలు, వారి వారి ప్రబంధాలలోని ప్రసిద్ధ ఘట్ట పరిచయం మొదలైన విషయాలను యథాతథంగానే భూతపురిగారు స్వీకరిస్తూ, ఆయా కవుల పద్యాలకు చివర కృష్ణరాయాలను సందర్శించడానికి వచ్చినట్లుగా తుదిపాదాన్ని మార్చి కూర్చిన సన్నివేశం ఎంతో సుందరంగా రసబంధురంగా ఉంది. తెనాలి రామకృష్ణుని 'తగ సంస్కృతము తెనుంగుగ జేయ' అనే పద్యం చివర 'రమ్యగుణ కృష్ణ కృష్ణ నరసింహరాజ కృష్ణ' అని; పింగళి సూరన 'గౌతమ గోత్రుడ ఖ్యాపకాపస్తంబ సూత్రుండ' అనే పద్యం చివరలో 'ప్రమదమున మిమ్ము సేవింప వచ్చినాడ' ననీ; భట్టుమూర్తి 'శత లేఖినీ పద్య సంధాన ధుర్యుడ' పద్యం తుదిలో 'భట్టుమూర్తిని మిము గొల్వ వచ్చినాడ'నని - ఇట్లే మారన, ధూర్జటి మొదలైన వారి పద్యాల చివరి పాదాలు మార్చబడ్డాయి. సూరనగారి 'పొసగ ముత్తెపు సరుల్' 'చలువ గల వెన్నెలలు' వంటి పద్యాలు ఎట్టి మార్పులు లేకుండా గ్రహింపబడ్డాయి. ఆముక్తమాల్యదావిష్కరణ సందర్భంలో ఆస్థాన కవుల ప్రశంస, పిమ్మట హజారా రామాలయంలో కవులతో గోష్ఠి, ఆ సందర్భంలో పెద్దనగారి 'నిరుపహతి స్థలంబు', 'శ్రేణుల్ గట్టినభోంతరాళమునఁ బాఱె' అను

సూర్యాస్తమయ వర్ణన, రాయలు పెద్దనను మనుచరిత్ర రచనకు పురిగొల్పే సందర్భంలో మనుచరిత్ర పీఠికలోని పద్యాలు యథాతథంగా గ్రహింపబడ్డాయి. పారిజాతాపహరణము రాయలకు అంకితం గావించిన సందర్భం కూడా ఈ ఆశ్వాసంలోనే అభివర్ణితం. 'అలికమందు నక్షి దాచినట్టి సర్వజ్ఞుఁ బోలు వాఁడధిపు'డనే వాక్యాన్ని భూతపురిగారు ధూర్జటి రాయలను ప్రశంసించిన సందర్భానికి సమన్వయించారు. రాయలు వసంతోత్సవాలను వైభవంగా జరిపించిన సందర్భంలో 'వాకిటి కావలి తిమ్మా' - 'శరసంధాన బల క్షమాది వివిధైశ్వర్యంబులగల్గి', 'కలనం దావక ఖడ్గ ఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండ మండల భేదం బొనరించి', 'శ్రీరంగేశ్వరు నాభి పంకజ రజశ్శ్రీ కంటె' వంటి పద్యాలు స్వీకరింప బడ్డాయి. 'వక్త్రంబుల్ పది కన్నులైదు కరముల్ వర్ణింపగా వేయగుః' అనే సమస్యను రుద్రకవి పూరించడం, రామభద్రుని రామాభ్యుదయ ప్రశంస, ఇట్లే సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసంలోని 'కాకులు రావి పండ్లు తిన' అనే పద్యం, చింతలపూడి ఎల్లన 'తొగరు- తగరు- నగరు- వగరు' అనే దత్తపదులతో రామాయణ భారత ఘట్టాలను వర్ణించడం, మరి కొన్ని సమస్యాపూరణలు ఈ సప్తమాశ్వాసంలో వివరింపబడ్డాయి. కృష్ణరాయల సారస్వత కళా పోషణమే ధ్యేయంగా ఈ ఆశ్వాసంలో పలువురి ప్రసిద్ధకవుల పరిచయం ఆయా కవుల కవితా చాతురీ ధురీణతతో ప్రకటితమైంది. అంతే కాదు. ఏయే ప్రబంధకవుల రచన తన కిష్టమో కృష్ణరాయ సభావ్యాజంతో భూతపురిగారు నిరూపిస్తూ ఒకకొక్క కవిలో తాను ఐక్యమై రసాద్వైతాన్ని అనుభవించారు. ఈ అద్వైతభావనతోనే అభిమానపాత్రుడైన ప్రతి ప్రబంధకవినీ అనుకరిస్తూ హృద్యపద్య రచనా వైవిధ్యాన్ని భూతపురిగారు రసరమణీయంగా ప్రదర్శించారు.

అష్టమాశ్వాసంలోని కథ ప్రధానంగా విశ్వనాథనాయక విజయం. చంద్రమౌళి పాండ్యులు రాయల శరణు కోరిన యనంతరం నాగమనాయడు మధురను చుట్టుముట్టి, చోళవేంద్రుని హతమార్చి, రాయల అనుమతి లేకుండా, తనకు తానై జయించిన రాజ్యానికి సర్వాధిపత్యాన్ని చేపట్టగా, రాయలు కోపించి, అతనిని బంధించి తనకప్పగించవలసిందిగా అతని తనయుణ్ణే నియమించడం ఈ ఇతివృత్తంలోని ప్రత్యేకత. విశ్వనాథనాయకుని పరిచయం సప్తమాశ్వాసంలోనే, రాయల కొలువులో కళావతీ సమేతంగా సాహిత్య పరీక్షలో ఉత్తీర్ణుడై, తిమ్మన పెద్దనకు బహుమతులందీయగా, సభాధ్యక్షుడు సత్కరించిన సందర్భంలో వివరింపబడింది. కృష్ణరాయల వలె విశ్వనాథనాయకుడు కూడా సమర రంగంలోనే కాక సాహిత్య రంగంలో

కూడా ఎంతో చాతుర్యం, ప్రతిభా విశేషాలు కలవాడుగా విదితమైంది. వీరచక్రాన్ని అందుకొన్న విశ్వనాథ నాయకుడు తన తండ్రిపై ధ్వజమెత్తి ఆతని గర్వపూరితమైన ఆధిపత్యాన్ని అణచి రాయలయెడ కృతజ్ఞతలు వెల్లడించిన తీరు వీరరసోజ్జృంభణంగా అష్టమాశ్వాసంలో అభివర్ణింపబడింది. ఈ ఇతివృత్తంలో చివరగా రాయలు నాగమయ్యను క్షమించి, విశ్వనాథుని పాండ్యరాజుగా, చెవ్వప్పను చోళరాజుగా నియమిస్తాడు.

అనంతరం మనుచరిత్రావిష్కరణోత్సవం అభివర్ణితం. ఇచ్చట ఇందీవరాక్షుని వృత్తాంతంలోని పద్యాలు స్వీకరింపబడ్డాయి. ఈ మహాప్రబంధం చివరలో అనేక సమస్యలు కవుల పూరణలు యథాతథంగానే మహాకవి భూతపురి గ్రహించారు. 'స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో అతులిత మాధురీ మహిమ' అనుటకు రామకృష్ణుని సమాధానం, అందుకు భట్టుమూర్తి కోపించగా ఆ సందర్భంలో 'ఆ రవి వీరభద్రు చరణాహతి' అనే పద్యాన్ని తిమ్మన ఊయల తాకిన సన్నివేశంలో సమన్వయించి 'రవి గాననిచో కవి గాంచునే గదా' అనే సమస్యను పూరించడం, ఇట్లే సంకుసాల నృసింహ కవి' ఉద్ధతుల మధ్య పేదలకుండఁదరమె' అనే సమస్యను శృంగార రసపరంగా పూరించడం, 'భార్యలిద్దఱు శ్రీరామ భద్రునకును' అనే సమస్య అయ్యల రాజు రామ భద్రునిచే పూరింపజేయడం, ముఖ్యంగా ప్రెగడరాణ్ణరసరాజుకు రామకృష్ణ కవికి జరిగిన సంవాదంలో క్రమపరంపరగా ఎన్నో సమస్యలు వాటి పూరణలు చోటు చేసికొన్నాయి. 'కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెఁ' అనే సమస్యకు రామకృష్ణ కవి సమాధానం చెప్పిన అనంతరం చివరలో 'త్రవ్వట బాబా తలపై' అనే పద్యాన్ని ఏ విధంగా వ్రాయాలో వ్రాసి నరసరాజుకు గర్వభంగం కలిగించాడు. ''ముద్దుగ గండపెండియరవుఁ గొనుడంచు బహూకరింపగా'' అనే పద్యం, 'పూత మెఱుంగులుఁ' అదే పెద్దన ఉత్పలమాలిక, 'వ్యాయామ స్థిర సంధి బంధ', 'ఇంతటి సత్క్రియఁ సలుపనెంతటి వాడ నరేంద్ర' వంటి కృతజ్ఞతా పూర్వక పద్యాల అనంతరం ఈ ప్రబంధం 'కోద్భవ కోద్భవ భవభవ' అనే పద్యంతో అంతమైంది. నిరంతరం రాయల కొలువులో ఏదో ఒక సాహితీ వినోద కార్యక్రమం నిర్వహింపబడుతూ ఉంటుందని భువన విజయ ప్రాశస్త్యాన్ని ప్రకటిస్తూ కావ్యాంతం శుభావహంగా ముగియడం శతావధాని అవధాన కళాభిజ్ఞతకు అద్దంపడుతూ ఉంది.!

వీరరస ప్రధానమైన ఈ మహాప్రబంధంలో యుద్ధవర్ణనలు సంవాదాత్మకంగా సాగి రససంబంధమైన స్థాయిని ప్రతిష్ఠించడంలోనే కాక, పాఠకులలో రసోత్తేజకమైన

ఉత్సాహాన్ని ద్విగుణీకృతం కావించి, మానసికమైన హాయిని కలిగించాయి. చిట్టచివరి సమస్యాపూరణలలో కూడా రాయల 'సాహితీ సమరాంగణ సార్వభౌమత్వం - వీరరసస్ఫూర్తితో నిరూపితమైంది. సంవాదశైలిలో ఈ మహాకవి, తిక్కన సూరనాదికవులను తలపింపజేసారు. ప్రాబంధికమైన ప్రౌఢరచనలో క్షాత్ర తేజాన్ని భావింపజేయడం అసాధారణ శేముషీ విభవం కల ప్రతిభా ధురీణులకే సాధ్యం. సందర్భాను సారంగా రచనా వైలక్షణ్యాన్ని ప్రదర్శించిన ఈ మహాకవి వైచక్షణ్యం, క్షణక్షణ నవ్యతాగుణ సంపన్నమై హృద్య పద్య బంధురంగా, ఔచితీ విలసనంలో రసానందాన్ని జాలువార్చింది. వీరరసాన్ని ఆలంబనం చేసికొని రాయల ముగ్గురు దేవేరుల వివాహ వర్ణన, ఆయన కుమార్తె వర్ణన ఈ మహాప్రబంధంలో అభివర్ణితమై, శృంగారానికి కూడా చక్కని నేపథ్యాన్ని భూతపురిగారు కల్పించారు. నేటి చారిత్రక మహాప్రబంధాలలో కృష్ణ భారతానికి గల స్థానం అప్రతిమానం. ఒక్క మాటలో దీనికిదే సాటి అని తెలుపుతూ ప్రస్తుతానికి ఈ సంగ్రహ వ్యాసాన్ని విరమిస్తున్నాను. ప్రతి సహృదయుడు రసహృదయుడు దీనిని తప్పక పఠించాలి అని నా ఆకాంక్ష.

**-డా॥ మల్లేల గురవయ్య**

**గీటురాయి- 5**

# చిల్మన్

వర్తమాన వచన కవుల్లో, శైలిలో అల్లసాని పెద్దనతో పోల్చదగిన వారెవరు అనే ప్రశ్న వేసుకుంటే ఆశారాజుగారు అని సమాధానం చెప్పుకోవచ్చు. అల్లసానివారి హిమాచల వర్ణన చదివితే హిమాలయాలను వెంటనే చూడాలనిపిస్తుంది. అలాగే ఆశారాజుగారి **'సాష్టాంగ నమస్కారం'** చదివితే జడివానలో తడవాలనీ, **'తడి అడుగులు'** చదివితే వేకువ జామునే లేచి మార్నింగ్ వాక్ వెళ్ళాలనీ అనిపిస్తుంది. అంతేకాదు - **'షామియానా వేస్తే ఎలా ఉంటుందీ! సాయంకాలం అలావుంది'** అని ఆశారాజుగారంటే **'ప్రథమాద్రి సభయందుఁ బరిచిన కెంబట్టు జముకాణ మనగ రాగము జనించె'** అని పెద్దనగారు సూర్యోదయ వర్ణన చేశారు. అక్కడ షామియానా - ఇక్కడ జంపుఖానా ( జముకాణము= జంపుఖానా). అక్కడ సూర్యాస్తమయ వర్ణన - ఇక్కడ సూర్యోదయ వర్ణన. ఇంతే తేడా తప్పనిచ్చి ఈ పోలికల్లోని పోలిక స్పష్టమే.

చిల్మన్ కవితా సంపుటి ఇస్లామిక్ సంస్కృతిని ప్రతీకాత్మకంగా నిరూపిస్తూ ప్రాచీన వైభవాన్ని కొంత వరకు కళ్ళకు కడుతుంది. ఆ మేరకు ఇది నవ్య సంప్రదాయ కవిత్వం అని చెప్పుకోచ్చు. అందుకే ఇందులో తల్వార్లూ, కాబిల్ ఇన్సాన్లూ తదితరులూ తదితరాలూ

తరుచుగా కనిపిస్తారు/కనిపిస్తాయి. అలాగే ప్రాచీన ఇతివృత్తాలను స్వీకరించిన చోట్ల కూడా నూతన కోణాలు చూడటం జరిగింది.

ఉదాహరణకు **'అనుభవం'** కవితలో తన ప్రయాణంలో ఎటువంటి తోడు వుంటే బాగుంటుందో ఊహిస్తూ 'రశీద అక్క **ఫాతిమా-రహస్య ప్రేమ తిట్టు'తో** పాటు **'ముతాకక్షల్లో రెండు కాళ్ళ మడిమెల నరాల్ని కోసేసినా.... ఒక్కడే .........ఉస్మానియా దవాఖానకు వెళ్ళిన అన్న వీరమరణం'** కూడా చిత్రీకరింపబడింది.

ఇలా **'ఇస్లామిక్'** ముద్రతో వచ్చిన కవితా సంపుటులు అరుదు. ఇంత చక్కని కవిత్వాన్ని మనకందించిన ఆశారాజుగారికి మనం చెప్పగలిగింది (ఆయన మాటల్లోనే) **'షుక్రియా'** మాత్రమే!

**-పినాకపాణి**

[చిల్మన్ (వచన కవితా సంపుటి) - ఆశారాజు, ప్రతులకు: విశాలాంధ్ర]

# సాహిత్య వార్తలు

## 1. 'శ్రీరస' దసరా సాహిత్య శరత్తు

## శ్రీ నిడమర్తివారి అశీతిపూర్తి మహోత్సవం

### బెంగుళూరు, అక్టోబరు 17,18 తేదీలు, 2003

శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ('శ్రీరస') వారు ప్రతి సంవత్సరం జరిపినట్లుగానే, 2003 అక్టోబరు నెలలో కూడా రెండు రోజులపాటు సాహిత్య శరదుత్సవాలు జరిపారు. మొదటిరోజు ప్రసిద్ధ అభ్యుదయ రచయిత, అనువాదకుడు, బెంగుళూరు 'అరసం' శాఖ అధ్యక్షులు అయిన శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారి అశీతిపూర్తి (80 సంవత్సరాలు నిండిన) మహోత్సవం జరిగింది. ఇది 17-10-2003 శుక్రవారం సాయంకాలం 6 గంటలకు ప్రారంభమయింది. శ్రీమతి శ్యామలాదేవి-ఉమారాజేశ్వరరావు దంపతులకు వేదపండితులు శ్రీ కె. సూర్యప్రకాశరావు బృందం పూర్ణకుంభ స్వాగతంపలికి వారిచే లక్ష్మీగణపతి పూజ చేయించారు. 'శ్రీరస' కార్యదర్శి డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు ఉమారాజేశ్వరరావుగారిని సభకు పరిచయం చేశారు. చిరంజీవి తూలిక (ఉమారాజేశ్వరరావుగారి మనుమరాలు), డా॥ దివాకర్ల రాజేశ్వరి, శ్రీమతి అంబికా

అనంత్, శ్రీ గుత్తి (జోళదరాశి చంద్రశేఖరరెడ్డి, శ్రీ ఇంద్రకంటి పినాకపాణి, శ్రీమతి ఆచంట హైమవతి, శ్రీమతి హైమా భార్గవ్, ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు ప్రభృతులు రాజేశ్వరరావుగారికి కవితా నీరాజనాన్ని సమర్పించారు. హైదరాబాద్ నుండి వచ్చిన డా॥ నిడమర్తి శ్యామలాదేవిగారు తమ బాబయ్యగారిని గురించి కొన్ని ఆత్మీయమైన సంగతులు చెప్పి, తరువాత అభ్యుదయకవి విప్లవకవి అయిన శ్రీశ్రీని గురించి ప్రసంగించారు. బెంగుళూరులోని శ్రీ దాసరి అమరేంద్రగారు, తనకు నచ్చిన ''కాలాతీత వ్యక్తులు'' (డా॥ పి. శ్రీదేవిగారి రచన) అనే నవలను చక్కగా విశ్లేషించారు. తరువాత గుంటూరునుండి వచ్చిన అభ్యుదయ విమర్శకులు కథానికా పరిశోధకులు అయిన శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణగారు ''అభ్యుదయ కథానిక''ను పరిచయం చేశారు. శ్రీరస కార్యదర్శి శ్రీమతి అంబికా అనంత్‌గారు, ఆమె భర్త శ్రీ పి. యస్. వి. అనంతనారాయణగారు కలిసి శ్రీమతి శ్యామలాదేవి - శ్రీ ఉమారాజేశ్వరరావు దంపతులను ఘనంగా సన్మానించారు. ఈ సభకు ఆచార్య తంగిరాల అధ్యక్షత వహించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారి వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది. ఈ సాహిత్య సభ శ్రీయుతులు కె. పి. రావు, ఎ.కె. జయచంద్రారెడ్డి, ఎ. రాజేంద్రనాయుడు, డి.ఎల్.వి.వి. ప్రసాదరావు పంతులుగార్ల సౌజన్యంతో ఏర్పాటు చేయబడింది. వీరికి శ్రీరస ధన్యవాదాలు తెలియజేసింది.

**18-10-2003** శనివారం సాయంకాలం 6 గంటలకు జరిగిన రెండవరోజు కార్యక్రమం ప్రముఖ రంగస్థల నటులు, సంగీత విద్వాంసులు అయిన శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వర వరప్రసాదరావు 'పంతులు' గారి ప్రార్థనతో ప్రారంభమయింది. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు వక్తలను సభకు పరిచయం చేశారు. డా॥ నిడమర్తి నిర్మలాదేవిగారు ''భావకవిత్వం- కృష్ణశాస్త్రి'' అనే అంశాన్ని గురించి; ''త్రిభాషా మహా సహస్రావధాని'', ''సరస్వతీపుత్ర'' శ్రీ వద్దిపర్తి పద్మాకర్ (ఏలూరు) గారు ''బమ్మెర పోతన భాగవతంలోని మహత్వ కవిత్వ పటుత్వ సంపద''ను గురించీ చక్కగా ప్రసంగించి శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేశారు. శ్రీ కె. పి. రావుగారు వక్తలను సన్మానించారు. ఆచార్య తంగిరాల సభకు అధ్యక్షత వహించారు. శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారి వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది. ఈ సాహిత్యసభ శ్రీమతి డి. ఏ. తేజేశ్వరి- శ్రీ కె.ఎం. శ్రీనివాసమూర్తి దంపతుల సౌజన్యంతో ఏర్పాటు చేయబడింది. వీరికి శ్రీరస ధన్యవాదాలు తెలియజేసింది.

## 2. 'శ్రీరస' సాహిత్య సంక్రాంతి, శ్రీ వద్దిపర్తివారి పురాణ ప్రవచనం

### బెంగుళూరు, జనవరి 18, 2004

18-1-2004 ఆదివారం సాయంకాలం 6 గంటలకు శ్రీరస ''సాహిత్య సంక్రాంతి'' సభను ఏర్పాటు చేసింది. శ్రీ డి.ఎల్.వి.వి. ప్రసాదరావు 'పంతులు' గారి ప్రార్థనతో సభ ప్రారంభమయింది. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు సభాసదులకు స్వాగతం పలికారు. వక్తను పరిచయం చేశారు. ''త్రిభాషా మహాసహస్రావధాని'', ''సరస్వతీపుత్ర'' శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారు ''పోతన భాగవతం-గజేంద్రమోక్షణం'' పురాణ ప్రవచనం చేశారు. కర్ణపేయమైన వారి పద్యపఠనం, హాస్యోక్తులు, భక్తి తత్పరతతో కూడిన కథాకథనం శ్రోతల్ని రసానంద డోలికల్లో ఉర్రూతలూపింది. ఆచార్య తంగిరాల సభకు అధ్యక్షత వహించారు. శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారు వందన సమర్పణ చేశారు. శ్రీరస కార్యదర్శులైన శ్రీమతి అంబికా అనంత్‌గారు, డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు ఈ సభకు ఆర్థిక సహాయాన్ని అందించారు. కీ.శే. వి. నారాయణరావు, ఐ.ఏ.యస్., కీ.శే. దివాకర్ల వేంకటావధానిగారల స్మారకంగా ఈ సాహిత్య సభ నిర్వహింపబడింది.

## 3. శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య దశమ వార్షికోత్సవ సభలు

### శ్రీచిటిప్రోలువారికి సన్మానం, శ్రీవద్దిపర్తివారి సాహిత్యోపన్యాసాలు

### బెంగుళూరు, మార్చి 28-30, 2004

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు 1994లో భావ ఉగాదినాడు శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ('శ్రీరస') అనే సాహిత్య సంస్థను స్థాపించారు. ఇది ప్రముఖ ప్రయోగవాద కవి ''పఠాభి''గారి చేతులమీదుగా ప్రారంభమయింది. ''నెలనెలా వెన్నెల'' పేరుతో ప్రతినెలా సాహిత్యగోష్ఠులు నిర్వహించడం, సంక్రాంతికి, ఉగాదికి, దసరాకి పెద్ద ఎత్తున సాహిత్య సభలు ఏర్పాటు చేయడం ఈ సంస్థ చేస్తున్న కార్యక్రమాలు. ఆరుమాసాల కొకసారి ''చైతన్య కవిత'' అనే కవిత్వ పత్రికను కూడా వెలువరిస్తోంది. డాక్టరు దివాకర్ల రాజేశ్వరి, శ్రీమతి అంబికా అనంత్ 'శ్రీరస'కు వ్యవస్థాపక కార్యదర్శులు. గత 'తారణ ఉగాది' నాటికి ఈ సాహిత్య సంస్థను ప్రారంభించి

పదిసంవత్సరాలు పూర్తి అయ్యాయి. ఈ సందర్భంగా మార్చి 28,29,30 తేదీలలో సాహిత్య సభలు నిర్వహించారు.

మార్చి 28వ తేదీ ఆదివారం సాయంత్రం 6 గంటలకు ''కవిరాజశేఖర'' బిరుదాంకితులైన శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు రచించిన ''మాఘమేఘములు'' అనే కావ్య ఆవిష్కరణ సభ జరిగింది. దీనిని ప్రముఖదాత శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు ఆవిష్కరించారు. డా॥ దివాకర్ల రాజేశ్వరిగారు కవిని సభకు పరిచయం చేశారు. గుంటూరు జిల్లాలోని 'గామాలపాడు' గ్రామానికి చెందిన కృష్ణమూర్తిగారు 'కైకేయి'-'తరంగిణి' అనే కావ్యాలు రచించిన లబ్ధప్రతిష్ఠులు. ఇప్పుడు మాఘుని శిశుపాల వధలోని మొదటి మూడు సర్గలను, కాళిదాసు మేఘసందేశాన్ని పూర్తిగాను అనువదించి ''మాఘమేఘములు'' అనే పేరుతో ప్రచురించారు. తన మిత్రుడు ప్రసిద్ధకవి కీ.శే. బీర్నీడు విజయదత్తుగారి కోరికపై ఈ కావ్యాన్ని వ్రాసి, దీనిని వారికే అంకితం చేయడం ముదావహం. కృష్ణమూర్తిగారు రచించిన 'అక్షర దేవాలయము', 'పురుషోత్తముడు', 'మహిష శతకము' - అనే కావ్యాలు అముద్రితములుగా ఉండిపోయాయి. వీనిని కూడా త్వరలో ముద్రించవలసిందిగా నరసింహులు శ్రేష్ఠిగారు, ఇతర వక్తలు కవికి సూచించారు. మాఘాన్ని మేఘాన్ని అనువదించడంలో కవి చూపిన నేర్పును ప్రశంసిస్తూ ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు ( డీన్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి) కృష్ణమూర్తిగారు మిక్కిలి నిరాడంబరుడైన కవి అనీ, పోతనవలె సహజపాండిత్యుడనీ, కృషీవలుడనీ, సీమోల్లంఘనం చేయడానికి ఇష్టపడని ఋషి వంటికవి అనీ అన్నారు. రామబ్రహ్మంగారు 'శ్రీరస'పరంగా శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారికి ''కవితా సుధాకర'' అనే బిరుదును ఇచ్చి గౌరవించారు. శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు కవికి సువర్ణకంకణం తొడిగి, కవిదంపతులను నూతన వస్త్రాలతో సత్కరించారు. రామబ్రహ్మంగారు తాను రచించిన ''ధాన్యలక్ష్మి'' అనే పద్యాలను, కృష్ణమూర్తిగారు తాను రచించిన ''సుహృద్గీతి'' అనే పద్యాలనూ చదివి వినిపించారు.

బెంగుళూరుకు చెందిన ప్రసిద్ధ సంస్కృత పండితుడు బహుభాషావేత్త శతావధాని అయిన డా॥ ఆర్. గణేష్‌గారు మాఘమేఘములకుగల కన్నడ అనువాదాలతో కృష్ణమూర్తిగారి రచనను పోల్చి చెప్పారు. శ్రీ ఇంద్రకంటి పినాకపాణి అనే పండిత కవి కూడా మాఘమేఘముల అనువాదాన్ని ప్రశంసించారు. సభకు అధ్యక్షత వహించిన ఆచార్య తంగిరాలగారు కాళిదాస మాఘుల కవితావైభవాన్ని సోదాహరణంగా

వివరించారు. వేదపండితుల పూర్ణకుంభ స్వాగతంతో సభ ప్రారంభమయింది. తంగిరాలవారు ప్రార్థన చేశారు. సకలావారి జీవిత విశేషాలను గురించీ, వారి ధర్మపత్ని స్వర్గీయ రంగనాయకమ్మగారిని గురించీ అధ్యక్షులు వివరించారు. ప్రముఖకవి ''శ్రీకృష్ణరాజీయము'' కావ్యకర్త అయిన శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారి వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది. ఈ సన్మానసభ శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారి (ప్రతిభా జ్యూయల్రీహౌస్, బెంగుళూరు) సౌజన్యంతో ఏర్పాటు చేయబడింది.

మార్చి 29వ తేది సోమవారం సాయంకాలం త్రిభాషామహాసహస్రావధాని, 'సరస్వతీపుత్ర' శ్రీ పద్దిపర్తి పద్మాకర్ (ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా) అల్లసాని పెద్దనగారి మనుచరిత్రను గురించి చక్కగా ప్రసంగించారు. సభాసదుల్ని ఆనందడోలికలలో ఓలలాడించారు. ఈ సభను కీ.శే. అగ్రహారం కృష్ణారెడ్డిగారి స్మారకంగా వారి కుమారులు శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారు ఏర్పాటు చేశారు. పద్మాకర్‌గారిని వేయినూట పదహార్లతోను శాలువాతోను సత్కరించారు. శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వర వరప్రసాదరావుగారి ప్రార్థనతో సభ ప్రారంభమయింది. తంగిరాలవారు అధ్యక్షత వహించిన ఈ సభ శ్రీ ఇంద్రకంటి పినాకపాణిగారి వందన సమర్పణతో జయప్రదంగా ముగిసింది.

మార్చి 30వ తేది శ్రీరామనవమి. ఆ రోజు కీ.శే. వరకాల లక్ష్మారెడ్డిగారి స్మారకంగా వారి కుమారులు ఆచార్య వరకాల రామనరసింహారెడ్డిగారు ''వాల్మీకి రామాయణం'' గురించి ప్రసంగం ఏర్పాటు చేశారు. ఈ రోజు కూడా శ్రీ పద్దిపర్తి పద్మాకర్‌గారు నవరసభరితంగా ప్రసంగించి సభాసదులను తన్మయీభూతుల్ని చేశారు. నరసింహారెడ్డిగారు వీరిని వేయినూట పదహార్లతోను శాలువాతోను సత్కరించారు. ప్రతి సంవత్సరం శ్రీరామనవమికి ఇలా రామాయణాన్ని గురించి ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తానని వాగ్దానం చేశారు. ఈ సభ ప్రసాదరావు పంతులుగారు చేసిన శ్రీరామస్తుతితో ప్రారంభమయింది. తంగిరాలవారు అధ్యక్షత వహించారు. శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారు వందన సమర్పణ చేశారు.

ఈ విధంగా 'శ్రీరస' దశమ వార్షికోత్సవాల సందర్భంగా మూడు రోజులపాటు సాహిత్య సభలు నిర్వహించి బెంగుళూరు సాహిత్య రసజ్ఞులను ఆనందంతో అలరించిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారినీ, డా॥ దివాకర్ల రాజేశ్వరిగారినీ, అంబికా అనంత్‌గారినీ సభకు విచ్చేసిన సాహిత్య ప్రియులందరూ అభినందించారు.

# చైతన్య లేఖలు

I పూజ్యులు ప్రొఫెసర్ టి. వి. సుబ్బారావు మహోదయులకు ప్రేమతో....

**తే. గీ.** **బెంగుళూరు నుండి పొంగుచున్నవి నేడు**
**తంగిరాలవారి తలపునుండి**
**స్వచ్ఛమైన మధుర సాహితీ సుధలు ''చై**
**తన్య కవిత''లందు తనవి గనుడు.**

**-పి. చింతప్పుడు (చీపురుపల్లి)**

II **''జీవన హేమంత హేలలో**
**కలిమి వైభోగం తెచ్చు భోగి క్రాంతి**
**శాంతి సౌభాగ్యాల నిచ్చు సంక్రాంతి**
**గుండె కుసుమలలో కాంతులిడు మానవతాగీతి''**

**-ఎం. ఆర్. అరుణ కుమారి (చిత్తూరు)**

III ఇస్మాయిల్

కాకినాడ
24-1-2002

సుబ్బారావుగారికి,

నమస్కారం.

ఇన్నాళ్ళకి నేను గుర్తుకొచ్చినందుకు సంతోషం. మీరంతా క్షేమమనుకుంటాను. మీ ఇంగ్లీషుకవి ఏం చేస్తున్నాడు? రాస్తున్నాడా?

వాసు పుస్తకం అందింది. తప్పకుండా రాస్తాను. ఐతే, కాస్త టైమివ్వండి. పాపం, వాసు చాలా కాలం బట్టి పుస్తకం వేద్దామనుకుంటున్నాడు. ఇంకో రెండు రోజులు ఆలస్యమైనా పరవాలేదని చెప్పండి.

జయదేవుని 'గీతా గోవిందం' సటీకగా ఎప్పుడు ప్రచురిస్తారు? 'కృష్ణకర్ణామృతం' లాగే మీ పీఠికతో వేస్తే బాగుంటుంది.

కుకవులతో సహవాసం చెయ్యకండి. ఆరోగ్యం చెడుతుంది.

వాసుకు కూడా ఉత్తరం రాస్తాను. ఉంటాను.

మీ- ఇస్మాయిల్

IV గురువుగారికి నమస్కార పూర్వకమైన ఉగాది శుభాకాంక్షలు.

''ముదురు ముడుగాకు వలువలు వదలు తరులు
క్రొత్త చిగురాకు టుడుపులు కూర్చుకొనుచు
వాటిపై చిత్రవర్ణ పుష్పాదు లద్ద
పిక రుత స్పందనంబున విరియఁబూచి
మూడు పూవు లారుకాయల ముచ్చటొసఁగు
నవ వసంత 'సౌరభ' జీవనంబు మీకు!''

-డా॥ పంపన (పెద్దాపురం)15-3-2002

V (i) ''కళ్ళ కన్నా కనురెప్పలు గొప్పవి
శ్రమ సౌందర్యాన్ని కంటికి అవే కదా నేర్పుతాయి''
(ii)''అదింకా కొనసాగుతూ వుండటమే
ఆశ్చర్యకరమైన విషయం
దాని పేరు జీవితం'' -వేణు సంకోజు (నల్లగొండ), 8-5-2002

VI డా॥పంపన సూర్యనారాయణగారు వారి గురువుగారైన ఆచార్య తంగిరాల సుబ్బారావుగారికి గుండెపోటు వచ్చినదని తెలిసినప్పుడు వ్రాసిన లేఖ. ఇదే వారి ఆఖరి లేఖ.

ఓం

డా॥ పంపన

పెద్దాపురం,
14-9-2002

నమో నమస్తే ఽస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే!

గురువుగారికి డా॥ పంపన పై వాక్యపురస్సరముగా లిఖించు లేఖ.

మీకు ఒంట్లో బాగుగాలేదని తెలిసినది. అప్పటి నుండి నాకు ఆందోళనగా ఉంది. మీకు ప్రస్తుతానికి 500రూపాయలు పంపించాలని నిర్ణయించుకొని, మీరు పదికాలాలపాటు సాహిత్య వరివస్య చేయాలనే ఆకాంక్షతో భగవంతుని ప్రార్థిస్తూ ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

అమ్మగారికి నమస్కారాలు చెప్పండి.

తెలుగు సరస్వతి దురదృష్టవంతురాలు కాదు. మీ చేత సేవ చేయించుకొంటుంది. త్వరలో డబ్బు పంపిస్తాను. మీ ఆరోగ్య స్వాస్థ్యమును తెలుపు లేఖను ఆశిస్తున్న-

-డా॥ పంపన

VII రసరాజు

తణుకు,
25-8-2003

ప్రియసోదరులు డా॥ సుబ్బారావుగారికి నమస్సులు.

ఉభయకుశలోపరి.

M.O. అందింది. మీ వాత్సల్యానికి సదా కృతజ్ఞుణ్ణి. మీ ఆదర్శం, సౌజన్యం సమాజంలో ఎక్కడో కాని కనిపించవు. మీ ఉపన్యాసానికి (17-8-2003 తాడేపల్లి గూడెం) ఆహ్వానం వచ్చింది. అయితే వీలు కలుగలేదు.

గోదావరిపై ఒక పద్యం వెనుక వ్రాసి పంపిస్తున్నాను. పుష్కర కవిసమ్మేళనాలలో దీనిని చదివినప్పుడు మంచి రెస్పాన్స్ వచ్చింది చూడండి. ఉంటాను.

మీ - రసరాజు

## ఏటికోళ్ళు

''ఇన వంశ తిలకుని ఎవడబ్బ సొమ్మని
గురిపట్టి యడిగిన కెరట మొకటి-
వ్యాసవాణిని తెల్గు పల్లకీ యెక్కించి
తొలిపూజ చేసిన అల మరొకటి-
మిరపకాయ టపాను దొరగుండెలో పేల్చి
విప్లవాకృతిగొన్న వీచి యొకటి-
ఎండిన డొక్కలో ఇంత బువ్వను నింపి
తల్లిగా దయగన్న తరగ యొకటి-
ఒక్కనది- ఇంతటి చరిత్ర నొరసికొనుచు
సాగి ప్రవహించుటది లెస్స! సాగరునకు
నీవనే వరత్వము నివ్వటిల్లె
నేమొ! గోదావరీ! ఇవే ఏటి కోళ్ళు!!

''కాచుగావుత చైతన్య కవిత మిమ్ము!''

''క్రొత్త సంవత్సరము గుండె గుమ్మమునకు
పచ్చతోరణమై దీప్తి పంచుగాక!''

- రసరాజు

# చైతన్య కవిత - 2003-2004 మధ్య చేరిన చందాదారులు

పోషక సభ్యులు:

1. కీ. శే. వై. రమాదేవిగారి జ్ఞాపకార్థం ఆమె భర్త శ్రీ వై. వి.వెంకటేశ్వరరావుగారు, నెం. 15, ''ప్రణవ'', 10వ ముఖ్యరస్తా, 26వ అడ్డరస్తా, బనశంకరి, రెండవ హంత, బెంగుళూరు-560 070.

2. శ్రీమతి ఎం. రమాదేవి - డా॥ ఎం. బాగయ్య దంపతులు, ఇంటి నెం. 12-11-833/4/71, అంబేర్‌నగర్, మార్కండేయుని గుడి దగ్గర, అడిక్‌మెట్ట, హైదరాబాద్-500 044.

3. శ్రీమతి విజయలక్ష్మి- డా॥ పి.యు.బి. శర్మ దంపతులు, 9-2-2/1 (మేడమీద), సూర్యభగవాన్ వీథి, ఎల్విన్‌పేట, ఎక్సైజ్‌కోర్టు దగ్గర, గాంధీనగరం, కాకినాడ- 533 004.

4. డా॥కె. ఆశాజ్యోతి - డా॥కె. జనార్దన్ దంపతులు, నెం. 80, రెండవ ముఖ్యరస్తా, ఆరవ అడ్డరస్తా, వీడియో లే అవుట్, విజయనగర, బెంగుళూరు- 560 040.

5. శ్రీమతి & డా॥ బి. వి యస్. మూర్తి దంపతులు (జీవిత సభ్యత్వ నుండి పోషక సభ్యత్వం-)7-29-7, బారువారి సందు, టి. నగర్, రాజమండ్రి - 533 101.

6. డా॥ ప్రభల(నడువమూరి) జానకి, M.A., Ph.D., 206, Leiah Apartments, B-15, Vasundhara Enclave, Delhi-110 096 (జీవిత సభ్యత్వం నుండి పోషక సభ్యత్వం)

జీవిత సభ్యులు:-

1. శ్రీకె. శ్రీనివాసమూర్తి, ఎం.ఏ, హిందీ ఉపన్యాసకుడు, నెం. 44, 2వ అడ్డరస్తా, భక్త మార్కండేయ లే అవుట్, జి. ఇ. ఎఫ్. పోస్టు, విఠల్‌నగర్, బెంగుళూరు -26.

2. డా॥కె. కనకాచారి, 6-3-376, 'కళలగుడి', సావర్కార్‌నగర్, నల్లగొండ- 1.

3. శ్రీ. ఎస్. ఆర్. భల్లం, 4-87-12/2, సుబ్బారావుపేట, ఇందిరానగర్, గాంధీబొమ్మ కూడలి, తాడేపల్లి గూడెం -534 101, పశ్చిమ గోదావరి జిల్లా.

4. కీ. శే. భళ్ళమూడి శ్రీరామమూర్తిగారి జ్ఞాపకార్థం వారి కుమారుడు శ్రీభళ్ళమూడి ప్రభాకరరావు, పెదవాడపల్లె, కొవ్వూరు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా.

5. శ్రీఎం. పుల్లంరాజు, 1-13-2/1, సూర్యనారాయణపురం, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా.

6. శ్రీ వడలి మందేశ్వరరావు, 17-1-391/35, సుబ్రహ్మణ్యనగర్, సైదాబాద్ పోస్టు, హైదరాబాద్ -500 059.

7. శ్రీ వి. జగన్నాథరాజు, రిటైర్డ్ బ్యాంక్ మేనేజర్, రామచంద్రరావు పేట, తాడేపల్లి గూడెం -534 101, పశ్చిమ గోదావరి జిల్లా.

8. కార్యదర్శి, తెలుగు సాహితీ సమాఖ్య, తాడేపల్లి గూడెం -534 102,

9. శ్రీ రామా చంద్రమౌళి, 11-24-498, టెలిఫోన్ భవన్ సందు, పోచమ్మ మైదానం, వరంగల్లు -506 002.

10. శ్రీ వేణు సంకోజు, కవి, నెం. 5, LIGH, H.B. Colony, రాజీవ్ పార్కు దగ్గర, నల్లగొండ -508 001.

11. ప్రిన్స్‌పాల్, ఎ. ఎస్. ప్రభుత్వ డిగ్రీ మహిళా కళాశాల, కాకినాడ - 533 002.

---

## తారణ ఉగాది శుభాకాంక్షలు

1. 'తారణ' వత్సరమ్ము శుభదాయక మౌచు విశేషరీతులన్
పారము లేని సౌఖ్యము లవారణ నిచ్చుచు నెల్ల వేళలన్
కోరిన కోర్కెలెల్ల సమకూర్చుచు కష్ట మొకింత లేకయున్
సారపు జీవనమ్ము కొనసాగుత మీకు నిరామయమ్ముగాన్.

–డా॥ బి.వి. యస్. మూర్తి

2. నూతన మగు నుత్సాహము
నాతత సద్భక్తి జయము నయము సుఖమున్
సీతారాముల దయతో
నీ 'తారణ' నవయుగాది యిచ్చుత మీకున్!

–డా॥ యమ్. బాగయ్య

---

'మీ సౌదర్య మహోభిమానమిది స్వామీ! చిత్ర చిత్రమ్ముగా
నా సంతోష మనంతమై సెలగ, అన్నా! నాదు చిత్రమ్మునే
మీ సాహిత్య విశేష సంచికను క్రొమ్మించుంబలెన్ వేసి, నా
ఆసాసల్ కవితాపథమ్మున సతంబత్యంత చైతన్యమై
వాసింగాంచగ వెన్ను తట్టితిరి; సంభావింతు కైమోడ్పులన్!'

–జి. సుబ్రహ్మణ్య శాస్త్రి



కీ. శే. నారా రామప్పగారు

మన్నీల గ్రామం, అనంతపురం జిల్లా

# చైతన్య కవిత

స్వభాను శరత్తు - తారణ వసంతం

**October 2003 & April 2004**



'విద్వత్కవిశేఖర' శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావుగారు

ధర్మపత్ని శ్రీమతి నవరత్నమాంబగారితో

నల్లూరు, రేపల్లె మండలం, గుంటూరు జిల్లా

చైతన్య కవితా వేదిక. బెంగుళూరు